శ్రీహయగ్రీవాయనమోనమః.

# శ్రీమహేంద్రవిజయము.

బ్రహ్మశ్రీ

దేవులపల్లి సుబ్బరాయశాస్త్రులవారిచేఁ బ్రణీతము.

ఇది

శ్రీమత్కోటలంక, వీరవరము, లోనగు తాలూకాల జమీన్దారులైన

మహారాజ రాజశ్రీ

శ్రీరాజా రావు చెల్లయ్యమ్మారావు బహద్దరువారిచే

గౌరవవశంబునఁ బ్రకటితము.

మద్రాసు:

లారెన్సు అసైలమ్ స్టీమ్ ముద్రాక్షరశాలయందు ముద్రితము.

1907.



బ్రహ్మశ్రీ దేవులపల్లి సుబ్బరాయశాస్త్రులవారు.

శ్రీరామ.

# కవిజీవితము.



ఈ ప్రబంధమును రచియించిన వార లధునాతనులును గవిరత్నంబుల కాకరంబైన దేవులపల్లి వంశమునకు ముక్తామణులు నగు బ్రహ్మశ్రీ సుబ్బరాయ శాస్త్రిగారు 553-వ సంవత్సరము జనవరినెల ది 21-వ తేదికి సరియగు పరీధావినామ సంవత్సర పుష్యశుద్ధ ౧౩ స్థిరవాసరమున జన్మించిరి. వీరి నివాసము శ్రీ పీఠికాపుర సంస్థానములోఁ జేరి యారాజధానికి శాఖానగరంబై, కూచిమంచి తిమ్మకవీంద్రునకుం గడపటి కాఁపురంబైన రావువారి చంద్రమపాలెము. వీరు వైదికబ్రాహ్మణులలోఁ ద్రైలింగ్యశాఖలోనివారు. (తెలుఁగునాటువారు—తెలగాణ్యులు). వీరిది కౌండిన్యస గోత్రము. వీరి తండ్రిగారు వేంకటకృష్ణశాస్త్రులవారు. తల్లిగారు వెంకమాంబ. సోదరులు తమ్మనశాస్త్రి యను నామాంతరముగల వేంకటకృష్ణశాస్త్రులవారు. ఇప్పటికి వీరి వయసు రమారమి యేఁబది మూఁడు వత్సరంబులు. పండితసార్వభౌములును, గవీంద్రులు నైన వీరి వంశీయులు క్రీస్తుశకము 1598-వ సంవత్సరమున శ్రీ పీఠికాపురరాజ్యసంస్థాపకులయిన శ్రీరావు తెనుంగు రాయనిగారి యాదరణాతిరేకంబున నప్పటి నుండియు నిచ్చట నివసించి యున్నారు. చిరకాలముగ శ్రీ పీఠికాపురాస్థాన విద్వాంసులై విశేషగౌరవసత్కారముల నందుచు నప్పు డప్పుడు తమ ప్రభువుల యనుమతి చొప్పున నితరసంస్థానములకేగి తదధీశ్వరులవలన విశేష సమ్మానముల నందుచు, విజయనగరసంస్థానాధీశ్వరులయిన శ్రీవిజయ రామ మహారాజుగారి వలన నగ్రహారపారితోషికము నంది నటుల వంశావతార వర్ణనములోని యీక్రింది పద్యమువలనఁ దెలియ వచ్చుచున్నది.

చం. అతనికిఁ బూనపాటికుల•జాగ్రణియుం గవితారసజ్ఞుఁడుం
బ్రతతయశుండు నౌ విజయ•రామనృపాలవరుండు గౌరవాం
చితమతి రాజధానిదరి•సీమ నొసంగెను సర్వసస్యశా
శ్వతఫలసారమౌ వెలగ•వాడ సమాఖ్య మహాగ్రహారముల్.

ఈ యగ్రహారపారితోషికము నందినవారు రామశాస్త్రులవారు. వీరు సంస్కృతాంధ్రములయందు నిరాఘాటమయిన కవితాధాటి గలవారు. వీరి కవితాశైలి దెలియుటకై నిందు రెండు పద్యముల నుదాహరించుచున్నాఁడను:—

చం. భువి నిదియద్భుతం బొకటి • భూరికృపాపరిపూర్ణ పూనపా
టివిజయరామభూరమణ!• శీవిని నీకరవాలధారచే
నవయవహానియుం గుపల•యాహితభేదములేక మత్స్యభూ
మివిభుఁడు సాంగుఁడై చనియె • మీఁదికి దేవపురాధిగామియై.

మ. మహి నానంద నృపాలు శ్రీవిజయరా•మస్వామి వా ల్సోఁకి నూ
ర్ద్రి హుసేన్ ఖానుని మస్తకం బని మొనన్ • రెండయ్యె రెండయ్యె భ
వ్యహరిద్ఘోటకమండలం బపుడు రం•భాకంచుక గ్రంథియున్
రహి రెండయ్యె జనానులాపమునకున్ • రవ్వైరి వేటారనన్.

వీరి వంశీయులలో బ్రహ్మనశాస్త్రి యను వారు శ్రీమహీపతిరాయనిగారి సంస్కృతంబునఁ దారావళి రచియించి పీఠికాపురంబునకు ననతిదూరమున నున్నశ ర్దీనుపాలె మనగ్రామములో మాన్య క్షేత్రసత్కారము నందినట్లు వంశావతారవర్ణ ములోని,

కం. “ తారావళి కృతిగొని యా, స్ఫారమణిం డతని కొసఁగె•మాన్య క్షేత్రం
బారూఢి భక్తి మదిఁ జెలు, వారఁ బగ్దీనుపాలె మను•గ్రామమునన్.”

అనుపద్యములవలనఁ దెలియవచ్చుచున్నది. తత్కవితాశైలి దెలియుటకై తారావళిలోని కొన్నిశ్లోకముల నిందు వ్రాయుచున్నాఁడను: —

శ్లో॥ శ్రీయుక్తో శ్వినిభప్రభ శ్శుభకర స్సత్యవ్రతః కృత్యవి
ద్ధీరో ధర్మివరో నదోదశరథాల్లబ్ధోదయ స్సానుజః
మస్తానాం పరిశిక్షణాయ సుమతి శ్శిష్టావనాయాచ్యుతో
రేజే రాజవిరాజదాస్యకలిత శ్శ్రీరామనామాంకితః. ౧

శ్లో॥ గుణోత్తర శ్శ్రీరఘురామభద్రో, భద్రాశ్రయో రుద్రశరాసభేత్తా
విత్రాసవద్భ్యస్సవధే మునిభ్య, స్త్రాతనోత్వ శ్రీత్యయమాశరాణామ్

పైనఁ జెప్పఁబడిన రామశాస్త్రుల వారి మనుమఁడగు రామశాస్త్రి సంస్కృత మునందు రామచంద్రోదయచంపువు, సాహిత్యదర్పణ మను నలంకారశాస్త్రము, బాలభాగవతమునకు వ్యాఖ్యానము, మఱియు ననేక నాటకాదుల రచియించి యిప్ప

మైనరు" మహారాజుగా రగు శ్రీవేంకట కుమార మహీపతి సూర్యారావు బహాదరు గారికిం బ్రపితామహు లగు శ్రీవేంకట నీలాద్రిరాయ ప్రభువువారి వలన సాహిత్య చక్రవర్తి యను బిరుదము నందినటుల వంశావతార వర్ణనములోని యీక్రింది పద్యము వలన విశద మగుచున్నది:—

సీ. రచియించె నెవ్వాఁడు•రమ్యచంపూప్రబం, ధమురామచంద్రోద•యమనుదాని
ఘటియించె నెవ్వాఁడు•కనదలంకారశా, స్త్రము వరసాహితీ•దర్పణంబు
వచియించె నెవ్వాఁడు•బాలభాగవతాఖ్య, దనరారుపృథుకావ్య•మునకువ్యాఖ్య
నొనరించె నెవ్వాఁడు•ఘనసిద్ధ్వనిభావ, నవరసంబులఁ బెక్కు•నాటకముల.

గీ. నాతని నుతింపఁ దరమె రా•జాధిరాజ, రావు వేంకట నీలాద్రి•రాయలబ్ధ
సరసతరసాహితీసార•చక్రవర్తి, బిరుదపరికరుఁడలరామ•విబుధ వరుఁడు.

ఈ సాహిత్య చక్రవర్తికిం దమ్ముని కొమరుండగు కృష్ణశాస్త్రి విశ్వగుణాదర్శమునకు వాఖ్యానము, తర్కసార మను న్యాయశాస్త్రగ్రంథము, సాహితీసార మను నలంకారశాస్త్రము, రచియించి యధీతిబోధాచరణప్రచారణంబులఁ దనకీర్తి నెల్లెడల వెల్లడించె ననుటకు వంశావతారవర్ణనములోని యీపద్యము నిదర్శనమైయున్నది:—

సీ. తనదువ్యాఖ్యాక్రియా•దక్షత విశ్వగు, ణాదర్శకావ్యసం•దర్భశిక్ష పలుకఁ
దనఘనపాండితీ•దార్ఢ్యంబు, దర్కసారంబునాఁ దనరు గ్రంథంబు నుడువఁ
దనసరసప్రబం•ధనిబంధనంబు సా, హితిసార మనుమహా•కృతియె తెలుపఁ
దనసర్వవిద్యాప్ర•దానైకతానత. శిష్యప్రశిష్యగో•ష్ఠియె వచింప

గీ. వలకె శ్రీరామచంద్రపా•దారవింద, యుగళసంసేవనప్రాప్త•నిగమశాస్త్ర
సారసారస్యసరణిప్ర•శస్తమధుర, మృదువచనపాళి కృష్ణశా•స్త్రీంద్రమౌళి.

ఈయన కవనరీతి దెలియ నొక శ్లోకమునిందుఁ జేర్చుచున్నాఁడను:—

శ్లో॥ కాచిల్లతా తరుః కశ్చి, త్ప్రీరికాయాం సదమ్భృతం
అపర్ణా సా స తు స్థాణు, ర్దదాతే కాంక్షితం ఫలమ్.

వీరి కూటస్థులు చేసినపుణ్యావిశేషం బేమియో గాని యీత ద్వంశభవు లందఱు సుగుణ గరిష్ఠులై సద్వృత్తాదులతో నలరి, రాజోపకంఠంబుల విరాజిల్లుచున్నారు. వీరి వంశీయు లందఱు శ్రీరామపదభక్తులును, నంతర్వాణివరేణ్యులును, శ్రీపీఠికాపురా

స్థానవిద్వాంసులు నైయున్నారు. ఈ విషయ మీగ్రంథములోని వంశావతారవర్ణనము నందిటు లభివర్ణింపఁబడినది:—

ఉ. వేలుపు రాఘవుండు పదివేలపురాణము లన్యు లెన్న నీ
యేలిక లన్నరావుకులు లెప్పటివారల కప్పు డొప్పు భూ
పాళి నిజంబుగాఁ దన కటంచును దేవులపల్లివంశభూ
పాళిదలంచు చుండుఁ దనపాలిటి కీయుభయంబె ప్రాపుగన్.

ఏతద్వంశీయు లరుదఱుం బ్రబంధనిర్మాతలును, బండితసార్వభౌములు నగుటకు వీరి కూటస్థుఁ డొనరించిన తపోవిశేషంబె కారణంబు. ఇట్టిమహనీయగోత్రసంభవుం డగు నిక్కవికుంజరునకు బాల్యంబున వీరిపితామహు లగు సీతారామశాస్త్రులవారు వీరి కక్షరాభ్యాస మొనర్చి, యప్పటి సాంప్రదాయానుసారముగ సంస్కృతంబునఁ గాళిదాస త్రయము వఱకుఁ జెప్పిరి. పిమ్మటఁ దండ్రిగారి యొద్దఁ గావ్యద్వయము, నైషధము మఱియుం గొన్ని చంపువులు, నలంకారశాస్త్రిముఁ, బెక్కులు నాటకంబులు, సిద్ధాంతకౌముదియుఁ, దర్కప్రకరణములు, నించుక జ్యోతిశ్శాస్త్రగ్రంథపఠనమును గావించిరి. కావ్యపరిచయముగలిగిన నాఁట నుండియు వీరి బుద్ధి కవితాగోష్ఠియం దభినివేశము నొందుటం జేసి శాస్త్రాంతరములయందుఁ జేర నీయక కవితారసంబున వీరి నోల లాడించినది. పిమ్మట నాంధ్రప్రబంధావలోకనము వీరి కవితాసక్తికి మఱి యంత ప్రోత్సాహ మొనరించినది. వీరి పుణ్యవిశేష మేమియొ గాని వీరికవిత్వము ప్రప్రథమము నుండియు నాశువునందును బ్రబంధశైలిగనె యలవడినది. వీరు కావ్య పాఠములఁ జింతన చేయుతఱి నొకనాఁడు వీరికి నాంధ్రలక్షణోపదేశకులును, శ్రీగంగాధర రామరాయ మహారాజ పరిలబ్ధలాక్షణికచక్రవర్తిబిరుదాంకితులు నగు కూచిమంచి వేంకట రాయ కవిగారు, తమ ప్రపితామహుఁ డగుతిమ్మకవిచే రచియింపఁబడిన రసికజనమనోభిరామములోని

కం. నదమా పొత్కిలి జాంబూ, నదమా మైగాయ కోక•నదమా పదమా
పదమా జడ నడుము వియ, త్పదమా నూగారు గూఢ•పదమా చెలికిన్.

అనుపద్యము ప్రసంగవశంబునఁ జదివి యిప్పటివా రీసరణిని మృదుమధుర శైలిం గవిత రచియింప నోపుదురే!!! యన నంతట తత్క్షణంబ యీప్రతిభాశాలి

కం. రసమా తనురుచి జితసా,రసమా వదనంబు వనధ•రసమాహితసా
రసమా, నమాకచము సా,రసమా నడ నుడువు లమృత•రసమా చెలికిన్.

అని చదువ నాశువున నింతసరసముగాఁ జెప్పిన నీయొప్పిదంబునకు మెప్పు లీయఁ దగు నని కౌఁగలించుకొని దేవులపల్లివారింటఁ బుట్టిన నీ కిట్టి ప్రజ్ఞాపాటవం బలవడుట వింతయే యని సంతసంబునఁ బ్రశంసించి యప్పు డప్పు డిట్టి గోష్ఠీవశం బుల వీరినిఁ గవితాగోష్ఠిం బ్రౌఢుఁ జేసిరి. అప్పటి నుండియుఁ జాటువున వీరు శ్లోకం బులు రచియించు చున్నారు. అప్పటివానిలోఁ బ్రధాన మగునది శ్రీరామపంచాశత్తను రామస్తవ మొక్కటియే. ఇది సంస్కృతంబున నేఁబదిశ్లోకములు గలిగి కృష్ణకర్ణామృత మువలె నమృతప్రాయమై యున్నది.

వీరు మొదటి నుండియు గీర్వాణగ్రంథంబులు చదువుచు, గీర్వాణభాషాపరిశ్ర మము చేసిన వారగుటం జేసి, వీరి కవనంబు సంస్కృతపదభూయిష్ఠంబై యున్నయది. వీరి కమరము కాండత్రయము కంఠస్థంబు. విశ్వ నానార్థరత్నమా లాది నిఘంటువులు వచోవిధేయంబులు. వీరు పరిశీలించిన సంస్కృతాంధ్రకావ్యనాటకప్రబంధంబు లనే కంబులు. వీరి నెద్దియేని యొక యుదాహరణంబు గోరఁ బుస్తకభాండాగారం బనఁ దగు వీరి రసనాంగణంబువలన నుండి వేనవేలు పద్యంబులు, శ్లోకంబులు, ప్రసరించు. వీరి గ్రహణధారణాశక్తి యత్యద్భుతంబు. 1879 - వ సంవత్సరము నవంబరు నెల యందు భరతాభ్యుదయప్రబంధకర్తలును, శతావధాన ధురీణులు, నగు శ్రీవిద్వాన్మాడ భూషి వేంకటాచార్యులవారు దమ యవధాన నైపుణ్యంబుఁ జూపఁ బీఠికాపురంబు న కేతెంచి, దాన కర్ణులును విద్యాభోజులును నగు శ్రీగంగాధర రామరాయ మహా రాజు గారి కారుణ్యపాత్రతఁ బడసి, వారి కొల్వుకూటంబునఁ దమ యవధాన విశే షంబు బ్రదర్శించిన, రసికావతంసం బగు నారాజచూడామణి తదవధానవైచిత్ర్యం బునకును నసాధారణధారణాసామర్థ్యంబునకు నెంతయు సంతసించి తగుపారితో షికంబుల వారల సంతుష్టులఁ గావించి యిట్లనిరి:— సభ్యులారా! మనయాస్థానంబున నేతాదృశ విచక్షణు లెవ్వరేని నివ్వటిల్లుదురే! యని ప్రశంసించిన పిమ్మట నాసభాస దులలో నొకరు లేచి దేవా! దేవరసాంస్థానిక విద్వాంసులగు దేవులపల్లి కృష్ణశాస్త్రుల వారిపుత్రులగు సుబ్బరాయశాస్త్రులవారుఁ దమ్మన శాస్త్రులవారు, నీయవధానంబునకు సమర్థు లని విన్నవించిరి. ఇటు లాచెప్పినవార లింతకుఁ బూర్వ మొక్కసారి ప్రభుని మేధా

విశేషంబును, నాశుకవితాకౌశలంబును, మాత్రమెఱింగిన వారలె కాని యిమ్మహానీయుని ధారణాశక్తి గాని యవధాన వైశద్యంబును గాని కనియు వినియు నెఱింగిన వారలు గారు. తత్క్షణంబ యమ్మహారాజుగారు చంద్రమపాలెమునుండి వీరల రావించి మనప్రబంధకర్త కీగోష్ఠి విశదీకరించిన. నీశతావధాని దానింతకుఁ బూర్వము నెన్నఁడేనియు నిట్టి శతావధానము నొనరింపని వాఁడ నయ్యు నభినవభోజులైన దేవర సమక్షవిశేషంబున నిందులకు సాహసింపఁ గల నని విన్నవించి యమ్మఱునాఁడు సావధానంబుగ శతావధానం బొనరించె. "విద్వానేవ విజానాతి విద్వజ్జనపరిశ్రమ" మ్మనునటు లాయాచార్యులవారు నాయవధానంబున విరచింపఁ బడిన పద్యంబు లన్నియు సాకల్యంబుగ నాకర్ణించి యిది యొక సావధానవిరచితం బగు ప్రబంధంబు భాతి రసబంధురంబై యున్నది గాని ఛందోమాత్రప్రధానంబు లైనసాధారణులయవధానంబులవలె నున్నది గాదని విస్మేరచిత్తంబుతో నారాజహంసోత్తముతోఁ గొనియాడుచు విన్నవించి, దానం దనివి తీరక యాయవధానంబులోని యాక్రిందిపద్యముం గూర్చి యిటు ప్రశంసించిరి:— "ఈపృచ్ఛకులలో నొకరిచే

శ్లో॥ ద్రౌపద్యాః పాండుతనయాః, పతి దేవర భావుకాః
న దేవరో ధర్మరాజ, స్సహదేవో న భావుకః.

అను శ్లోకంబునకు నచ్చతెనుఁగున నాంధ్రీకరణం బొనరింప వలయు నని కోరఁబడినది. ఇట్టి యవధానంబుల నిట్టివి యనుచితంబు లని నాచేఁ దెలుపఁబడినను నది పాటిసేయక పరీభవవృత్తితో ని యడుగఁబడినది. అయిన నిమ్మహాకవీంద్రుచే ననాలోచితంబుగ నెంత సరసముగా నాంధ్రీకరింపఁబడినది. హాహా!!! వీరి కూర్పు నేర్పు:—

చం. జముకొడు కీడుపట్టియును • జన్నపుటొరపు జేనికందు దూ
ర్వ్యమనియగాని వెజ్జులకుఁ • బుట్టినవారును బావగార్లు కేం
డ్లు మఱఁదు లౌదు రైదుగురు • లోఁ గడుఁ జిన్నతఁ డెన్న బావగాఁ
డు మఱఁది గాఁడు పెద్దయతఁ • డుం దగఁ ద్రోపది కెంచిచూచినన్

ఇట్టి యవధానంబుల శతధావ్యాప్త మై యున్నమనంబుతో నిట్టిభాషాంతరీకరణం బసాధ్యంబు. ఎవ్వఁడేని నిశ్చలచిత్తంబుతో నిట్టివి రచియింపవలయును. అప్పు

డైన నిట్టి యక్లిష్టపాకంబున రుచియింప రచియించుట యబ్బురంబు గాదే!" యని యాపద్యంబుల నన్నియుఁ దా వ్రాయించికొనియె. అప్పు డమ్మహారాజు గారు మన యాస్థానంబున కెంత విఖ్యాతి దెచ్చిరని కొనియాడుచు విశేషసత్కారంబుల నిమ్మహాపురుని గౌరవించిరి. పదంపడి వీరిచేఁ బలుమాఱులు పలుతావుల యందష్టావధానంబులు చేయఁబడినవి. 1903-వ సంవత్సరంబున శ్రీయెడ్వర్డుగారి పట్టాభిషేకోత్సవ సమయంబునఁ బీఠికాపురంబునఁ జేయఁబడిన యష్టావధానం బిప్పటికిఁ గడపటిది. ఈయవధానముం గూర్చి శశిలేఖాపత్రికలోఁ బ్రశంసింపఁబడినది. దాని నిందుఁ బొందుపఱచు చున్నాఁడను.

"1903 సం॥ ఫిబ్రవరి 24-వ తేది.

శ్రీ పీఠికాపురాష్టావధానాభినందనశ్లోకాః

శ్రీ పీఠికాపురీశసురాస్థాన కవీమహార్ఘ్యవాగ్విభవౌ

శ్రీ సుబ్బరాయశాస్త్రి శ్రీవేంకటకృష్ణశాస్త్రి ణౌజయతాం

శ్లోకవికులావతంసౌ!

శ్లో॥ అద్రాక్షం పద్యరత్నై రమృతరసఝురీవర్షుకై ర్హర్షదాత్రీం
స్పష్టా మష్టావధానప్రసుతతరరచనే పృచ్ఛతా కారజుష్టాం
యాఽస్మాకీం విశ్వహృద్యాం శుభతరకవితా మభ్యపిందం చ తస్మా
దానందాశ్చర్యసింధువ్యతికరవివశీభూతచేతస్కభావమ్.

శ్లో॥ ఆశుకవితాపి భవతో ర్విలంబవిరచితకవిత్వసధ్రీచీ
పతనోతి హృది బుధానాం ప్రమోదపారంపరీసుధాపూరమ్.

శ్లో॥ వివిధావధానసమయే ప్యేవంవిధకవనశాలినో ర్భవతోః
యదిదీయేత విలంబ స్తథాకథంస్యా త్క్వవిత్వసంరంభః.

శ్లో॥ ఈదృక్ప్రతిభాసీమ్నో, ర్హేమ్నోభూషాప్రదానమతనుతయా
సానుగుణపక్షపాతి న్యాచంద్రార్కం సమేధతాం రాజ్ఞీ.

ఇత్యభినందతి శ్రీమదమరచింతాత్మకూరు సంస్థానాస్థానవిద్వాన్ ఘంటాశత ప్రబంధరచనాధురంధర శ్రీబాలసరస్వతీ తర్కతీర్థ శ్రీనివాసాచార్యాః.

ఇప్పు డాత్మకూరుసంస్థానంబు నలంకరించి యుండు బాలసరస్వతీత్యాది బిరుదాంకితు లగుశ్రీమాన్ శ్రీనివాసాచార్యులవారు మాపత్రికలో ముద్రింపఁ బడిన యవధానవిషయమును జూచి మిగుల సంతోషించి యీశ్లోకముల వ్రాసి పంపిరి. విద్వాంసుల పరిశ్రమము విద్వాంసులకే వేద్య మనుట వ్యక్తమే కదా. పత్రికాధిపతి”

అమృతరసవర్షకంబు లగుమీపద్యంబులఁ జూచి మిగుల సంతసించితి. నాకు కవిత్వమునందు నింత సరసముగాఁ జెప్పుటకు నానందరసమగ్నుఁడనైతిని. ఒకింత విలంబ మొనఁగిన పిమ్మట మీకవిత యెట్లుండునో. ఇట్టి ప్రతిభాశాలులకు బంగారు పతకము (మెడల్), సాలుజోడును బారితోషిక మొసఁగిన మ-రా-రా-శ్రీ. శ్రీరాజా రావు చెల్లయమ్మారావు బహదరు కోటంక వీరవరము వగయిరా జమీందారిణీ వార లాచంద్రార్క మభ్యుదయపరంపరాభివృద్ధుల నలరారుఁ గాత మని పైశ్లోకముల కర్థము. ఈయవధానము వీరన్నదమ్ము లిరువురుం గలసి చే యొనర్చిరి.

శతావధాన మొనరించిన యామఱునాఁట నుండియు శ్రీగంగాధర రామ గారయ మహారాజావారు సర్వదా తమసాన్నిధ్యంబున సముచితసత్కారంబులఁ గౌరవించుచుఁ బ్రతిదినంబును వీరితోఁ గవితాగోష్ఠి వినోదించుచు వీరి కవితారుచి యందు విశేష ప్రీతి గలిగి తమతోపాటు వీరికి శాశ్వతకీర్తి సమకూర్పఁ దలఁచి పరంపరాగతమై వ్రాయఁబడి తమదుర్గంబున భద్రంబుగ నున్న 'ఆఖీఖత్తు'(వంశచారిత్రమును.) సంస్కృతంబునఁ జంపూప్రబంధంబుగ నిక్కవీంద్రులచేతను దెనుంగున వీరిసోదరుల చేతను రచియింపఁజేసిరి. సంస్కృతంబున "రాజవంశముక్తావళి" యను పేరిట విలసిల్లుతమవంశ చారిత్రమును 1882-వ సంవత్సరమునందుఁ గృతినంది, సాకల్యంబుగ గ్రంథం బంతయుఁ జిత్తగించి, తమపూర్వరాజన్యుల మాన్యచారిత్రావర్ణనంబువలనను, ననల్పకల్పనాశిల్పనంబులం దనరినకవితామాధుర్యంబువలనను, నానందపరవశులై యిందులకుం దగిన సత్కారం జేఁ జేయఁగలనే యని నారాజ్యంబ మీ కిచ్చితి నని యీకవిసార్వభౌముని సింహాసనాసీనుం గావించి, తమయభినవభోజబిరుదాంకము నవ్వ

ర్థంబుగ నొనరించిరి. పిమ్మట నిక్కవితాపట్టభద్రుండు దేవా! యీరాజ్యభారంబు వహియింప దేవర భుజాదండంబె సమర్థంబుగాని నేవహింప సమర్థుండనే యని తత్క్షణంబ వారి రాజ్యంబు వారికి సమర్పించి "సుకవితా యద్యస్తి రాజ్యేనకి" మ్మను దానికిం దార్కాణ చూపిరి. పిమ్మట శ్రీగంగాధర రామరాయ మహారాజ ప్రతిష్ఠాపితంబైన పీఠికాపురాంగ్లేయప్రధానపాఠశాలయందుఁ దమ ప్రభువుల యానతిని సంస్కృతోపాధ్యాయపదవి నధిగమించిరి. పాఠశాలయందు వీరలుండినది మిక్కిలి స్వల్పకాలము. 1890-వ సంవత్సరమునందు మహాకవిమల్హణకృతంబైన శివస్తవము నాంధ్రీకరించిరి. సంస్కృతంబునంగల శబ్దార్థపదగుంభనం బంతయు గలిగి యా యాంధ్రీకరణం బెంతయు సమంజసముగ నున్నది. ఆసంవత్సరంబుననె శ్రీగంగాధర రామారాయ మహారాజుగారు దేవతాకవితారీతిం బరీక్షింప స్వర్గరాజ్యసింహాసనాలంకృతులైరి. అప్పు డిక్కవిశిరోమణికిం గల పరితాపమునకు మేరయుండునే! తొల్లి కృష్ణరాయనిర్యాణమునందు పెద్దనకవీంద్రుండు తనపరితాపసూచకంబుగ రచియించిన సీ॥ ఎదురైనచో దనమదకరీంద్రము నిల్పి...... ..........అనుపద్యమురీతిని రాజవిశ్వాసదీక్షాదీక్షితులయిన యిక్కవీంద్రశిఖామణులచేఁ దమనిర్వేదద్యోతకంబగు నీ సీసపద్యము విరచింపఁబడియె.

సీ. శతలేఖినీపద్యసంధాన మరసి, మాయల్లుఁ డటంచు నెయ్యమునఁ బలికె
నెలమి వంశావళీకృతి గాంచి వంశంబు,చిగిరించె ననుచు హర్షించి పొగడెఁ
బృథులసింహాసనం బెక్కించి రాజ్యంబు, మీదే యటంచు నర్మిలి నొసంగెఁ
గొమరువిద్యాభ్యాసగోష్ఠిఁ జిరంజీవి, మీశిష్యుఁ డంచుఁ బేర్మిని వచించెఁ
ప్రథితదేవులపలిసుబ్బరాయశాస్త్రి, యస్మదాస్థానవిద్వాంసుఁ డనుచుఁ బిలిచె
నట్టిశ్రీరావురామరాయాధినాథు, నాకమున కన్పె దైవ మేమందు నకట.

అందులకై గుందుచు సంస్కృతోపాధ్యాయత్వము విడనాడి కింకర్తవ్యతానభిజ్ఞులై యుండిరి. మఱియు నాసమయంబుననె దత్తతరాజుగారికిని శ్రీమైనరు రాజుగారికిని దటస్థించిన యభియోగవివాదములు వీరి కిసుమంతైన మనస్థైర్యము గలిగింపవయ్యె. వారియాశ్రితులకు నెంతయుం బరితాపము గలుగఁ బతివ్రతాగ్రగణ్యయు, సాధుజనశరణ్యయు, సుగుణమణిగణావలంబయు నగు శ్రీమంగయాంబ యను శ్రీవారిపట్టంపుదేవేరికిం గల నిర్వేద మింతయని వచింపఁ దరమె. తా మిట్టిదుఃఖసముద్రంబున

నీఁదులాడుచుండినను గృపాలవాలయైన యాసాధ్వీరత్నంబు పరితాపదోధూయమానమానస లగునీకవీంద్రుల కిటుహితోపదేశ మొనరించిరఁట:— విపశ్చిద్వరేణ్యులారా! యిట్టి యిక్కట్టులనె కదా ధైర్యం బవలంబింప వలయు నని మిముఁబోంట్లు పెద్దలు చెప్పుదురు. ఈచిన్నికుమారుని మన కప్పగించి యమ్మహారాజుగారు నాకలోకాధిపత్యము వహించిరి. మనమీ చిరంజీవిని జూచికొని యాదుఃఖము మఱవవలయు నను మొదలగు ధైర్యోక్తుల వీరల నూరడించిరి. ఆమెను జూచియైన మనము ధైర్యముఁ బూన వలయు నని యెట్టకేలకు ధైర్యవంతులైరి. పసంపడి యమ్మహాసాధ్వి యిక్కవీంద్రులనుతనిర్విశేషంబుగ నాదరించిరి. కటకటా! దైవ మెంత పాపిరో గాని యమ్మహాసాధ్వినైనఁ దనచిన్నికుమారుని ముద్దుముచ్చటలఁ జూడ నీయకయ త్వరలో నమ్మహారాజు సాన్నిధ్యమున కనిపె. ఆమె చరమావసరంబున పనకవీంద్రుల బుత్రప్రాయులుగఁ జూచి పోషింపఁ దమ సోదరితో జెప్పిరఁట. నాసమయంబున శ్రీభర్తృదారకులకుఁ బినతల్లియు, సకలసాధ్వీమతల్లియు, నౌదార్యకల్పవల్లియు, నగు మహారాజ రాజశ్రీ శ్రీరాజారావు చెల్లయమ్మారావు బహదరువారగు కోలంక వీరవరము వగయిరా జమీన్దారిణీవారు సముచిత గౌరవంబులతో వీరిం గారవింపకుండిరేనియు, దేవబ్రాహ్మణ భక్తియుక్తులును, స్వామికార్యధురంధరులును, నీతియుగంధరులును, సదాచారసంపన్నులు నగు శ్రీచెలికాని జగన్నాథరాయనింగారు తదభియోగముఖ్యసహాయులుగాఁ జేర్చుకొని, వీరికి ధైర్యోత్సాహములు గలుగఁ జేయకుండిరేనియు, రాజవిశ్వాసప్రథమగణ్యులగు వీరి ధారణాశక్తి లేమగునో నేనూహింపఁ జాలను. అట్టి సమయంబున నయ్యభియోగ విజయార్థంబు శ్రీజగన్నాథరాయనింగారు చెన్నపురికి వీరింగూడఁ దోడ్కొని యేగినప్పు డచ్చటఁ బ్రకటంబైన వీరిప్రజ్ఞావిశేషాదికము గొంత 1895-వ సంవత్సరము ఫిబ్రవరి 9-వ తేదిగల యాంధ్రప్రకాశికయం దిట్లు వర్ణింపఁబడినది.

"A Telugu Pundit."

"మైలాపూరులో నిపు డొక కవిగారు విచ్చేసి యున్నారు. వారి పేరు దేవులపల్లి సుబ్బరాయశాస్త్రులవారు. వీరి నివాసము గోదావరిజిల్లా పీఠికాపురము. వీరాంధ్రగీర్వాణములయం దతిమనోహరముగఁ గవితఁ జేయఁ గలరు. అష్టావధానమును జరిపెదరు. వీరు కొన్నిరోజుల క్రిందట ఫిబ్రవరి ౧-వ తేది సుమారు మూఁడు జాముల వేళకు తిరువలిక్కేణి పార్థసారథిస్వామివారి దేవాలయమునకు వెళ్లగా నపు డశాల

మగుటచే తలుపులు మూయఁబడియుండెను. కొందఱు వైష్ణవులు వెలుపలి మంటపమునఁ గూర్చుండి యేవో గ్రంథములఁ జూచుచుండిరి. ఇమ్మహాకవి వారలం దగ్గరి అయ్యా గర్భమందిరము మూయఁబడియున్నదే! స్వామిదర్శన మెప్పుడు కాఁగల దని పృచ్ఛజేసిరి. స్థలమాహాత్మ్య మెద్ది యేనియున్నన్ వినవలయు ననిరి. వార లందులకిడిన యుత్తరమునఁ దనివి చాలక నాకవీశ్వరుండు భగవంతు నుద్దేశించి:—

శ్లో॥ స్వామిన్! పార్థతురంగచోదనకళాక్లిష్టక్రియాలజ్జయా
లీనస్త్వం కిము గర్భమందిరతలే బద్ధ్వాకవాటద్వయం
అస్తు త్వచ్చరితం జగత్సువిదితం కో వా న వేత్తి స్ఫుటం
సాన్వృత్తిస్తవ పార్థసారథి విభో భక్తానురక్త్యై ఖలు॥

అను శ్లోకముం జదివిన నచ్చటి వైష్ణవులు నివ్వెఱపాటు జెంది స్వామీ! మీరా ర్యులు, యీశ్లోకమం దుండినది, తమ రాశువుగ వచించినట్లు దోచెడిని, అట్లేని దీని యర్థము మీముఖమున విన వలయు ననిన దాని న్వారు తేటతెనుంగున వివరించిరి, ఎట్లనిన:—ఓ స్వామీ! పార్థసారథి విభో! మున్ను పార్థుని గుఱ్ఱములఁ దోలిన నీచకృత్యమునకై లజ్జనొంది యీ రెండు తలుపులును బిగియ మూసి గర్భమందిరమునఁ దాఁగినారా! ఉండుఁగాక నీచరిత్రము జగద్విదితమే! అది యెవరెఱుంగరు. ఆపని తాము భక్తులను రంజింపఁ జేయుకొఱకే కదా! యని నుడివిరి. పిదప నాదేవాలయమునందుండువారలు వారిని మిగుల గౌరవించి, రథసప్తమి దినమున మంచియుత్సవము జరగఁగలదు. ఆదినమున స్వామి దర్శనమునకు విచ్చేయవలయు నని కోరిరి. ఆప్రకారము కవిగారు రథసప్తమిని స్వామిని దర్శించి యీ క్రింది పద్యముల నుడివిరి:—

శా. స్వామీ! నీకరుణాకటాక్ష గరిమన్ వర్ణింపఁగా శక్యమే!
యేమో దాఁగితివంచు మేలముగ నిన్నేఁ బల్కితిం గావునన్
నా మీఁదం బొరపొచ్చెముం దగదు సూ నానాప్రపంచావన
ప్రేమాకల్పక పార్థసారథి హరీ శ్రీకృష్ణ రక్షింపుమీ.

మ. నొగలందు న్నివసించి పార్థునకు సంతోషంబునం గెల్పు గూ
ర్చు గతి న్నామదిఁ గోరుకార్యములకున్ సంతోషంబుగాగం జయం

బగురీతిఁ ఘటియింపు చెన్నపుర వాసా వాసవస్తవ్య భ
వ్యగుణాలంకృతపార్థసారథి ముకుందాభక్త బృందప్రియా.

వీరు మఱియొకసమయమున మైలాపూరులో ఋత్రినుంశలి నుండఁగా 32 యిండ్లు గల చక్రములు మూఁడు వ్రాసి యందు ముగ్గురు కొన్నినియమముల మేరకు నడుగుచు రాఁగా నక్షరములు చెప్పుచు నొకశ్లోకము పృచ్ఛకుని యిష్టదైవస్తుతి గలదిగా నుడివిరి. వ్యస్తాక్షరి నొకటిని వారికిఁ దెలియని భాషలోని వర్ణముల పృచ్ఛకులియ్యఁగా దానిని క్రమముఁ జెప్పుటయే కాక తలక్రిందుగ నొప్పఁ జెప్పిరి. అడిగిన సంఖ్యగల యక్షరమును జెప్పిరి. వాని వివర మేమనిన:— ఒక చక్రము దత్తాత్రేయనుతి. ఇందుఁబృచ్ఛకుఁడు 32 యిండ్లగల చక్రమునఁ గోరినయింటి కక్షరముఁ జెప్పుచు రాఁగా 32 యిండ్లను నిండిన వెనుకఁ గ్రమముగఁ జదువ నీశ్లోక మేర్పడియె:—

శ్లో॥ సమస్తసద్గుణాధారం, యోగిసంఘాతశేఖరం
కార్తవీర్యార్జునగురుం, దత్తాత్రేయమహం భజే.

మఱియొక చక్రమున నిట్లే యాంజనేయ స్తుతి నిమిడ్చిరి. ఇందుఁబృచ్ఛకులు మహారాజశ్రీ గురుజాడ అప్పారావు పంతులుగారు బి. యే. అదెట్లనిన:—

శ్లో॥ సీతాశోకాపహర్తారం వారాశితరణక్షమం
శ్రీరామపాదభక్తంత మాంజనేయంభజామ్యహమ్॥

దీని పే రుద్దిష్టాక్షరి. ఇఁక మూఁడవయది నిర్దిష్టాక్షరి. ఇందుకు 32 యిండ్లుగల చక్రమును వ్రాసి యందు జేసి సంఖ్యగల యిండ్ల నెల్లఁ బృచ్ఛకుని యిష్టమువచ్చినట్లు వాట్లలను వ్రాసియుంచఁగాఁ గవి యావాట్లల పయిన యుక్తములయిన యచ్చులను సరి సంఖ్యగల యిండ్ల నేదేని యక్షరముల నిమిడ్చి పృచ్ఛకు నిష్టదేవతను స్తుతియించుట. దీనికైరచియించిన శ్లోక మెద్దియనిన:—

శ్లో॥ శార్వీపతే నమో గంగా, జటామాలే సితా భ తే
చంచత్తేజో యతీడ్ధ్యేయ, రమేట్ప్రాతేషు సుందర.

ఇది శంకరస్తుతి. వ్యస్తాక్షరికిచ్చినది యిందుక్రింద నుదాహరింపఁబడుచున్నది.

శ్లో॥ టోల్ ఫర్ ది బ్రేవ్, ది బ్రేవ్ దటార్ నో మోర్
ఆల్ సంక్ బినీత్ ది వేవ్, క్లోస్ బై దేర్ నేటివ్ షోర్

ఇందులోని వ్యస్తాక్షరియు నుద్దిష్టాక్షరియు నేకకాలముననే జరపఁబడినవి. అష్టావధానము చేయఁగలవీరి కివి రెండేకకాలమునఁ జేయుట గొప్పపనిగాకున్నను నాసమయమున నచట నుండిన నాకు మాత్ర మచ్చెరువుగఁ దోఁచెను. దీనియందలి యక్షరముల వేర్వేర చీటీల పయి వ్రాసి వరుస తప్పించి యవు దవు డొకటిగ నిచ్చినఁ గడపటఁ గ్రమముగ నడిగినఁ గ్రమముగ నొప్పఁ జెప్పిరి. తల క్రిందుగను జదివిరి. ఇన్నవ యక్షరమేదియన్నం దక్షిణము బదు లొసంగిరి. ఇట్టిధీయుక్తులఁ గల్పించుఁ నప్పరమేశ్వరుని నేర్పు నేమని కొనియాడుదుము. ఇట్టికవులం దగురీతి సన్మానింపఁ గల భోజుఁడుఁ, గృష్ణదేవరాయలు నెందున్నవారో కదా.

కడచినవారమునందుఁ దమ పత్రికలో మైలాపూరిలో జరిగిన యొకయష్టావధానముం గూర్చి కొంత వ్రాయఁబడి యుండె నాయవధానముఁ జేసినవారి ప్రజ్ఞావిశేషంబుల విశదీకరించినది చాలదని వగచి తద్వృత్తాంతము వివరంబుగ నీక్రిందఁ బొందుపఱచెద. సభ జరిగినది గత ఫిబ్రవరిమాసము 19-తేది రాత్రి 9-గంటలు మొదలు 11-గంటలవఱకును; స్థలము శ్రీశివస్వామయ్యర్ బి. యే. బి. యెల్ గారి గృహము; సభ్యులు బ్రహ్మశ్రీ వేదమూర్తులయిన యజ్ఞేశ్వరదీక్షితులవారు, మ-రా-శ్రీ-హైకోర్టు వకీళ్లు రామకృష్ణయ్యర్, వి. సి. దేశికాచారియార్, వి. సి. శేషాచారియార్, పి. యస్ శివస్వామయ్యర్, యస్, గోపాలస్వామయ్యంగారు, ఆర్. కుప్పుస్వామయ్యర్, జీవాజీగోపాలగండెకర్, పోలీసుఆఫీస్ మేనేజర్ ఎ. కృష్ణస్వామయ్యర్, ఎమ్. కృష్ణరావుగారు, ఎస్. విశ్వనాథయ్యర్, మొదలగు ననేకులు. అవధానిగా రేకకాలమున గమనించిన విషయము లెవ్వియనిన:—1 వి. సి. దేశికాచారియారుతోఁ జతురంగము నాడుచుండిరి. 2. ఒకటొకటి సంబంధములేని మూఁడు శ్లోకములయందుండి ప్రతిశ్లోకమునందు నొకపాదము చొప్పున మూఁడుపాదములు ముగ్గురు సదస్యులు చదివిన, నవధానిగారు స్వకపోలకల్పితముగా నాల్గవపాద మొకటి రచియించి, యానాల్గుపాదములతో నైన నీశ్లోకమునకన్వయమును నర్థమును జెప్పిరి:—

శ్లో॥ అయంస తేతిష్ఠతిసంగమోత్సుకో, విభావరీభాతిసదంబుజేన
మద్ధుద్వయంకుండలపండితానా, మగ్రేసరోదాతుమనావృగాక్షి.

బగురీతిఙ్ ఘటియింపు చెన్నపుర వాసా ◆వాసవస్తవ్య భ
వ్యగుణాలంకృతపార్థసారథి ముకుం◆దాభక్త బృందప్రియా.

వీరు మఱియొకసమయమున మైలాపూరులో మిత్రమండలి నుండఁగా 32 యిండ్లు గల చక్రములు మూఁడు వ్రాసి యందు ముగ్వురు కొన్నినియమముల మేరకు సమగుచు రాఁగా నక్షరములు చెప్పుచు నొకశ్లోకము పృచ్ఛకుని యిష్టదైవస్తుతి గలదిగా నుడివిరి. వ్యస్తాక్షరి నొకటిని వారికిఁ దెలియని భాషలోని వర్ణముల పృచ్ఛకు లియ్యఁగా దానిని క్రమముఁ జెప్పుటయే కాక తలక్రిందుగ నొప్పఁ జెప్పిరి. అడిగిన సంఖ్యగల యక్షరమును జెప్పిరి. వాని వివర మేమనిన:— ఒక చక్రము దత్తాత్రేయనుతి. ఇందుఁబృచ్ఛకుఁడు 32 యిండ్లగల చక్రమునఁ గోరినయింటి కక్షరముఁ జెప్పుచు రాఁగా 32 యిండ్లను నిండిన వెనుకఁ గ్రమముగఁ జదువ నీశ్లోక మేర్పడియె:—

శ్లో॥ సమస్తసద్గుణాధారం, యోగిసంఘాత శేఖరం
కార్తవీర్యార్జునగురుం, దత్తాత్రేయమహంభజే.

మఱియొక చక్రమున నిట్లే యాంజనేయ స్తుతి నిమిడ్చిరి. ఇందుఁబృచ్ఛకులు మహారాజశ్రీ గురుజాడ అప్పారావు పంతులుగారు బి. యే. అదెట్లనిన:—

శ్లో॥ సీతాశోకాపహర్తారం వారాశితరణక్షమం
శ్రీరామపాదభక్తంత మాంజనేయంభజామ్యహమ్॥

దీని పే రుద్దిష్టాక్షరి. ఇఁక మూఁడవ యది నిర్దిష్టాక్షరి. ఇందు 32 యిండ్లుగల చక్రమును వ్రాసి యందు బేసి సంఖ్యగల యిండ్ల నెల్లఁ బృచ్ఛకుని యిష్టము వచ్చినట్లు హల్లులను వ్రాసియుంచఁగాఁ గవి యాహల్లుల పయిన యుక్తములగు నచ్చులను సరి సంఖ్యగల యిండ్ల వేరేని యక్షరముల నిమిడ్చి పృచ్ఛకు నిష్టదేవతను స్తుతియించుట. దీనికై రచియించిన శ్లోక మెద్దియనిన:—

శ్లో॥ కాళీపతే నమో గంగా, జటామాలే సితాభ తే
చంచత్తేజో యతీడ్గేయ, రమేట్చాతేషు సుందర.

ఇది శంకరస్తుతి. వ్యస్తాక్షరికిచ్చినది యిందుక్రింద నుదాహరింపఁబడుచున్నది.

శ్లో॥ టోల్ ఫర్ ది బ్రేవ్, ది బ్రేవ్ దటార్ నో మోర్
ఆల్ సంక్ బినీత్ ది వేవ్, క్లోస్ బై దేర్ నేటివ్ షోర్

ఇందులోని వ్యస్తాక్షరియు నుద్దిష్టాక్షరియు నేకకాలముననే జగపఁబడినవి. అష్టావధానము చేయఁగలవీరి కివి రెం డేకకాలమునఁ జేయుట గొప్పపనిగాకు న్నను నాసమయమున నచట నుండిన నాకు మాత్ర మచ్చెరువుగఁ దోఁచెను. దీని యందలి యక్షరముల వేర్వేర జీటీల పయి వ్రాసి వరుస తప్పించి యప్పుడప్పు డొక టిగ నిచ్చినఁ గడపటఁ గ్రమముగ నడిగినఁ గ్రమముగ నొప్పఁ జెప్పిరి. తల్క్రిందుగను జదివిరి. ఇన్నవ యక్షరమేదియన్నం దక్షణము బదు లొసంగిరి. ఇట్టిధీయుక్తులఁ గల్పించుఁ నప్పరమేశ్వరుని నేర్పు నేమని కొనియాడుదుము. ఇట్టికవులం దగురీతి సన్మా నింపఁ గల భోజుఁడుఁ, గృష్ణదేవరాయలు నెందున్నవారో కదా.

కడచినవారమునందుఁ దపు పత్రికలో మైలాపూరిలో జరిగిన యొకయష్టావధాన ముం గూర్చి కొంత వ్రాయఁబడి యుండె నాయవధానముఁ జేసినవారి ప్రజ్ఞావిశేషం బుల విశకదీరించినది చాలదని వగచి తద్వృత్తాంతము వివరఁబుగ నీక్రిందఁ బొందు పఱచెద. సభజరిగినది గత ఫిబ్రవరిమాసము 19-తేది రాత్రి 9-గంటలు మొదలు 11-గం టలవఱకును; స్థలము శ్రీశివస్వామయ్యర్ బి. యే. బి. యెల్ గారి గృహము; సభ్యులు బ్రహ్మశ్రీ వేదమూర్తులయిన యజ్ఞేశ్వరదీక్షితులవారు, మ-రా-శ్రీ-హైకోర్టు వకీల్లు రామ కృష్ణయ్యర్, ఏ. సి. దేశికాచారియార్, వి. సి. శేషాచారియార్, పి. యస్ శివస్వా మయ్యర్, యస్, గోపాలస్వామయ్యంగారు, ఆర్. కుప్పుస్వామయ్యర్, జీవాజీగోపా లగండెకర్, పోలీసుఆఫీస్ మేనేజర్ ఎ. కృష్ణస్వామయ్యర్, ఎమ్. కృష్ణరావుగారు, ఎమ్. విశ్వనాధయ్యర్, మొదలగుననేకులు. అవధానిగా రేకకాలముగ గమనించినవిషయము లెవ్వియనిన:—1 వి. స. దేశికా చారియారుతోఁ జదురంగము నాడుచుండిరి. 2. ఒక టొకటి సంబంధములేని మూఁడు శ్లోకములయందుండి ప్రతిశ్లోకమునందు నొకపాదము తీసిన మూఁడుపాదములు ముఖ్యాను సభ్యులు చదివిన, నవధానిగారు స్వకపోలకల్పి తముగా నాల్గవపాద మొకటి రచియించి, యానాల్గుపాదములతో నైన నీశ్లోకమున కన్వయమును నర్థమును జెప్పిరి:—

శ్లో॥ అయంస తేతిష్ఠతిసంగమోత్సుకో, విభావరీభాతిసదంబుజేన
మడ్డుద్వయంకుండలపండితానా, ము గ్రేసరోదాతుమనావ్యగాక్షి.

ఇందు మొదటిపాదము కుప్పుస్వామయ్యరు గారును, రెండవ పాదము శివస్వామయ్యరుగారును, దృతీయపాదము శేషాచార్యులవారును, నిచ్చిరి. 3 వ్యస్తాక్షరి. ఇందు శ్రీదేశికాచార్యులవారు "పళమయియైనప్పుడు పదియాదేనికా కెళమెయ్యెక్కిలిందానల్పు" అను నలువపద్యమునందలి యక్షరముల వేర్వేరు చీటీలపై లిఖియించి వానివరుస దప్పించి యపుడపు డొక్కొక యక్షరము నిచ్చుచు రాఁగా నవధానాంతమున శాస్త్రులవారు దానిం గ్రమంబుగఁ జదివిరి. 4 నిర్దిష్టాక్షరి. ఇందు శ్రీదేశికాచార్యులవారొక శ్లోకమున పరిసంఖ్యగల స్థానములయం దుండు నక్షరము లివియై యుండవలయు నని నిర్దేశించి శ్రీరామనుతి వచ్చునటుల నొకశ్లోకము రచింపుఁ డన్న నవధానిగారీరీతిగ రచియించి చదివిరి:—

శ్లో॥ సీతేశ్లోకైకనాథావభృశంరామాళిగోశుభ,
ద్వ్రటయూథప్రియోదారశ్రీలస్వచ్ఛభుజాయుధ.

5. ఆశుధార. ఇందు శ్రీశివస్వామయ్యరుగారకస్మాత్తుగా నవధానకాలమున నారికేళతరువు వర్ణింపుఁ డన్న నవధానిగారీశ్లోకము నుడివిరి:—

శ్లో॥ నారికేళతరురేష శోభతే, వారియంత్రపృథునాళవత్పురః
ఆత్మనోగ్రఫలనిర్గళత్పయఃపూరబింబపరిపూర్ణచత్వరః ॥

6. అవధానకాలమం దవధానిగారిపయి శ్రీశేషాచార్యులవారపుడపు డొకపుష్పము వైచుచుండ వారు వాని లెక్కించి 143 అని చెప్పిరి. 7 అట్టికాలమున శ్రీవిశ్వనాథయ్యరుగారు కొన్ని రాగములు శుద్ధముగాను మఱికొన్ని మిశ్రమముగాను బాడిన వానిం గమనించుచుండి యవధానిగా రవధానాంతమున వాని నామములను వరుసయుఁ జెప్పిరి. ధీనిధు లగు నీ శాస్త్రులవారా కాలమున జరిగిన విశేషములవిడి నెంతయుం జలింపక నీవివిధక్రియలం గావించుటయు గాక, మఱికొంద ఱున్నచో వారుకోరిన వర్ణనలం బొందుపఱచి యేవృత్తముల నయినం గవిత్వముం జెప్పెద మనిరి కాని, యాకస్మికముగ నాఁ డేయిం గూడినయాసభయందు సభ్యులుకొద్దిగ నుండినందువలనను గాలవిళంబన మగునని వెఱచియు నింకొకదినమునఁ బగటిపూఁట నింకొక గొప్పసభ గూర్పఁ దలంచి యప్పటి కాసభం జాలించిరి. ఆశుకవిత్వములును నష్టావధానములయందలి కవిత్వములును రసవంతములై యుండఁ జాలవు. ఈయవధానిగారి కవిత్వ మట్టు గాక యెల్లప్పుడు సరసమై మెలఁగుట మిగుల నాశ్చర్యము. ఇది యాయవధాన వృత్తాంతము. ఇఁక వీరి

యాశుకవిత్వమునకు రెండు దృష్టాంతములఁ జెప్పెద. ఫిబ్రవరి 24 వ తేది యమావాస్య నాఁ డీయవధానిగారును నేనును, మఱికొందఱుమిత్రులతో సముద్రస్నాన మపేక్షించి యుదధితీరంబునఁ బోవు చుంటిమి. అపుడు పయిఁబయిఁ గ్రమ్ముకొని మ్రోయుచు వచ్చుచుండెడు కెరటముల నీక్షించి శ్రీశాస్త్రులవా రీశ్లోకముల నుడివిరి:—

శ్లో॥ అపారోహమితివ్యర్థంగర్జసిత్వంపయోనిధే
త్వత్తుల్యోవాధికోవానుసంసారోస్మాభిరీక్ష్యతే.

శ్లో॥ గోత్రత్రాణధురీణపావనధునీశ్లిష్టాక్ర తెబాడబా
ధారత్వన్మహిమానభిజ్ఞమనసాస్యబ్ధైమయాగర్హితః
క్షంతవ్యంభవతాసకల్బిషతనుర్యస్త్వజ్జలే మజ్జతి
ద్రాగున్మజ్జతిసోప్యపంకవిషయస్సంసారతోసారతః.

ఒకరేయి నీయవధానిగారును, పైనజెప్పఁబడిన దీక్షితులవారును, శ్రీశివస్వామయ్యారుగారి యింట నుండఁగా వారు మను యెదుటనున్న "మూన్‌లైటుషెడ్డు" దీపమును ప్రజ్వలింపుఁ డన శాస్త్రులవా రీశ్లోకము నాక్షణమే చదివిరి:—

శ్లో॥ దీపచంద్రమసోర్మధ్యేదీపపవహిందీప్తిమాన్
బిభేతితమసశ్చంద్రస్తమోదీపాద్బిభేతియత్.

వీరు శ్రీరామభక్తులు గావున రాతినాతిగఁజేయు రాముని మహిమంబు చేతనంబుల నిట్లు జేయు టరుదే!

మఱియు నీకవిగారు తమ భక్తపాదారకుని యభియోగవాద విజయ సమయమున నిక్కడకు వచ్చియుండి 1896 సం॥ నవంబరు నెల 2-వ తేదిని సాయంకాలమున శ్రీ పార్థసారధిస్వామివారి కోవెల కేగ నపుడును దలుపులు మూయఁబడి యున్నందున నీ క్రింది పద్యమును నుడివిరి:—

ఉ. వచ్చినవేళ నెప్పుడుఁ గవాటము జాటుగ మాటుకొందువో
లచ్చిమగండ! నీకుఁగల లజ్జ తెలుంగు నెఱుఁగలేక వి
వ్వచ్చునినాఁటిపోటు దలఁపుండిడి కోపకడజ్జయంబు మా
కచ్చుపడంగఁ దెచ్చియిడునంతకుఁ గావలెఁ బార్థసారధీ!

ఆ మఱునాఁడు పగలు 11 ఘంటలకు స్వప్రభుపక్షంబుగాఁ దవభియోగవాదము. స్థిర పఱుపఁబడిన తీర్మానముతో జయంబుగలిగె ''

ఇట్లు,

విద్యాభిమాని.

వీరి జ్ఞాపకశక్తిం గూర్చి వీరి యవధానములం దిలకించిన చెన్నపట్టనవాస్తవ్యులచే నొసఁగఁబడిన యోగ్యతా పత్రికలను, మఱిగొందఱు తగుమనుష్యులచే నీయఁబడిన నిర్ణయపత్రికలను నిందు వ్రాసి తదనంత రోదంతము విశదీకరించుచున్నాఁడ.

MYLAPORE
*8th November*, 1896.

Devulapally Subbaraya Sastri Garu, a Pundit attached to the palace of the minor Rajah of Pittapur, gave a performance of Ashtavadhanam before a large audience at Mylapore. His remarkable powers of memory in repeating in their proper order, over fifty letters in Tamil and Hindustani (languages with which he is unacquainted), given out to him at random and at long intervals and his ready versification in Telugu and Sanskrit on specified subjects in spite of numerous restrictions, were greatly admired and every one present was immensely pleased with the whole performance.

(Sd.) P. R. SUNDARA AIYER,
*High Court Vakil.*

,, T. GEEVAJI,
*High Court Vakil.*

,, V. C. SESHACHARI,
*High Court Vakil.*

,, K. KRISTNAMACHARI,
*High Court Vakil.*

,, R. ANANTAKRISTNA SASTRI,
*Pandit, Adyar Library.*

,, A. KRISTNASWAMY AIYER,
*Manager, Office of the Inspector General of Police, Madras.*

(Sd.) R. SWAMINADHA AIYER,
*Ag. Professor of Mathematics Presidency College, Madras.*

,, S. KUPPUSWAMI AIYER,
*1st Assistant, Revenue Board.*

,, V. KRISTNASWAMI AIYER,
*High Court Vakil.*

,, V. KALYANARAMA AIYER,
*High Court Vakil.*

మైలాపురి

8-తేది నవంబరు 1896.

శ్రీ పీఠికాపురము మైనరురాజుగారి యాస్థానవిద్వాంసు లగు దేవులపల్లి సుబ్బరాయశాస్త్రులవారిచే మైలాపురంబున నొక గొప్పసభయం దష్టావధానము జరపఁబడినది. వీరికిఁ దెలియని హిందూస్థాని ద్రావిడభాషలలో వరుస క్రమమునుఁ దప్పించి మిక్కిలి వ్యవధికాలములయందు నీయఁబడిన యేఁబదియక్షరములకు నధికముగల పద్యమును యుక్తక్రమమున మరల నప్పగింపఁగలిగిన వీరి ప్రసిద్ధికర మగుజ్ఞాపకశక్తి యు, నెన్నియభ్యంతరములు గలుగఁజేసినను గోరిన విషయములలోఁ దెనుఁగునను సంస్కృతమునందును నాశుకవిత్వముఁ జెప్పనేర్పును, మిక్కిలియు నాశ్చర్యమును గలిగించినవి. సభాసదు లందఱు వీర లొనరించిన యవధానమునకు మిగుల నానందముఁ బొందిరి.

| | |
|---|---|
| పి. ఆర్. సుందరయ్యరు, హైకోర్టు వకీలు. | ప. కృష్ణస్వామి అయ్యర్, ఇనస్పెక్టరు జనరల్ ఆఫీసు మానేజరు. |
| టి. జీవాజి, హైకోర్టు వకీలు. | ఆర్. స్వామినాథ అయ్యర్. ఆక్టింగు ప్రొఫెసరు. |
| పి. సి. శేషాచారి, హైకోర్టు వకీలు, | యస్. కుప్పుస్వామి అయ్యర్, ఫస్టు అసిస్టెంటు రివిన్యూబోర్డు. |
| కె. కృష్ణమాచారి, హైకోర్టు వకీలు. | వి. కృష్ణస్వామి అయ్యర్, హైకోర్టు వకీలు. |
| ఆర్. అనంతకృష్ణశాస్త్రి, అడియారు లైబ్రరీపండితుఁడు. | వి. కల్యాణరామయ్యర్, హైకోర్టు వకీలు. |

మఱియు నీ నెల 8-వ తేదీని జరిగిన యీ యవధాన సమయమున మ-రా-రా-శ్రీ వి. కృష్ణస్వామి అయ్యరుగారు కవిగారి కొక సమస్యనొసఁగిరది యుద్దియనిన:—

" శ్లో. చంద్రజ్యోత్స్నాస్ఫురతిగగనే పశ్యనీలోత్పలశ్రీః."

ఇందునకుం గవిగా రయిదు నిమిషములలో నిట్లు రూపకాతిశ యోక్త్యలంకారముగా విస్ఫూర్తిఁ జేసిరి:—

శ్లో. జీమూతాళిర్వ్యహతి మహతీస్తార కాశ్చంచరీకా
శ్చాంపేయాగ్రే దధతి వలనోల్లాస లీలామిదానీం
చిత్రంమందక్రమ ముపసరత్యద్రి శృంగాగ్రతోసౌ
చంద్రజ్యోత్స్నా స్ఫురతి గగనే పశ్యనీలోత్పలశ్రీః.

Devulapalli Subbaraya Sastri and Venkatakrishna Sastri have very kindly shown Mrs. Andrew and myself some wonderful feats of memory which have greatly pleased us. We have never seen any thing so good before.

PITTAPUR, 16-12-03. (Sd.) J. ANDREW, (*Member Board of Revenue*).

దేవులపల్లి సుబ్బరాయశాస్త్రిగారును నీ వెంకట కృష్ణశాస్త్రిగారును విశేష దయతో మాదొరసానిగారికిని నాకును జ్ఞాపకశక్తిని గనంబఱచెడు నద్భుత వినోదములను జూపిరి. ఇందువల్ల మేము విశేషానందము నొందితిమి. ఇంతబాగుగ నున్న దానిని మే మెన్నడును గని యుండలేదు.

పితాపురం, 16-12-1903. జే. ఆన్డ్రు (రివిన్యూ బోర్డు మెంబరు).

Pandits D. Subbaraya Sastry and D. V. Krishna Sastry gave an excellent performance in Indian Mnemonics at Pittapur on the 13th Instant. I was very much pleased with the wonderful feats of memory performed by the highly talented brothers.

PITTAPUR, 14-4-1904. (Sd.) L. C. WILLIAMS, *Inspector of Schools, Northern Circle.*

పండితులగు దేవులపల్లి సుబ్బరాయశాస్త్రిగారును నీ వేంకటక్రిష్ణ శాస్త్రిగారును పిఠాపురమందు నీ నెల పదమూఁడవ తేదిని జ్ఞాపకశక్తిని దెలిపెడి యద్భుతమైనహిందూదేశసాంప్రదాయపు వినోదమును జూపించిరి. ఇట్టి యతిశయమైన ప్రతిభగల యీ యన్నదమ్ములచేత కనఁబఱుపఁబడిన పై వినోదములకు నేను మిగుల నానందించితిని.

యల్. సి. విలియంస్,

పిఠాపురం
14-4-1910.

ఇన్స్పెక్టరు ఆఫ్ స్కూల్సు,
నార్తరన్ సర్కిల్.

శ్రీమైనరు రాజావారి యభియోగవిజయవార్త నాకర్ణించి యమితానంద రసమగ్నులై యత్యుత్సాహముగల తద్విజయోత్సవ వాసరంబులనిక్కవిగారిమ్మహేంద్రవిజయ ప్రబంధము విరచింప నారంభించి ముగియించిరి. పిమ్మట 1903 సంవత్సరమున శ్రీరాజా చెల్లయమ్మారావుబహదరు జమీన్దారిణీ వారిచేఁ బ్రతిష్ఠాపితంబైన పిఠాపురము హైస్కూలులో మరల వీరు సంస్కృతోపాధ్యాయత్వమునొందిరి. ప్రస్తుతము వీర లాబాల్య కవితాప్రసంగ శీలాభిలాషులును, సకలసుగుణగణవిరాజమానులును, దినదినప్రవర్ధమానులును, శ్రీమద్రావువంశపయఃపారావార రాకాసుధాకరులును, శ్రీగంగాధర రామారాయ మహారాజతనూభవులును, తత్పట్టమహిషీమంగయాంబికాగర్భశుక్తిముక్తామణులును, బాల్యావసానపరిలబ్ధహూణభాషాప్రథమపరీక్షాసాఫల్యులును, సకలహూణప్రభుజనాభిశ్లాఘనీయచారిత్రులు నగు శ్రీమద్రావు వేంకటకుమార మహీపతి సూర్యారాయప్రభువరేణ్యులకు నుపాధ్యాయులుగ నున్నారు. మొన్నటి విజయదశమి నాఁడు జరిగింపఁబడిన దర్బారు మహోత్సవమునందు "రామరాయవిలాస" మను మతియొకప్రబంధమును విరచించి శ్రీమైనరు మహారాజుగారికిం గృతి నొసంగిరి. అప్పుడిక్కవీంద్రుల యెడలఁ గనపఱుపఁబడిన గౌరవసత్కారంబులు తమ తండ్రిగారిచే జరిగింపఁబడినగౌరవంబులతోఁ దుల్యంబు లనుటకంటె నిప్పటి సమయములో నివి యెక్కుడనియే చెప్పవచ్చును. ఈరాజశిఖామణులు నిట్టికవీంద్రులచే నేఁటేఁటఁ బ్రబంధంబులఁ గృతులఁగైకొనుచుఁ దాముం బ్రబంధకర్తలై భోజరాజ కృష్ణదేవరాయలవలె నిజకీర్తి నెల్లెడలఁజల్లి యతోధికరాజ్యసమృద్ధితోఁ జిరకాలము ప్రజారంజనముఁ జేయుచుఁ బరిపాలింప రక్షింపఁబడ నీశ్వరుని బ్రార్థించుచున్నాఁడను.

## ఇకరివీంద్రమునిచే రచియింపఁబడిన గ్రంథములు.

౧. శ్రీరామపంచాశత్తు. సంస్కృతము. శ్రీరామస్తవము. 1875 సంవత్సరమున రచియింపఁబడినది. అముద్రితము.

౨. మందేశ్వరశతకము. తెనుఁగు. నీతిప్రధానము. 1879. అముద్రితము.

౩. శ్రీరామవంశముక్తావళి. స్వప్రభువంశచారిత్రమును దెలుపు సంస్కృతగ్రంథము. ఇది ౧౦ సరములు గలిగి విచిత్రగాథలు గలిగి నవరసాకరమై చదువరులడెందంబులకు విందు గల్గించుచున్నది. అముద్రితము.

౪. మల్హణస్తవము. ఆంధ్రీకరణము. 1882. ముద్రితము.

౫. కుమారశతకము. రాజనీతి దెల్పునది. ఆంధ్రీకరణము. ముద్రితము.

౬. కుమారశతకమునకు వ్యాఖ్యానము.

౭. మహేంద్రవిజయము. ప్రబంధము. ఆంధ్రము. ముద్రితము.

౮. రామరాయవిలాసము. అముద్రితము.

పై గ్రంథములలో కొన్నిటి నుండి కొన్నిశ్లోకంబులను గొన్నిపద్యంబులను నిందుదాహరించుచున్నాఁడను.

### శ్రీరామపంచాశత్.

శ్లో॥ వదనే స్మృదుమందహాసలీలం వచనే సత్యకథాప్రసంగలోలం
నయనే సదయార్ద్రరసం పుమాంసంచరణే చేతనితాశ్మమూర్ధ్నమీడే.

శ్లో॥ సహితస్సహజన్మభిస్త్రిభిర్యస్సహితస్స్వైరపి హారకేళిధుర్యైః
సమయానరయూతటంపిసీల స్సముయాస్వప్నగతో వ్యలోకి బాలః

### మందేశ్వర శతకము.

శా. రాజుల్ భోజులువంటివారొదవ నారా కాళిదాసోపమ
శ్రీజాగ్రత్కవిరాజులుం గలరికన్ శ్రీరామచంద్రోపముల్
క్ష్మాజాను ల్గలరేని వాయుజనిభుల్ దాసు ల్గలా రేల యీ
రోజుల్ పిండి కొలంది నిప్పటియుగా నూహింప మందేశ్వరా.

మ. వినయంబే సుగుణం బగుం బరులకుం బ్రేమంబు పుట్టించి లా
లనముం జెందును మెప్పు చేర్చి బహుధాలాభంబునుం బొందు భ
క్తిని సంధించి సమర్చనం గొనును బ్రీతి న్నించి మేలంద నో
పు నటు ల్గాన జగానఁ దాదృశగుణంబుం గాన మందేశ్వరా.

శ్రీరామవంశముక్తావళి.

శ్లో॥ జ్ఞాతార శ్శ్రోతార స్స్మర్తారః కాంక్షితార్థదాతారః
నేతార స్సంతి యది ఖ్యాతా రచయంతి సత్కృతీః కవయః.

శ్లో॥ మాతా స్తే దదృశుః కిలాత్తవినయా మాపాండుగండద్వయీం
సాధ్వీం గర్భభరాలసాం నృపకులస్త్రీలక్షణైర్లక్షితాం
చింతావిక్లబమానసా మనితరప్రేక్ష్యామపీద్ధృక్త్వయా
సందృష్టా మిహ మైథిలీం భగవతః ప్రాచేతస స్యాశ్రమే.

మల్లాణ స్తవము.

శ్లో॥ కాంతాకచప్రచయచపుష్పసుగంధిగంధ,
లుబ్ధభ్రమద్భ్రమరకర్బురకంధరాయ
గంధర్వయక్షసురసిద్ధకిరీటకోటి, సం
ఘట్టఘృష్టచరణాయ నమ శ్శివాయ

ఉ. శ్రీకరకామినీకచపరీకలితసుమప్రచయోరుసౌరభ
స్వీకరణస్పృహద్భ్రమరవిభ్రమకర్బురకంఠకాంతికిన్
నాకసదుత్తమాంగమకుటాగ్రవిఘట్టనఘట్టితాంఘ్రిపీ
ఠీకమనీయమూర్తికి ఘటించెద వందన మిందుమౌళికిన్.

శ్లో॥ అన్యైరవిందమకరందహృతాళిబృంద,
మందారకుందదళదామభి రిందుమౌళే
పూజాం విధాయ భవతో విలసంతి దేవ
దేవేంద్రమందిరవరై స్సహ సుందరీభిః.

ఉ. కొండ అమందభక్తిఁ దమ•కుం దులకింప మరందబిందుని
ష్యందమిళిందబృందహరి•చందనకుందనవారవిందకో
టిం దగ నీదుపూజల ఘ•టించి పురందరమందిరంబులం
దుందురు సుందరీకలన• మొందుచు నందుల నిందుశేఖరా.

కుమారశతకము.

శ్లో॥ మంత్రకాలంవినా సర్వ, జనసేవ్యస్థలే వస
యతః కుమార త్వాంద్రష్టు, మాయాం త్యర్థార్థినో జనాః.

గీ. మంతన మొనర్చునప్పుడు•మాని యితర, వేళలం దెల్ల జనులు సే•వించుచోటఁ
గొలువొనర్పుము కర్జముల్•దెలిపికొనఁగ, జనము నినుఁజూడ వచ్చుఁగావునఁగుమార.

శ్లో॥ మా మానం భజ మాలస్యం మా లక్ష్యం మా ప్రగల్భతాం
త్వం కుమారాగతాన్ పశ్యన్పూర్వాభాషీ ప్రియంవద.

కం. మానం బూనకు మలసతఁ, బూనకు ప్రల్లదనము లాడఁ• బూనకు లక్ష్యం
బూనకు ప్రజ రాఁగని హిత, మానట్టుల మున్నె పలుకు•మయ్య కుమారా.

రామరాయవిలాసము.

సీ. నునుఁగుట్టుపట్టుమె•త్తని మెత్తకోళిరీ, జగజంపుపల్లంపు•జిగిబిగింపు
టంగువారుజగాడి•టంపుజల్తారుము, ప్పిరిచుట్టుఘుముచా•పెన్నారంగు
పాన్తెలుంగులరికా•బుబుబలుతోరంపు, హొన్నుల మెడపట్టె•ముఘటుచాల
మొగముట్టుసొంపుజెం•పులకెంపుకల్లెంబు, చొక్కంపుఁజిక్కని•సోఁగవాగె
చుఱుకునిడువాలుతరటుకు•చ్చులబెడంగు, పీలిగఱులతురాయర•బ్బిహుమాయి
దగినముస్తాబొనర్చి వ•స్తాదులిరువు, రచ్చటికిఁదెచ్చిరేలిక•యాజ్ఞవడసి.

ఉ. తమ్ములనెమ్మిఁగమ్మ దవు•దవ్వులఁగన్గొనిపన్న చేసివా
ర్వమ్ములఁ గూర్పఁ బంచితిరి•వచ్చిరె సాదులుస్వారి కేగ నె
య్యమ్మున మమ్ము రమ్మనుట•కా యిటువచ్చితి రంచు నుండ మో
దమ్మునఁ జిన్నిమన్నలను•దండకు రండని యవ్వ నవ్వుచున్.

కం. ఏమిర చిన్నికుమారా ! యీముమ్మూరు వేఁగఁదలఁచితే స్వామికి నీ
కేమైనఁ దెలుప లేదే! నీమాటయె తలఁపరైరె నెయ్యపుటన్నల్.

## మాధవస్వామిరథవర్ణనము.

సీ. సారనేమిస్ఫురచ్చక్రషట్కయుతంబు, విలిఖితదంపతివిలసనంబు
సఫలరంభాస్తంభసంభాసమానంబు, వగ్రలసజ్జాతుపార్శ్వయుగము
నైకసంఖ్యాకఘంటావళీసహితంబు, బహుళదర్పణదీపభాజనంబు
నభ్రంకషసుదర్శనాంచితకలశంబు, కీలితపక్షిరాట్కేతనంబు.

గీ. నగుచుఁ దనరారు రావువంశాంబురాశి, పూర్ణహిమధామ నీలాద్రిభూపతనయ
సూర్యరామేంద్రుఁ డాదరస్ఫూర్తి నిడిన, సుందరం బగుమాధవస్యందనంబు.

## పద్మవర్ణనము.

మహా. కమలం బేపారు ధాత్రిం గలితపరిమళాక్రాంతదిఙ్మండలంబై
విమలాంభఃపూర్ణవాపీవిపులతరసరోబృందసందీపితంబై
కమలాకాంతానివాసక్రమఘనపదమై కంజపత్రాక్షనాభీ
రమణీయంబై విధాతృప్రసవసదనమై రాజితం బైనరీతిన్

## శ్రీరాజావారుసర్వపురంబునని ర్మించినగోపురాదికములవర్ణనము!

సీ. కట్టించె నెవ్వాఁడు ఘనచిత్రములతోడ, గోపురంబును దాఁకుగోపురంబు
నిర్మించె నెవ్వాఁడు నిర్మలోదకముక్తి, వాపికాసవిధసోపానసరణి
స్థాపించె నెవ్వాఁడు సద్భక్తివఱలంగ, వరవరమునిలోకగురువరేణ్యు
నియమించె నెవ్వాఁడు నిత్యోత్సవంబులు, భావనారాయణస్వామివారి

గీ. కవని శ్రీసర్వవరపురమందుభక్తి, నతఁడు రాజన్యమాత్రుఁడే మతిఁ దలంప
రాజదీహానరేబిలుప్రభృతిబిరుద, శాలి శ్రీరామరాయభూపాలిమాళి

మాధవస్వామి రథ వర్ణనము, పద్మవర్ణనము శ్రీ శ్వేటురాజావారు సర్వపురంబున నిర్మించిన గోపురాదికముల వర్ణనము గల పద్యంబులు కవిగారిశతాధానములోనివి.

వీరిగ్రంథంబు లన్నియు మొదటినుండి తుదవఱకు నొకరీతిగ నుండి రసపుష్టితో నలరారుచున్నవి. మఱియు నాకు ప్రబంధశైలులం దెలుపు చంపకమాలయు, పుష్పబాణవిలాసమున కాంధ్రీకరణమును, సత్యశతకమును, శృంగారసారమను భాణమును మొదలగు పెక్కు గ్రంథములు చిన్నచిన్నవిగా రచియింపఁ బడినవి గలవవియు స్వప్రభుశిఖామణి పట్టాభిషిక్తులయిన వెనువెంటనే తదాజ్ఞావశంబున ముద్రితంబులై ప్రకటితంబులగుచుండ నిమ్మహాకవీశ్వరులు విద్యాభోజు లగు శ్రీసూర్యరాయ మహారాజుగారి కీర్తి వ్యాపింపఁజేయుచు, నింకయు ననేకప్రబంధంబులు రచియించి మనయాంధ్రమండలికి విఖ్యాతిఁ దెచ్చి, యనామయం బైనచిరాయువుతో నభివృద్ధి నొందఁ బరమేశ్వరుఁ బ్రార్థించుచున్నాఁడను.



# శ్రీ మ హేం ద్ర వి జ య ము.

## పీ ఠిక.

" చతురకవిత్వ తత్త్వపటు • సంపద యొక్కరిసొమ్ముగాదు భా।
రతిదయసౌధవార్ధి, కవి • రాజుల మానసముల్ ఘటంబులా।
యతమునకొలంది లబ్ధమగు • నయ్యమృతంబు—"

అని కనుపర్తి యబ్బయామాత్యుఁడు చెప్పినట్లు కవితాప్రావీణ్య మొకఁ దేశమువారి దని కాని యొక్కకాలమువారి దని కాని చెప్ప వలను పడదు. భారతీకృపాసముద్రముయొక్క లోఁ తెఱింగినవారును, దరిచూచినవారును, లేకున్న నెవ్వ రెప్పట్టున మథించినను బ్రయత్నానురూప మగులబ్ధి సమకూరును. అట్లగుటం జేసి ప్రబంధము లన్నియు నేకఫక్కికము లై యుండు నని కాని సర్వవిధములఁ బ్రాచీనగ్రంథములే మార్గప్రదర్శకము లని కాని తలంచుట యుక్తియుక్తము కాదు. ఇంతియకాక లోకానుభవము ననుసరించి జ్ఞాన మధికమగుచుండుటయు, జ్ఞాన మభివృద్ధి నైనకొలఁది మనుష్యుల యభిప్రాయములు మాఱుచుండుటయు, నేకాలమున రచింపఁబడినగ్రంథముల యందాకాలమువారి మనఃప్రచారములు ప్రతిబింబితము లై యుండుటయు, నెల్లరకుం దెల్ల మైనవిషయములే. అయిన నాంధ్రకవితాపితామహుని కాలము మొదలు నేఁటివఱకు రచియింపఁబడి యుండు ప్రబంధములలో నొకటి రెండు తక్కఁ దక్కిన వన్నియు నొక్కతీరుననే యున్న వను సంగతి సుప్రసిద్ధమే కదా! కథాసంవిధానమునఁ గాని, వర్ణనాంశములఁ గాని విస్తారభేదములేదు. ఇట్టిస్థితికిఁ గారణ మారసి చూచిన స్పష్టము కాక పోదు. పుర, సింధు, నగాద్యష్టాదశవర్ణన లావశ్యకము లనుటయే కాక,

వానివద్ధతులఁ గూడఁ దెల్పి, మనలాక్షణికు లేర్పఱిచిన నియమము వలనఁ బ్రబంధరచనకుఁ దొడఁగినవారందఱు, కథాసందర్భానుగుణము లగువర్ణనలఁ జేయుటకు బదులుగా నాయావర్ణనల నిముడ్చుటకుఁ దగినకథాసందర్భములకై వెదకికొనుచు, గతానుగతముగా గ్రంథములు వ్రాయుచుండిరి. ఇదియే వైలక్షణ్యాభావమునకు ముఖ్యకారణము. దీనితోనాఁగిన బాగుగనే యుండును గాని నియమశృంఖలలచేఁ గట్టువడి, బుద్ధికి స్వచ్ఛందప్రచార మొసంగక, నూతనమార్గములపొంతఁ బోక, కాలక్రమమునఁ దమకుఁగల కల్పనశక్తిఁ గూడఁ బోఁగొట్టుకొనిరి. ఏకవిషయమై యనేకులు వ్రాయు నప్పుడు హృదయంగమము లగుకల్పన లక్ష్యముగాఁ దోఁచుట యసంభవ మగుటం జేసి, కొంతకాలమైన పిదప శబ్దాడంబరమునఁ దమ తమ యుత్కృష్టత స్థాపింపఁ జూచిరి. క్రమముగాఁబాండిత్యప్రకర్షమే కవననైపుణియను భ్రాంతికి లోనైనవారై, యర్థగౌరవము, భావవివరణము, రసస్ఫూర్తి మున్నగు చిన్నెల మన్నింపకపోయిరి. కొందఱు రచనాచమత్కృతిఁ జూపఁ బ్రయత్నించి యున్నను, వారికల్పనలు, ప్రాచీనగ్రంథములలోని వానివలెఁ గాక, స్వభావవిరుద్ధము లై, విపరీతము లై, వర్ణితాంశములను సహజాకృతులతోఁ జమవువారిమనశ్చక్షుస్సులకుఁ బ్రదర్శింపలేకున్నవి. సర్వదా గగనమార్గముననే సంచరించుచు, విసివినచో వృక్షశిఖరమున విశ్రమించుచు, సాధారణముగా నేలపైఁ గాలు మోపనివిహంగంబు భంగి, నీకవుల రచనాసామర్థ్య ముత్ప్రేక్షాంతరిక్షమునందును, భూపసభాగ్రమునందును గవ నగుటయే తప్ప, సృష్టివైచిత్ర్యవర్ణనల కెన్నఁడోకాని దిగకున్నయది. భూభరణశక్తిచే గర్వించియుండుపర్వతంబులు, నున్నతగోత్రోద్భవంబులయ్యును జనసామాన్యమునకు జీవనాధారము లై యెల్లర నుల్లసితాం

తరంగులఁ జేయుతరంగిణులును, ఫలసమృద్ధి గనియు నమ్రత వహించు వనితరువులును గూడ వర్ణనీయములే కదా! తృణీకృతదేవేంద్రు లగు రాజచంద్రులగాథలవలెనే, సుగుణగణసమాన్యులగుసామాన్యులకథలు కూడఁ బ్రబంధరూపమున రచింపఁదగినవియే కదా! కష్టసుఖములును, దారిద్ర్యైశ్వర్యములును, దివారాత్రములఁ బోలె జంటలుగా నుంటం జేసి, ప్రకృతియొక్క ద్వైరూప్యమును గావ్యముఖమున విశదీకరించుచు, భగవత్సంకల్పముల నెల్లరకుం దెల్లముగా వెల్లడి చేయుచు, నింద్రియగోచరము లయ్యు మనస్సున కగ్రాహ్యము లగువిషయముల యొక్క గూఢార్థము నుపదేశ మొనర్చు దేశికుఁడై, రహస్యములతో నిండి యుండు నీవిశ్వమునకు వ్యాఖ్యాత యై యుండుటయే కవియొక్క ప్రధానధర్మము. అట్లగుటం జేసి కవులు కావ్యార్హవిషయములకై వెదకికొనవలసినపని లేదు. జగత్తంతయుఁ వారిదే. నాయికానాయకు లెల్లప్పుడు నుత్కృష్ట స్త్రీ పురుషులుగా నుండ నక్కఱయే లేదు. అచేతనములని మన మలక్ష్యము చేయు పదార్థములే వారికి భగవన్మహిమానువర్ణనానుకూలవిషయములుగాఁ దోఁచును. నిరర్థకము లని మనము తృణీకరించువస్తువులమూలముననే వారు సృష్టిమర్మముల విప్పి చెప్పఁ గలరు. అల్పు లని మనము తిరస్కార భావముతోఁ జూచువారి చరిత్రములే వారికి నీతిబోధకములుగాఁ గన్పట్టును. దాని వలననే కదా

"విద్యలకు నెల్ల నుత్తమంబు విద్య కవిత, దానిఁ దెలియుట విశ్వమంతయును గనుట"

యని యప్పకవి చెప్పి యున్నాఁడు! సంసర్గ్యాంతరమున నుడువఁబడిన దైనను

"రవి గాననిచోఁ గవి గాంచునే కదా"

యను వాక్యమునకుఁ గూడ నదియే నిజమైనయర్థ మని తోఁ చెడిని. వేయేల ! ఇంద్రియగోచర మగుప్రపంచగ్రంథ భాగమునకు వ్యాఖ్యానప్రాయమై యుండు నదియే కాక, లుప్తభాగములఁగూడఁ గథారూపమునఁ బూరించు నదియే కావ్యము. తత్కర్తయే కవి. కేవల "పూర్వకవీశ్వరవాక్ప్రయోగదక్షుఁడు" విద్వదధ్యక్షుఁడు కావచ్చుం గాని కవిహార్యక్షుఁడు కానేరఁడు.

కావ్యస్వభావ మిట్టి దగుటం జేసి, విమర్శన మొనర్చునపుడు మన మనుసరింప వలసినప్రమాణ మెట్టిదో విచారింప వలసి యున్నది. ఛందోబద్ధమై, వ్యాకరణదోషరహితమై, యలంకారసహితమై, సలక్షణప్రయోగప్రసిద్ధ మైనంతమాత్రమునఁ గావ్యమున కుత్కృష్టత రానేరదు. అట్టి కృతి తత్కర్తకుంగల సలక్షణపద్యనిర్మాణశక్తినే సూచించును గాని, యనవద్యకవితావైశారద్యము వెల్లడి సేయ నేరదు. వ్యాకరణము పదప్రయోగపద్ధతిని, ఛందోనిబంధనలు పద్యరచనాక్రమమును, దెల్పును గాని కవిత్వప్రసక్తి వాని కణుమాత్రమును లేదు. కావ్యమునకు భావమే ప్రధానము. భావవివరణము సముచితపదగుంఫనముచే నొనర్పఁబడినచోఁ గావ్యము సర్వజనసమాదరణీయమై యుండును గాని శబ్దచిత్రములు లేనంతమాత్రమున నది నిరాకరణీయము కాదు. మబ్బుల మఱుంగున రంగులహొరంగు మెఱుంగలింప నింగిపై నిగనిగలాడు నగవైరికార్ముకము చూపఱకన్నుల కింపుసొంపు సంపాదించుటయే తక్క, వేఁడిమి వెలుఁగులఁ గలుగఁ జేయనేరనితీరునఁ గేవల శబ్దవైచిత్రి కావ్యమునకు గౌరవ మొడఁగూర్ప నేరదు. అలంకారములు సహజసౌందర్యము నభివృద్ధి యొనర్చుం గాని లేనిచోట దానిని సృష్టింప లేవు. కాఁబట్టి యేదైన నొక గ్రంథమును విమర్శించునపుడు దానిలో

భావవిజృంభణము, కల్పనాచమత్కృతి, వర్ణనావైదగ్ధ్యము, లోకానుభవజ్ఞానము, రసోచితశైలియును గలవా లేవా యని చూడవలయుఁగాని, భాషాప్రావీణ్యము, ప్రయోగనైపుణ్యము నంతగాఁ బరిగణింప నక్కఱ లేదు. ఇఁకఁ బ్రస్తుతగ్రంథ మెట్టిదో పరిశీలింతము.

ఏతద్గ్రంథకర్త పీఠికాపురసంస్థానాస్థానకవీశ్వరులు. ఆంధ్రగీర్వాణములయం దసమానపాండిత్యము గలవారు. ఇది వఱ కనేకగ్రంథములను శతకములను వ్రాసి వాసి కెక్కి యున్నవారు. ప్రబంధరచనయం దిదియే వీరికిఁ బ్రథమప్రయత్నమై యున్నను, సర్వవిధముల మనభాషలోని యుత్కృష్టకావ్యములతోఁ దులఁదూఁగఁ దగి యున్నది. పూర్వులనాఁట నుండియు వీరిది పండితవంశమై యుండుటం జేసి, యనర్గళకవితాధోరణి వీరి కెలజవ్వనముననె యలవడి యుంటయే కాక, సుప్రసిద్ధుం డగుకూచిమంచితిమ్మకవిజన్మస్థలమున కనతిదూరముననె వీరు బాల్యము నంతయుఁ గడపి యుంటవలన నాతనివలెఁ బ్రసిద్ధవడయవలె నని చిన్నతనముననె మనమున ఘన మగుతలఁపు నెలకొని యుండనోపు. ఆకాలమునఁ గూడఁ దమయప్రతిమానప్రజ్ఞచే రసజ్ఞులయుల్లంబుల నుల్లాసకల్లోలిని వెల్లివిరియఁ జేయుచున్న మాడభూషి వేంకటాచార్యాదికవివర్యులకీర్తి, యప్పటి కప్పుడే వీరి మనమున నంకురించి తీఁగసాఁగుచున్న గ్రంథరచనాభిలాషను బోషింప, వీరి నెంతయుఁ బురికొల్పి యుండ వచ్చును. మఱియు యౌవనారంభముననె రాజాస్థానమునకుఁ బ్రవేశము గని యుంటం జేసి యచ్చట మానవస్వభావవ్యత్యాసములను బ్రపంచధర్మములను బరిశీలించుటకుఁ దగినయవకాశము కూడ లభించెను. రాజుల కొలువుకూటములు సజీవవస్తుదర్శనశాల లని (living museums) చెప్ప నొప్పు. అచ్చటి పరిజనములో దుష్టజనాగ్రేసరులు

మొదలు శిష్టజనాగ్రగణ్యుల వఱకుం గల యన్నితరగతులవారును, రాజద్రోహంబాదిగా స్వామికార్యైకపారతంత్ర్యపర్యంతముంగలయన్నిమనోవృత్తులునుం గన నగును. ఇట్టితారతమ్యముల నీకవి చక్కఁగాఁ బరిశీలించి యున్నవా రగుటచే నేతన్మూలోపార్జితప్రపంచజ్ఞాన మీగ్రంథమునం దందందుఁ బొందుపఱుపఁబడి యున్న కొన్నినీతిబోధకము లగు పద్యములను, హాస్యరసప్రధానము లై హృదయంగమము లగు స్వభావవర్ణనలను, వ్రాయుట యందు వీరి కెంతయుఁ దోడ్పడి యుండ నోపు. ఇంతియకాక కష్టసుఖముల నాశ్రితు లేలికతోఁ బాలుగొనుటయే వాలాయమనుగఁ దలఁచి, కడగండ్లఁ బడినప్పు డొడయని యెడఁ దమకుం గల గడితంపు నెనరు వెనుకంజ నిడనీయక, కడ వఱకు సుడివడనిదృఢభక్తితో నిలిచి గెలిచిన వా రగుటచే, ధర్మమే జయించు నను విశ్వాసమును, భగవంతుఁ డపారకృపాసముద్రుం డగుటచే భక్తులబన్నములఁ బాపి చేపట్టు నను నమ్మికయు, మొదటి నుండియు వీరిహృదయమునఁ బాదుకొనియుండ వచ్చు. దాని వలననే యకలంకభక్తియుక్తులగుబ్రహ్మేంద్రాదుల యజాగ్రత్తవలనఁ బొడమినయిడుమలు గడచనుటయు, ధనమదాంధతచేఁ గలిగినసెలుగులు తొలఁగుటయు, గురుజనతిరస్కారకారణమునఁ బొటిలినచేటులు దాఁటిపోవుటయు, మొదలగు విషయము లీగ్రంథమున నెంతయు వింతగా సంతరింపఁబడి యున్నవి.

శైలి:—మొత్తముమీఁద సంస్కృతపదభూయిష్ఠమై యున్న నతిదీర్ఘసమాససంవాసితము గాక, యన్వయకాఠిన్యము లేక, "యరంటిపం డొలిచి చేతికి నిచ్చిన రీతి" "సులభార్థపద్ధతి గలదై యఖిలపఠనీయశైలిచే నలరు"చున్నది.

ప ॥ "శని రింద్రాదిసురప్రకుందుని బయః॥ కల్లోలమాలాపృష
ఘ్మనము క్తాఫలచారుతోరణాలస॥ త్కాదంబినీ కాయమా

వనితాంతాంచదనంతవంటపగతా నంతస్ఫటానంతశో
భనశయ్యాంతరశాయి, భక్తగణసం పద్దాయి, నొక్కమ్మడిన్."

చతుర్థాశ్వాసము, ౬౨.

సీ. "ద్రాక్షాఖాతోత్తంభితస్నిగ్ధసరళపూ, గప్రకాండోచ్చ ప్రకాండజాల
మాళుతంతన్యమా నాయతలాంగలీ, పత్రపరిచ్ఛదో పరితలంబు
సహసాగ్రథితచూత సాలజాతాచ్ఛిద్ర, చారుపల్లవజాత తోరణంబు
ఝుడితిసంఘటితచం చద్దలాంచత్ఫల, స్తబకరంభాప్రతి స్తంభమూల

తే. మగుచు నజ్జన్నిగ ట్టున్న యట్టినట్టు, సుట్టుదట్టంబుగాఁ గను పట్టె వేగ
మానిమాణవకాకల్ప్య మానమైన, తాయమానంబుశుభసూచ కముగనపుడు"

చతుర్థాశ్వాసము, ౧౩౩.

శుద్ధాంధ్రపద్యములఁ గూడ నట్టిరచనాసౌకుమార్యమే కన్పట్టు చున్నయది.

"అంటఁగరానివేల్పు మొదలాకడవేలుమనీలు బాసవా
ల్దంటలు మింటిద్రిమ్మరుల దాఁటులునుం దెలుగంటిపెద్ద ఱు
క్కంటిని నమ్మికింటిదొరఁ గన్గొని యొప్పుగ నెప్పు డిట్లు మా
బంటులబంటు బన్నఱుల పాల్పడకుండఁగఁ బ్రోవుఁడీ యనన్."

పంచమాశ్వాసము, ౧౩౩.

గీ. "కాఁచిచల్లార్చి పాలుమీఁగడ సమర్చి, బిగ్గరగఁ బేర్చిననుఁగూర్చి పిలువఁదొడఁగె
నల్లనగుసామిచీవ్రబో నపుహుమాయి, నెక్కిరావయ్యయిపుడు నా చక్కిననుచు"

షష్ఠాశ్వాసము, ౨౧౪.

శబ్దాలంకారములకై వీరు ప్రయత్నింపకపోయిన నవ్వియే వీరిం జేరఁగోరు ననుట యత్యుక్తి కాదు.

కం. "కలశీకృతవిరజామల, జలశీకరసేకరచిత సంస్థులతాంచ
ద్దలశీతలతులసీవన, తలసీమ మెలంగు ముక్తతతులం దెపుడున్॥"

తృతీయాశ్వాసము, ౧౪౧.

కం. "భగవల్లసదనుకంపన్, జగమెల్ల భజింపఁ దగినసంపద చెలఁగన్
ఖగవల్లభుఁ డగతల్లజ, ముగ నల్లన మూర్తి నిలిపెంభువి నద్రిదరిన్ ॥"

ప్రథమాశ్వాసము, ౧౬౩.

అనుప్రాసము లేనిపద్యము లపురూపములు.

ఉ. "వీరకు మీఱు మీ రమరవీరులు సారెకు భూరిసార మే
పారఁగఁ జొక్కసైన మెలపారఁగ ధీరగభీరధీరమో
దారతఁ దారతమ్యరహితారభటిం దగఁదారసిల్ల లే
దోరహిఁ దోరమై దనరుదోరహిఘోరతఁ బోరితంబులన్ ॥"

తృతీయాశ్వాసము, ౮౦.

ద్వంద్వ, త్ర్యక్షరప్రాసములఁ గూర్చుట యందు వీరికిం గల యగణ్య నైపుణ్యము చూడ నాంధ్రభాషాయోష వీరి కెంత వశ్యురాలో యెల్లము కాక మానదు.

కం. "ఆశావవిధముఁ దెలిపెద, మాశాపతిసేవ్యతాభవాతిశయముదా
వేశాపశదా యోదే, వేశా పరులను భజించునిఁక నీదు సిరుల్ ॥"

తృతీయాశ్వాసము, ౫౯.

ఉ. "శారికలార ! శౌరికడసారెకుఁ జారుకథార్థముల్ మనో
హారికలారవస్ఫురణనద్భుతభంగి నెపంగు నట్లుగాఁ
గోరికలారఁ దెల్పుచునుసూరిమి గాంచెదు మీర లీజగ
ద్భూరికలారహస్యములపోఁడిమి బుద్ధి నెఱుంగు టబ్రమే ॥"

తృతీయాశ్వాసము, ౧౫౭.

నిరర్థకపదములకై వెదకి చూచిననవి గనఁబడుట కష్టము. ఆకస్మికముగ నేపద్యమునైనఁ జదివినచో నిది సువ్యక్తము కాఁగలదు. దీనికిఁ దోడు వీరికవితాధోరణి "గాంగనిర్ఝరసదృగ్ధారాళం"బని చెప్పినచో వీరిశైలి యెట్టిదో యెల్లరకుఁ దెల్లమగును. ఇది యొకయా

శ్చర్యము కాదు. "ఆశుధారాకవిత్వంబునందు శయ్యా లుపమ లుత్ప్రేక్షలును లేక యుండు"నని చెప్పిన యప్పకవివచనము వీరి యెడల వర్తింపక పోవుట నే నెఱుంగుదును. ఎంత యవ్యవధానముగఁ జెప్పినపద్య మైనను ప్రబంధపాకమున నే యొప్పు చుండును. ఈ గ్రంథమున నేకందపద్య మెత్తి చూచినను శయ్యా కుదాహరణము లభించును.

కం. "తా మఱచి నిద్రపోవ్వడి, తా మఱచిన విదమి శ్రుతులు తలఁగి చనుటకై
తామరచూలి ముకుందున, తామసమాతిసమచ్చి తాఁ దెల్పఁ దలఁచినన్॥"

ద్వితీయాశ్వాసము, ౧౨

కం. "రాజీవనయనుఁ డాశ్రిత, రాజీవనచైత్రుఁ డపదుష్ప్రాబల్యాలకై
రాజీవనాకృతితో, రా జీవనరాశిలో నరసింహుఁ డెలమిన్॥."

ద్వితీయాశ్వాసము, ౧౬౩.

అచ్చ టచ్చట వీరి శైలి శ్లేషాలంకారప్రయుక్త మై యుండుటయుఁ గలదు. అప్పట్టులఁ బింగళి సూరనార్యుని కౌశల్యము తలఁపునకు వచ్చుఁ గాని భట్టుమూర్తి ప్రజ్ఞ జ్ఞప్తికి రాదు.

కం. "వసువిసరప్రసిద్ధం బై, సుసిద్ధమహిమాఢ్యమై విజృంభస్సతా
వసుపహితామోదం బై, యొసఁగెడి నచ్చోటి వారు కే కద స్వస్సుల్॥"

తృతీయాశ్వాసము, ౧౨.

మ. "అని కాపోర్వళిక నైనపద్మమున నుద్యత్పారిణి స్ఫారసఙ్గు
ధనముల్తైధనస్థితాశ్వగణము భద్ర్వక్రమస్థానగో
పనభింగీహృదయుంగమ బరుచు దేవద్వేషిసైన్యం బాగిన్
జనిమె న్నాకపురీనిరోధసము త్సాహాస్ఫుటాహ కృతిన్॥"

తృతీయాశ్వాసము, ౮౩.

ఉపమానము లెంతయు స్వభావానుగుణములును మనోహరములు నై తనరారు చున్నవి.

సీ. "పిల్లి పొన్నించి త్రోవిన పాలకుండవనా, సమృద్ధికు దను శూన్యములై నవర్షా
నూనె చట్టుపు నేలను యిరాగ కురిగవి, పాడుగు పయోహీనములు వోడై
జెలఁది గూండ్లడిన మాకులు క్రొాలె గర్పవృక్షములు నిష్ఫలములై కాననయ్యె
మందు నేపని నటిమ నుఁగునామి న్నేటి యాసలెండిన్నీటలై యడుగుఁబాపె."

తృతీయాశ్వాసము, ౧౦౭

సీ. "దితితనూభవదండవాతులకు దశశతాం, బకు వీఁపు వల్లులఁ ముంచ వయ్యెఁ
బలలాశికట్టాకమ్ములకు వేఁడివెలుంగు, కొమరునితల సంతకుండ యయ్యె
దైత్యకరాసితతముల కంబుధినాథు, మే నూరిదరిబొడ్డుమేడి యయ్యె
దనుజాంగుళీప్రపీడనముల కర్థేశు, చెవిదోయి కిన్నెరచీల లయ్యె—"

చతుర్థాశ్వాసము, ౪౧.

సమయానుగుణ్యముగ మనోజ్ఞము లగులోకోక్తులచే భావము వ్యక్త పఱుచుటయుఁ దఱచుగఁ గన నగును.

తే.గీ. "కోరికైవస మొనరించుకొనఁగఁ దగిన, సిరి తనంతనె రా నుపేక్షింపఁ దగునె,
మది వలసి వచ్చినను మేనమామకూఁతు, వావి గాదంచుఁ బలికినవాని కరణి॥"

తృతీయాశ్వాసము, ౭౭.

తే.గీ. ఒరుని వలన నాకునుపకృతి యెందాక, నెనరు చుండు నంతదనుక మెచ్చి
యేఱు దాఁటి తెప్ప వేర్చిన చందాన, వాని పేరు వినఁగ నైన నొల్ల॥"

షష్ఠాశ్వాసము, ౧౩౨.

సామాన్యముగ మనకవులలో ననేకులయందుఁ గానరానట్టియు, వీరియం దధికముగాఁ గనుఁగొనఁ దగినట్టియుఁ బ్రజ్ఞావిశేష మింకొకటి కలదు. చిత్రకారుఁడు తనతూలికతో నిటునటు నాల్గు గీఁతలు గీచి యాకారముఁ దేలుచు పోలిక, వేషభాషావిశేషముల, నవస్థాభేదములఁ, జిత్తవృత్తులఁ గొన్ని చిన్నిపదములతోనే గన్నుల యెదుటఁ గట్టినట్టు వర్ణించుట యందు వీరికిం గలనేరు పెంతయు వింతయై యున్నది.

సీ. "అడ్డదిడ్డంబుగా నాదల నిముకొన్న, వలిపంపుమడుఁగుదోవతులపిడుప
లళికప్రదేశాదికాంగకంబుల లెన్న, బ్రామినదట్టంపు భస్మరేఖ
లెడమమూఁపులయందు దృఢముగాఁ, గన్పట్టు స్వచ్ఛప్రభంబులౌ జన్నిదములు
గదుశుభ్రముగఁ దోమికుడికేలఁ దాల్చిన, యాతామ్రతామ్రమయాంబుపాత్రు
లమరఁ గాంచనముఖరీజలావగాహ, నములఁ గావించి వాయులింగము భజించి
పరశివస్తవముఖులౌచు వచ్చుద్విజులఁ, గాంచి దివిజమహర్షి హర్షించె మిగుల॥"

షష్ఠాశ్వాసము, ౨౦.

సీ. "అంకుమత్సలకు మంథ్యంబు తథ్యముగ నే, తత్సామగాయ మోంతరుణయజ్వ
సారంగివదనంబు సారంగలాంఛను, యద్దేవ సేయునో యాయజూక
చంద్రమఃకళనాభిచందమింద్రోపల, న్యసమాన మోహావి ర్యాజివర్య
యష్టాపదగృహంబు నం దెకదా యాత్రి, యామనుఖంచమే యాహితాగ్ని
యనుచు మందాకినీతీరమునను దాన, మున కుషఃకాలమునఁ గూడికొనినక్రొత్త
సోమయాజులుస్థాలికల్ ద్రోమికొనుచు, నాత్మపరిభాషభాషింతు రచట నెపుడు॥"

తృతీయాశ్వాసము, ౧౮.

సీ. "చరణము ల్మిడుపుగా సాఁచి కేలొక్కటి, పుడమిపై నూఁతగా నిడి వసించుఁ
గూర్చున్నతటి నాయకుండురా దవుదవ్వ, నను గాంచి కడుప్రయత్నమున లేచు
ద్విత్రాంఘ్రివిన్యాసమాత్రన దరితరు, స్కంధాదులవలంబకముగ నడచు
నొక కొంత లేనియోపికఁ దెచ్చికొని భర్త, కుపచార మొనరింప నుద్యమించు
నలసదృష్టులవలయువస్తులను దెలుపు, నలఁతియెలుఁగునఁబరిమితోక్తులనుబల్కుఁ
గలికి నీర్కావివలిపంపువలువఁదాల్చు, నెలలునిండినకోలఁది నవ్వోఁది మిన్న॥"

చతుర్థాశ్వాసము, ౧౧౩.

సీ "ఎవరైన వడివడి నెదురుగా నేతేర, ననుఁ బిల్చుటకె వత్తురని తలంతు
నఫలప్రయత్నులైంచనువారివార్తలు, విని నాకు నిటు లెప్పుడని తలంతు
నగరిమోసలలీవి నడయాడువారినె, ల్లను స్వామివల్లభులని తలంతు
దేవేరిబోనగత్తెలచేత నైన నా, మనవిఁ దెల్పింతునాయని తలంతు
నాకలోకంబునుండి నాఁరాకఁ జెవుల, సోఁక నెఱిఁగించువారలు లేక యిటుల
శ్రీకళత్రుం డుపేక్షించెఁ గాక యన్న, నీకరణినుంచు నే యంచు నేకతమున॥"

తృతీయాశ్వాసము. ౧౪౫.

రెండు మూఁడు పదములతో నర్థము నంతయుఁ దెల్పుటయందు వీరి సరివార లనేకులు లేరు.

"నిదురఁదోఁగి టంచుఁబదములొత్తుభుజిష్యు, లూరకుండిననంఘ్రు లూఁపుకొనుచు."

ద్వితీయాశ్వాసము, ౭౨.

"వాకిట జందెము లుద్ధృతోరులై యొదుకుచు నన్న లున్నను."

తృతీయాశ్వాసము, ౧౬.

"ఎందునుండియొయొకటి రోయేగుచుండి, పిడుగు వడినట్టుగా నుట్టిపడియె నెదుట."

తృతీయాశ్వాసము, ౩౭.

"యాతాయాతవీథీ త్తరీయదళంబొట్టిలఁ, దల్లడిల్లె నగరం బాబాలగోపాలముగ."

తృతీయాశ్వాసము. ౮౩.

" అఖిలసజ్జనలోకాభయప్రదంబులైన నాగ్రభుజంబుల నతని బోఁదవిశేషగాఁ గత్తి. "

" పునరిగిరి పిడీదిగాఁ దిరిగి బయిల్ గాంచి ప్రోవవేహా యంచు మ్రొక్కి—"

సందర్భోచితములగుపదవాక్యముల నేర్చి కూర్చుట, శబ్దబాహుళ్యము లేకయే యుద్దేశితార్థమును వివరించుట, రచనాచమత్కృతిచే వర్ణితాంశమును జనవ్యవహారిహృదయఫలకములపైఁ జిత్రించుట,— ఇవ్వియే నిజమైన కవిత్వలక్షణములు; వీనియందే వీరిసామర్థ్య మెంతయుఁ జూపఁబడి యున్నది.

వర్ణనలు:—ఇఁక వీరివర్ణన సామర్థ్యము శైలి కంటెను బ్రశంసనీయము. సృష్టి వైచిత్ర్యములు జనసామాన్యమున కగ్రాహ్యము లనియు, గగనతలంబున నగోచరంబులై లక్షలకొలఁది మూఁగి దాఁగి యుండు నక్షత్రసమితి దృష్టిపథంబునకు గనిపింపఁ జేయు దూరదర్శని (Telescope) చందంబునఁ గవులకల్పనలు స్థూలదృష్టిచే మనసు కనుఁగొనలేనివాని నన్నిటిఁ గన్నుల కగపడఁ జేయు ననియు, నెల్లరు నొప్పుకొను విషయములే. ఇఁక వర్ణనలు స్వభావానుగుణ్యములుగ నుండవలయు నని విప్పి చెప్ప నేల? కవి, చిత్రకారునివలె, సాధ్యమైనంతవఱకు సహజాకృతిఁ దెల్పుటకుఁ బ్రయత్నింపవలయును. లేనిచో నిది యిట్టి దని పోల్చుట యశక్య మగుట యటుండఁగాక, వారిసామర్థ్య మెట్టిదో యెఱుఁగఁబడుట కూడ దుర్లభము. అస్పష్టవిషయముల విశదప

ఉచుటయుం దతిశయోక్తి సహాయకారియైన నతిశితతరణి కిరణముల కరణి, మేరమీఱినచో నిష్ప్రయోజన మగుటయే కాక, తలఁచుగ మొదటికి మోసము దెచ్చుటయుఁ గలదు. కావున నుత్ప్రేక్షలలోఁ గవులు చూపు సామర్థ్యము స్వభావోక్తియందుఁ గన్పఱిచినచో మనకావ్యము లింకను శ్రావ్యములుగా నుండును. అయిన నిది మనము తలంచునంత చులక నైనకార్యము కాదు. అవయవానురూపతయు, సహజలక్షణ సౌందర్యమును లేని వికృతరూపమును వ్రాయు నలవాటు సులభసాధ్యముకాని, కృత్రిమాకారమునే నిజస్వరూప మని భ్రాంతి గొలుపుచు జీవకళ యుట్టిపడునట్లు లిఖించుప్రజ్ఞ శారదావరప్రసాదలబ్ధ మని చెప్ప నలసి యున్నది. ఇట్టి సామర్థ్య మేతద్గ్రంథకర్తయం దధికముగాఁ గన నగు నైనను వీరికల్పనాసామర్థ్య మనల్పము. ఎట్టి విశేషములు లేని సామాన్యవిషయములనె మనోజ్ఞముగఁ జమత్కరించి యెన్నఁడు మఱపు రాకుండు నట్లు వర్ణింపఁ గలరు. తార్క్ష్యభూధరౌన్నత్యమును, దదధిరోహణసహాయమున మూకబధిరాంధపంగులకు సంగత మైనలాభమును, వేంకటేశునకుఁ గుక్కుటేశుం డనుచరసహితముగ నొనర్చిన పరిచర్యయు, నెంతయుఁ జక్కఁగా వక్కాణింపఁబడి యున్నవి.

సీ. "సెలయేటియిసుకతిన్నెల గూఢమణికేళి, కల నిలింపాంగనల్గలసి యాడ
దీర్ఘికాబ్జముల సంధిత్సకహంసముం, డలరులు జతగూడి వెలయఁ జేయ
వృక్షశాఖల డాసి బుష్పాళితేజస్స్థి, మిరమేళనాశ్చర్యగరిమఁ జూపఁ
గటకకూటములందుఁ గదిసి గంధర్వసంఘా, తంబు సంగీతకలనఁ బెరయ
తే. గీ. నాకభూలోకములకు సంతతముగాఁగ, రాకపోకలు నెరపఁ బరస్పరంబు
దివిజమనుజులు కోర్కి సంధించుకొనిన, దండినిశ్రేణి యనఁగ వంకకొండ దనర.

ద్వితీయాశ్వాసము, ౫౭.

సీ. "గొంతెత్తి గోవింద గోవిందయని సంత, సళ్ళగా బిట్టువాపుచ్చువారు
ప్రతిమాటు మారుతాహతి వీతెనాగణి, ననువుగా సవరింపుమనెడువారు

ద్వారగోపురదృష•ద్వారశాసనవర్ణ, నమితివిన్పుటము గాం•జదువువారు
వడివడి ముందుకై•నడచి క్రమ్మతి తన, యడుగులం బడి మ్రొక్కు•లిడెడువారు
తే. గీ. నైనవారలం దన వెంట•నరుగుదెంచు, వారి నలమూకబధిరాంధ•పంగుజనులం
జూచుచుం గపటనాటక•సూత్రధారు, చిత్రనాటకపటిమక •చ్చెరువు చెందె."

షష్ఠాశ్వాసము, ౧౬౯.

సీ. "తొలికోడి తానెయై•యెలుంగెత్తి మూంకుభుం, గులంగుక్కు టేశుండు•కొసరికూసె
నాలమందల కెల్ల•నధినేత తానెయై, పొంకంబుగా నంద•ఖంకె వైచెం
దీర్ఘంబుం దెచ్చుహ•స్తికిం బెద్ద తానెయై, లంబోదరుండు బృంహి•తంబొనర్చె
విహగంబులకునెల్లం•బెద్ద దానై కుమా, రుని కేకి పిలుచ ని•స్వన మొనర్చెం
తే. గీ. దానెలింగార్చకులకుం బ్రా•థమికుండగుచుం, బ్రాతరనిలుండు కేతనా•గ్రమునను స్న
నఘంట మ్రోయించె వందిమా•గధులు తామె, యగుచు భక్తులు పేర్కొ•నిరపుడు మర్మ॥"

షష్ఠాశ్వాసము, ౨౩౭.

కొన్ని సమయములం బాత్రల యుల్లంబుల పల్లడిగొను తలంపులు మెలపునం దెలుపంబడుటయుం జూడనగు.

సీ. "వయసంబు వెడలుచోం•బవమాన మెదురౌట, మన్నిమిత్తంబని•తోంపదయ్యె
వాహనంబులు లేక•బ్రహ్మాదిముఖ్యులు, దోడరాం దగదని•తోంప దయ్యె
మాహేశ్వరుం డైన•మాని నౌదవ్వులం, దోంప నమ్రతం జూపం•దోంప దయ్యె
గౌరీప్రసాదసు•క్షపయోజమాల కం, దోయి నద్దుకొనంగ•దోంపం దయ్యె
తే. గీ. నేమి సేయుదు దివ్యప•రీమళాఖ్య, బడిశమునం బడి శమగుణం•బుడుగ వడగం
జిత్తమీనంబు చిక్కులం•జిక్కె నకట, దైవనిర్ణయ మెవ్వారు•దాంటువారు!"

తృతీయాశ్వాసము, ౫౨.

మ. "మునిరాణ్ముఖ్యుని శక్తి మున్నెఱుంగనో•ముక్కంటి యాదంటరై
యనసూయాపతియందు నత్రికి సుతుం•డై యెల్ల నాలింపనో
జనవక్రోధనుం డీశపోధనుండు దు•స్సాధ్యప్రభావాఢ్యుం డం
చనివిన్నాండను గాను నా తెలివి యే•మై పోయెనో! యక్కటా!"

తృతీయాశ్వాసము, ౫౩.

సీ. "కట్టించుకొనినాఁడు గద వైజయంతంబు, తన కేమొ యిది శాశ్వతం బటంచుఁ
గావించెఁ గద యోలగము సుధర్మాస్థాని, తనయధికారంబె తప్ప దనుచుఁ
బాలించెఁ గద స్వర్గపట్టణం బేపట్టు, నను దన కదియె కాణాచి యనుచుఁ
గొలిపించుకొనెఁ గదా వలపించియప్సర, స్సతుఁచేఁ దనపెంపెసత మటంచు

తే. గీ. నార యాయింద్రుఁ డిప్పు డెందరిగ నొక్క-
మనలఁ దొలివేలుపుల మాట మఱియు సవతి
తల్లికొమరుల మాటఁ దత్స్వర్గరాజ్య
మెల్ల మన కనుభోజ్య మంచెఱుఁగఁ డొక్కొ."

తృతీయాశ్వాసము, ౧౧౧.

సందర్భోచితవర్ణనలకై వెదకికొన నక్కఱయే లేదు. ఈ గ్రంథమునం గల మనోహరవర్ణన లన్నిటిం గూర్చి విస్తరించి వ్రాయ వీలు లేమిచే దిక్ప్రదర్శనముగఁ గొన్నింటి మాత్రము వివరించెద. నా చూచినంతవఱకు నాంధ్రప్రబంధములలో నెద్దానియందును ఋతువర్ణన మీగ్రంథమునందువలె హృదయరంజకముగను స్వాభావికముగను జేయఁబడియుండ లేదు. అయాఋతువులందు భూపులు మొదలు కాఁపుల వఱకుంగల యన్నియంతస్తులవార లెట్లెట్లు కాలము గడపుచుందురో, ప్రపంచమంతయు నెట్టిమాఱుపు లందుచుండునో తెలుపఁబడి యుంటయే కాక, యప్పుడప్పుడు మన యనుభవములోనికి వచ్చిన వయ్యు మనము గమనింప నట్టియు, గమనించియు మఱచిపోవు నట్టియు, విషయము లన్నియు మనస్సున కొక్కసారిగాఁ బ్రదర్శింపఁబడి, స్వప్నమునందుంబలె నిమేషమాత్రమున సంవత్సరభుక్తి జ్ఞప్తికిఁ దేఁబడి యున్నది. ఇయ్యెడ వీరికిం గలపరిశీలనశక్తియుఁ, బ్రపంచజ్ఞానమును, బ్రకాశితములగుచున్నవి. హాస్యరసాస్పదము లగుపద్యము లనేకము లీఘట్టమునఁ గన్పట్టును.

సీ. "ప్రహిబహిః కుట్టిమాభ్యర్ణగాంధఃపూర్ణ, కలశాంబుధులు గతిక్లమమునుఁ బాప
నవనారికేళవర్ణకలింజకస్థితుల్, మార్గాతపోత్థశ్రమంబు నడఁప
జంబీరరసపూరసమ్మిశ్ర మగుతక్రసారంబు తృషను జల్లారఁ జేయ
నాయతకాయమానాంతరస్థితతాళ, వృంతముల్ ఘర్మాంబువిరతి నడఁప
తే. గీ. నిదుర గదురంగ నపుడధ్వనీనజనము, విడియు నొక్కొకపుణ్యాత్ముఁ డిడినయట్టి
ప్రపనపానసుఖాప్తి మైఁ బనుల మఱచి, పట్టపవలింటి వసనోఁకుఁ బట్టకుండ."

ద్వితీయాశ్వాసము, ౭౯.

సీ. "ముసుఁగిడ్డ కుఱుమాపు ముదుకదుప్పటిచెమ్మ, గిలకుండ నలఁతికోలలు చొన్ని
హత్తించి తొడిగిన క్రొత్తచెప్పులజోళ్లు, దడియకుండఁగ వీథిఁ బరుపఁ జేసి
గుత్తంబుగాఁ జుట్టికొనినచుట్టలనిప్పు, లారకుండఁగఁ బంచ టుఱుఁగులెత్తి
పొన్నుఁగఱ్ఱల యూఁతఁ గన్నుఁగానక జాఱి, పడకుండ గచ్చసావడుల నిలిచి
తే. గీ. చేలపనులందుఁ జొప్పడు చెలిమిసఁజ
గాఁపుఁగొమరులు పసుపుసు నులఁ గొనిన
శాలిపాలికల కుటీరపాళిఁ జేరి
రెట్టకేలకు వజ్జడి సేకితము ॥"

ద్వితీయాశ్వాసము, ౯౧.

సీ. "పట్టుఁబుట్టముఁ జుట్టి నట్టిబోడిశిరంబు, పైనొప్పు నక్షయపాత్రి నొకటి
యురుకక్షములలోని తిరునామములపుస్త, కముననుదాళవృంతమున రెండు
క్షుద్రకుటీప్రాంతకుంకుభీతినిఁ గుజ్జకేలఁ దాల్చినతిరుకోల నొకటి
దాచేతిదారుఖండపుఁ దాళయుగి రెండు, స్వప్రతీకంబులఁ బదియు రెండు
తే. గీ. రమణ నష్టావశోర్ధ్వపుండ్రములు దనుక, నమరనత్యర్థవైష్ణవత్వము ఘటిల్ల
బికిర మెత్తంగ పాతానిపిందు దిఱుగుఁ, దగ దసుర్హాసవానరాంతములనపుడు."

ద్వితీయాశ్వాసము, ౧౦౦

సీ. "నవశాలిసస్యకృంతనవిధానైకస, ంభ్రమముపల్ల్గ్భమసంక్షిప్తభవకులంబు
వార్షికవ్రీహిసంపాదనాజస్రస, త్వరచరద్గ్రామసేవకజనంబు
పార్థివగ్రాహ్యషడ్భాగగ్రహణకార్య, దుర్యోగిపురుషకోటోత్కరంబు
ప్రతిగేహపర్యటద్వాద్యవాదసనాథ, కోణంగియుక్తభిక్షువ్రజంబు

తే. గీ. దనర నక్షత్ర నాగ్రభాంతప్రదోష, మాప్రదోషప్రభాతంబులంతటుల యిటుల
తిరుగ నయ్యయిసందడిం దెలియ లేమిఁ, జేల కూర్లుదు నెకవింతం జెలువుదోఁచె!"

ద్వితీయాశ్వాసము, ౧౦౧.

స్వర్గవర్ణనముకూడ నీరీతిగనె నిరుపమానసౌందర్యము కలదై యున్నది. ఏవ వొడమఁ జేయకుండ శృంగారరస మెంతవఱకుఁ జూప నగునో యంతపర్యంతము గనఁబఱుపఁబడి యున్నది. ఉత్తరహరివంశము, మృత్యుంజయవిలాసము, మొదలగుగ్రంథముల యందలి స్వర్గవర్ణనలకుఁగూడ దీని యెదుటఁ దలయెత్తి మెలఁగ వలను పడదు. దిగధీశులు విష్ణుం బొడగని నప్పు డొనర్చిన స్తవము లెంతయు సహజములుగా నున్నవి. నైమిశారణ్యవర్ణన, నాచనసోమునిబదరికాశ్రమవర్ణనవలెఁ జదువువారి మనములఁ దనతోఁ గొనిపోయి, మునిజనావాసమునఁ బ్రవేశింపఁజేసి, పక్షిజాతులకూఁతలును, సెలయేళ్ల మ్రోఁతలును, దప్ప నేచప్పుడు లేక యొప్పు నప్పట్టునఁ, బరమశాంతస్వాంతులై, తపోధ్యాననిష్ఠాగరిష్ఠులై, సంసరణతరణితరణమునకు "శ్రీరమణసేవలె కేవల నౌకలౌట" నెఱింగి, "ప్రత్యహముం గృతనిత్యకృత్యులై శౌరికథార్థముల్ వినుచు శార్ఙ్గిఁదలంచుచుఁ జక్రిమంగళాకారము నాత్మ నెంచుచును గాలముఁబుచ్చుచు"నుండు జటిమండలిదర్శన మొడఁగూర్చుచున్నయది. అదితి దౌహృదప్రసవవేదనావర్ణనల దీటుకొనఁ దగినవి నేనింత వఱ కెన్నఁడునుఁ గని యుండలేదు.

సీ. "నివరిప్రాల్వోసివండినబమ్మ యిణిపాల, పరమాన్న మొకమానిం బత్నియిచ్చెఁ
దనప్రోవుఁ గాంచి క్రొంత్తగఫలించినవింత, చెట్లపండ్లొక మునిం స్త్రీ యొసంగె
నిజగృహాభిమంత్రితసిద్ధమహిమాత్మ్యతల నెక్క మునివధూంతిలక మునిచె
యవమయష్టికపిష్టంవవఘృతపక్వభా, ద్యము లొక్కతబిసియింల్లాలుదచ్చెఁ

తే. గీ. దాను బూజించుదేవిపాందముల మీఁద, గొనబునిర్మాల్య మొకతపోంధనపురంధ్రి
యిడిరా సీమంతశుభశోభం బెసఁగుకళ్య, పమునిసామఁతసీమంతంవతికి నచట."

చతుర్థాశ్వాసము, ౧౧౨.

సీ. "శ్రవణగమ్యముగ నారణ్యకోపనిషత్తుఁ, బారాయణముఁ జేయవలయు నేమొ
బల మెలర్పఁగ మహేశ్వరుని ముంగిటినందిఁ, బట్టియిట్టటుఁ ద్రిప్పవలయు నేమొ
గ్రుక్కలొక్కటి రెండుఁ గ్రోలఁగా స్వధితిచే, జలము మంత్రించి యీయవలయు నేమొ
కవచము నందికొనంగాఁ బత్రపుటముపై, విలిఖించి యంత్ర మీయవలయు నేమొ

తే. గీ. యనుచు శీఘ్రప్రసూత్యుపాయజ్ఞులెల్ల, నుటజబహిరంగణంబున నుండి రపుడు
జరఠమానినికుటుంబినీజననియుక్తి, నొక్కటఁ దవీయబాలకాహూతులగుచు॥"

చతుర్థాశ్వాసము, ౧౧౬.

వామనమూర్త్యావిర్భావఘట్టము శైలిచేఁ బోతనార్యుని భాగవతముతోఁ దూఁగలేకున్నను, గథాసంవిధానమునమాత్రము దానికి వీసమైనఁ దీసిపోకుంట యటుండఁ గొన్నివిషయముల దానిని మించియున్న దని యొప్పుకొనక తప్పదు. తృతీయాశ్వాసము నందలి శారికాసంవాదఘట్టము మున్ను వాకొనినయన్నిటికన్న నెన్నికఁ గనఁదగియున్నది. పదలాలిత్యమున నేమి, కథాచమత్కృతియందేమి, భావవివరణమున నేమి, కళాపూర్ణోదయ ప్రభావతీప్రద్యుమ్నములఁ బురుడించుచున్నయది. ఇతరాంతరంగవృత్తిజ్ఞత్వమును భాషాప్రావీణ్యమును యోజించిచూడ నీశారికలును సూరనార్యుని హంసీవతంసము నొక్కయాకుననే చదివిన వను సందియ మొదవక మానదు. అమరావతీపురికి మరలివచ్చిన పిమ్మట శచీపురందరుల స్వాంతమునకు "దొంతరవింతలచే సంతరింపఁబడిన దంతుర మగుభ్రాంతి," కలభాషిణీ మణికంధరులకు, రంభానలకూబరులకును గల్గినచిత్తవిస్మృతిని స్మృతికిఁ దెచ్చుచున్నది. షష్ఠాశ్వాసము నందలి కథ కూడఁ జాలవఱకుఁ గవికిం గలస్వకపోలకల్పనాసామర్థ్యముం బ్రకటించుచుఁ గళాపూర్ణోదయరుచుల వెల్లిగొల్పుచున్న యది. ఇందుఁ బాఱునకు నాభీరునకు జరిగినసం

వాదము వలన నిక్కువిశేం గలసందర్భోచితపదప్రయోగనై పుణ్యము దెలిసికొనవచ్చును.

గ్రంథనామము:—“మహేంద్రవిజయమునకు మాతృక యైన యుపమాకామాహాత్మ్యము సంస్కృతమున రమారమి నూఱనుష్టుభశ్లోకములు గలదై”బ్రహ్మకైవర్తపురాణమున నొకభాగముగా నున్నది. ఈ కవీంద్రుఁడు దాని నధికముగాఁ బెంచి, మూలము నందలికథతో నూతనగాథల జతగూర్చి యల్లి, యాఱాశ్వాసములప్రబంధముగా రచియించి యున్నారు. మాతృకకువలె దీనికిఁ గూడ సర్వవిధముల నుపమాకామాహాత్మ్య మనుపేరే సరి యైన దైనను, “నింద్రదజయంబు ముఖ్యగాథగఁ దోఁచెం గాన మహేంద్రవిజయ మని దీనికిఁ బే రిడుట మంచిద”నిగ్రంథాది యందుఁ దెల్పఁ బడియున్న కవియభిప్రాయము కేవల మపూర్వ మని కాని యసంగత మని కాని చెప్పఁ జొప్పడదు. మొదటి మూఁడాశ్వాసము లందును మనువునుగూర్చి యొక్కవాక్య మైన లేకున్నను గథకంతకుఁ బ్రధాననాయికానాయకులు వరూధినీప్రవరాఖ్యులయ్యును, నాంధ్రకవితాపితామహుని ప్రబంధము “స్వారోచిషమనుసంభవ”మనుపేరఁ బరగుచున్నది. దానికన్న నిది సార్థకనామమే.

కథావిషయము;—ఈ గ్రంథముయొక్క ప్రధానోద్దేశ ముపమాకాక్షేత్రమహిమానువర్ణనము. ఎవ్వరైన బంధురతటాకోపాంతమునఁ దపంబు సల్పినను, దజ్జలంబుల మజ్జనం బొనర్చినను, గరుడభూధరంబధిరోహించినను, దతూర్ధ్వ టస్థితుం డగుదేవుని సేవించినను, దత్తన్మనోభీష్టసిద్ధిరూపమున నాక్షేత్రమాహాత్మ్య మెల్లరకుఁ బ్రకటీకృతం బగుచుండు నని బోధించుగాథ లిందుఁ బొందుపఱుపఁబడి యున్నవి. అట్టికథల ముఖ్యార్థ మే సంగ్రహముగ నీక్రిందిపద్యమున హృద్యముగఁ దెల్పఁబడి యున్నది.

సీ. "బ్రహ్మవిద్యామహా • ప్రజ్ఞానిధిత్వంబు, దివిజేంద్రసదృశ • భవసమృద్ధి
యదితికశ్యపసమా • నాపత్యయోగంబు, సంద్రనాయక కౌతు • కానుషక్తి
నారదప్రతిమాన • తారకజపసిద్ధి, ధూర్జటినిభభూత • దోషవృత్తి
హీనభూతాభసాం • తానికలోకాప్తి, పల్లవతుల్యకై • వల్యపదవి
తే.గీ. యేతదస్త్రప్రభూతవి • ఖ్యాతమహిమ, సహితమహితకథావిధ • శ్రవణపఠన
నిరతనిరతులకౌదవు—"

షష్ఠాశ్వాసము, ౨౬౧.

ఇఁక నాయాగాథల గ్రంథవిషయము నుండి విరళపఱిచి ప్రత్యేకముగ వానియందుఁ గానఁబడు రచనావిశేషముల మాత్రము గొన్నిటివివరించెద.

మొదటి రెండాశ్వాసముల యందును వేదాపహర్త యగుసోమకాసురునివధ దెలుపఁబడి యున్నది. ఈ భాగము కథాచమత్కృతిచేఁ బ్రసిద్ధము కాకున్నను, రసభరితంబులై వినువారలవింపక చదివినకొలఁది మది ముదము గదురఁ జేయుబుతువర్ణనల వలన నెంతయుమనోహరమై పొలుచుచున్నయది. తృతీయ, చతుర్థ, పంచమాశ్వాసములీగ్రంథమున నెన్నికఁ గన్నకథ లన్నిటిలో మిన్నయైన వేల్పుమన్నికానిగాథచే వన్నెకెక్కియున్నయవి. ఈ భాగమును "మహేంద్రవిజయమ"నుటకన్నను "మహేంద్ర గర్వనిర్వాసనమ"ని చెప్పిన నొప్పిదముగనుండును. పేరు వేఱుగ నున్నను, దానింబట్టి కవియుద్దేశము కూడ భిన్నముగ నుండు ననుకొనవలసి వచ్చినను, ద్రచ్చి చూచినమాత్ర మింద్రునికింగల్గిన శృంగభంగమే ప్రధానాంశ మనియుఁ, దద్వివరణముననే కవి తమసామర్థ్యము నంతయు వినియోగించినా రనియు, ముఖ్యముగ దానివలననె గ్రంథమున కిట్టిప్రాశస్త్య మొనఁగూడిన దనియుఁ, దోఁపకమానదు. ఈ యభిప్రాయమును స్థిరపఱుచుట కష్టము కాదు. ఈ విషయ

మున మూఁడుభాగములు స్పష్టముగాఁ దెలియు చున్నవి. 1 పురందరుఁడుసురేంద్రపదవీభ్రష్టుం డగుట. 2 నిశాచరుఁడు శచీవరసింహాసనాధిష్ఠాన మొనర్చుట. 3 త్రివిష్టపపతి పునఃప్రతిష్ఠితుం డగుట. మొదటి దానియందు రాజు గర్వితుఁడైనచో ననుచరసహితముగ శిక్షింపఁబడునని చూపఁబడినది. రెండవదానియందు రాజుగుణశాలియే యైనను, దుర్నయమూర్తుల నికటవర్తులుగాఁ జేరఁదీసినచో వారిమూలమునఁ దాను దండితుఁ డగు నని తెల్పఁబడినది. మూఁడవభాగమునఁ బశ్చాత్తప్తు లైనవారిని భగవంతుఁడు కృపాళుం డై చేపట్టు నని తేలుచున్నది. మదించినవారి కున్నది పోవుటయే మృత్యుసదృశం బగు శిక్ష. అది తమవైరులఁ జేరుట పైదానిని మించినవంచన. తుదకు బ్రతుకుఁదెరువున కితరుల బతిమాలుకొనవలసినగతికిఁ దేఁబడుట వీనినన్నిటిఁ దలఁదన్నిన బన్నము. ఇద్దియే మనశతమన్యునకు సంప్రాప్త మైనస్థితి. అది యకారణముగఁ గల్గినది కాదు. మున్నొకపరి విష్ణుదర్శనార్థమై వైకుంఠపురి కరిగి యచ్చట

శా. ‘‘ముల్లోకంబుల నేలు చుందు సవనం॥బు ల్నూఱు గావించితిన్
దల్లం బై తగుసౌమనస్యమున వ॥ర్తింతున్ బుధశ్రేణియం
దెల్ల న్ముఖ్యుఁడ నై మెలంగుదు’’

తృతీయాశ్వాసము, ౧౫౦.

నని విఱ్ఱవీఁగి తుదకు శ్రీహరిం బొడగాన లేక, శారికలచేఁ దిరస్కృతుఁ డై, నారదునిచేఁ బరిభూతుఁ డై యరిగినత్రోవనె మరలి వచ్చెను. అయిన నంతటితో జ్ఞానము దెచ్చికొనక, మదాంధుఁ డై కరణీయకార్యముల మఱచి, యకరణీయకృత్యముల జరపుచు, గురువుల నాదరింపవలయు నని తెలిసియు దుర్వాసునకుం బరిచర్య సేయక,

వారిప్రసాదము నిరాకరింపఁగూడ దని యెఱింగియు న ట్లొనర్చి, య త్తాపసుకోపాగ్ని రగులఁ జేసి శాపోపహతుం డయ్యె. కావుననే పూర్వముకన్న నధికశిక్షకుఁ బాత్రుఁ డై తనరాజ్యమును గోల్పోవు టయే కాక యది శాత్రవుల యధీన మగుటఁగూడఁ దాఁ జూడవలసి వచ్చెను. తనతప్పు తా నెఱింగినవాఁడగుటచేతనే యసహాయుం డై శ్రీహరిదరిఁ జేరుటకు వెఱచి, సురగురునిం గూడఁ దోడితెచ్చుకొనవ లసి వచ్చెను. ఇతఁడు నేర మొనర్చిన కారణముననె "ప్రత్యక్ష మైతి నీకు మాత్రంబె సురపాలనైకలోల" యనియు, "మెచ్చితి నీసచ్చరి తకు, వచ్చినపని ముచ్చటించి వర మడుగు" మనియు, బృహస్పతితోఁ, గుపితుం డగు నాహరి, బలారిం గికురించి మాటాడఁ దొడంగె. ఇం ద్రునివలని లోపమును, నాతని శిక్షింపవలె నను నుపేంద్రునిమనోనిశ్చ యము నెఱింగిన వాఁ డై, రాజనీతిపారంగతుం డగుగురుం డతిజాగ రూకతతో నంత వఱకు జరిగిన దంతయు న్యాయ మని యొప్పుకొని, యతివినయోక్తులఁ దనమనోభీష్ట మల్లనల్లన వెల్లడిచేయఁ గోరి "శ్రీవర! దేవరం గనుటచేతను జేతనులు...నిత్యవిభవంబును గాంచి... సదాసుఖితులౌదు రటంచుఁ గోవిదులువచింతు" రనిఁ యారంభించి, "దేవ ర పాదసూపుటయే వర "మని స్తోత్రముచేసి, "స్వర్గమర్త్యపాతాళ ములు దేవమనుష్యాసురులకుఁ దావలములుగ" సృష్టింపఁబడి యున్నను, "త్రిదశాలయం బని స్వర్గమునకు, బలిసద్మ మనుచుఁ బాతాళమునకు" సంజ్ఞ లమరుచున్న నిప్పుడు "తత్క్రమంబు దప్పుటకుం" గారణ మొం డుండనోపు నని యొడఁబడి, కడ కింద్రున కొడఁగూడిన కడగండ్ల విడివి డిగాఁ జెప్పి, "దీనజనతార్తిసంహారి దానవారి శౌరి యనుఖ్యాతి

నిలుపు కొమ్మ" ని వేవిధమ్ముల వేఁడుకొనఁ జొచ్చె. ఇంతియ కాక పన్న గశయనుఁడు ప్రసన్నుఁడై "మీసంకటములు దీర బలిని రసాతలసీ మకుఁ బంపెద" నని మాట యిచ్చిన పిమ్మటఁ గూడ సురాచార్యునికిఁ దనివి తీరకుంటఁ జూచి, "పలుమఱు శ్రీహరి గురునిం దలఁపు తెలుపు మనిన నింద్రుఁడు నాకము నంపు న్నిలుపు మని కోర" "నవ్వుచు నటు కాని మ్మని హరి యనుగ్రహించె" నఁట! సురేశ్వరునకు బుద్ధిగఱపు టకుఁ గాకున్నఁ జుట్టుఁగై దువుజో దింత బెట్టుసరి సేయుట యెన్నఁ డైనఁగని యున్నారమె? వజ్రనాభదైత్యుఁడు స్వర్గము పై దాడి వెడలి సురలఁ బాఱఁదోలి నప్పు డింద్రునిఁ గని, కృష్ణుఁ డిష్టబంధువనియు, సత్పురుషుఁ డనియుఁ గొనియాడి యాతని వెఱపుఁ బోఁ జఱచుట మన మెఱుఁగమా? ఈ గ్రంథాదియందు వేదములఁ గోల్పో యినబ్రహ్మ తనతండ్రి యొద్దకు నిర్భయముగాఁ బోవుట మనము గని యుండ లేదా? హరి యైనను దనయభిప్రాయ మస్ఫుటముగాఁ దెల్పి యుండ లేదు. "కులబలసంపదామదలు దగుల్కొన హత్తిన మత్తవృ త్తి...తద్బల ముడివోయినప్పుడ కదా" తొలఁగు నని మొదట జనసా మాన్యముం గూర్చి చెప్పి, పిమ్మట బుభుక్షుండు "ప్రభుతాప్రభవప్రభూ తపటువైభవగర్వభరంబునఁ దజ్ఞత దప్పి భవానిప్రసాద మభిభవించె" ననియు, దుర్వాసుఁడు "సదయుం డై గోవిందుఁడె కలఁ డటంచు వాక్రువ్వక యూరక యే వెడలిన" శాపము గ్రమ్మతింప నెవ్వరికిఁ దర ముగాదనియుఁ, బాఠశాలాధ్యక్షుఁడు తనక్రిందియుపాధ్యాయుని ధిక్క రించిన విద్యార్థికి బుద్ధిచెప్పిన చొప్పున దిక్పాలమాళికిఁ దలవంపు గలుగఁ బలికెను. మఱియు బలిభంజన మొనర్చిన పిదపఁ గూడ "స్వారాజ్యం

బింద్రునిచేత సాంద్రప్రేమంబున నిస్తంద్రత నేలింపుమని" మునులు ననిమిషులును మనవి సేసినం గాని పట్టాభిషేకంబున కియ్యకొనం డాయె. అంగీకార మొసంగిన పిమ్మటం గూడం, దాను సన్నాహ మొనర్పు మనుటకు మున్నపార్వతీపరమేశ్వరుల నారాధింపక యే, బ్రహ్మర్షియుక్తుండై పట్టాభిషిక్తుం డగుటకు వచ్చి యుండె నని విని "యేకతంబున నింత పుట్టె, దాని నిపుడైన మరలింపం గానం డయ్యె" నని వాస్తోష్పతిం గూర్చి గీష్పతితో మొఱవెట్ట సాఁగెను. ముక్కంటియు నాతనిమచ్చికంటియుం గూడం దెఱగంటిదొర తమయడుగులపైం బడి మ్రొక్కి లిడిన లేవనెత్తి "యైన దేమయ్యెనో భుక్తమయ్యెం గాని, యిప్పుడైనను దృశ్యమందించుకైన, నీశ్వరుని కంటె భేద మంచెంచం బోకు"మని చెప్పి, యాతని యహంభావము వేరంటం దెగనఱకి, తమ పురి కరిగిరి. కావున నీమూండాశ్వాసములలో మహేంద్రగర్వభంగము ముఖ్యాంశ మని సంశయములేక చెప్ప వచ్చు. అయినను, మొదటం బడరాని వెతలం బడి, తుదకు స్వకర్తృకముచేతనైన నేమి, యీశ్వరసంకల్పమున నైన నేమి, కథానాయకుం డానందాభ్యుదయ మందిన కారణమువలన, నయ్యలరాజు రామభద్రుని గ్రంథమునకు "రామాభ్యుదయ"మను పేరు వచ్చిన తీరునసే, మహేంద్రునకును భగవత్కటాక్షమునం దుదకుం గలిగిన విజయమునుబట్టి యీ గ్రంథమునకు "మహేంద్ర విజయం"బను నామంబుంచంబడి యుండ వచ్చును.

షష్ఠాశ్వాసమునందలి కథాసూత్ర మొక్కొకచోటం జిక్కుగాం దోఁచిన నోపికతోం జదివిన వదలించుట సులభమే. క్షేత్రమహిమను దెల్పు నవి కొన్నియుం, దారకమంత్ర ముపదేశ మందిన వారికి వేంకటే

శుఁడు సులభగమ్యుఁ డని చూపునవి గొన్నియు, నై దీనియందుఁ గూర్పఁబడినకథలు రెండు విధములుగా నున్నవి. అశ్వత్థవృక్షము నాశ్రయించి యున్నబ్రహ్మరాక్షసోత్కరమునకుఁ "బద్ధమోదకబిందు సంపర్కమునను, సుష్టభావంబుమాత్రంబె తొలఁగెఁ గాని" "బంధుర సరోంతర్వారిపూరంబులం దానంబాడు" నంతవఱకుఁ బిశాచవృత్తి విడిచి పోదయ్యె. తార్క్ష్యశైలారోహణ మొనర్చిన వెంటనే మూకబధిరాంధపంగులకుం గలయవరోధము నివారింపఁ బడియె. కళింగరాజకన్య చిఱుతప్రాయమున గరుడభూధరమునకుఁ దోడ్కొని పోఁబడియుంటం జేసి, బ్రహ్మరాక్షసులనుండి రక్షింపఁ బడుటయే కాక యాంధ్రేంద్రుపురంధ్రి యయ్యె. పుణ్యక్షేత్రముల నన్నిటిఁ గన్నారదున కుపమాకలోఁ గాని తారకజపసిద్ధి కల్గదాయె. ఈ మంత్రరాజ ముపదేశ మందినవల్లవునకును బీఠికాపురవల్లభునకును, వేంకటేశుఁడు వశుఁ డై కోరినవరము లొసంగెను. కళింగరాజతనూజ వృత్తాంతమును, బీఠికాపురాధీశులకు వంశపరంపరాగతము లగునామధేయముల *వ్యుత్పత్తియును, దెల్పుగాథ షష్ఠాశ్వాసమున కెల్ల స్తోత్రపాత్ర మై యున్నది. కొన్నిగ్రామనామముల యర్థముం బట్టి మిగుల నేర్పుతోఁ గూర్పఁబడినదగుటచే, స్వకపోలకల్పితం బయ్యు వాస్తవముగానే తోఁచుచున్నయది. ఒంటిమామిడియే మునివాసము; రావికముపాడే బ్రహ్మరాక్షసుని రావి; తేటగుంటయే ద్విజుఁడు వార్చిన గుంట; గోపాలపట్టణమే వల్లవులపల్లె. వల్లవుని వృత్తాంతము కూడ శ్లాఘనీయముగనే యున్నది. విద్యాగంధ మెఱుంగక పశుప్రాయుఁడుగాఁ బెరిఁగిన వానికి సామాన్యముగ నీశ్వరతత్త్వవిచారణాసక్తియే పొడమదు. పొడ

మినను వానిమనం బాధ్యాత్మికవిషయములఁ జాలదూరము పోనేరదు. ధరణీజాతవ్రాతమును, జంతుసంతానమును బెట్టుపోఁతలు లేకయే పెరుఁగుటయు, నంతరిక్షమున లక్షలకొలఁదినక్షత్రము లాలంబరహితము లై వ్రేలాడుచుండుటయుఁ జూచి, యాదికారణ మగుశక్తి యెచ్చటనో యుండి తీరవలయు నని గ్రహింపఁ గలఁడు కాని, యాశక్తి యిట్టి దని నిరూపింపఁ జాలఁడు. కావున నట్టినిష్ఫలప్రయత్నముల నుండి యాతని మనస్సు వెనుకకు మరలిపోవును. పిమ్మటఁ జిత్తమునఁ గల్గుమార్పులు వానికి లభించు సాంగత్యము ననుసరించి యుండును. సర్వసాధారణముగ ముక్తిమార్గాన్వేషణాసక్తచిత్తవృత్తాంత మిట్టిదయై గన్పట్టును. ఇదియే మిక్కిలిరమ్యముగా నిందు వర్ణింపఁబడి యున్నది.

“ భాషాభిమాని.”

19—9—1906.



# తప్పొప్పులు.

| పుట. | పఙ్క్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౪ | ౧౭ | మునుఁగొనంగ. | మునుకొనంగ. |
| ౧౨ | ౧౭ | నాగమములు. | నాగమముల. |
| ౧౩ | ౨౫ | శాస్త్రములు. | శాస్త్రముల. |
| ౧౬ | ౨౨ | గాముసల్ల. | రాములల్ల. |
| ౨౭ | ౯ | క్రోధముఖాది. | క్రోధముఖారి. |
| ౨౮ | ౭ | అనవృండా. | అనఘుండా. |
| ౪౫ | ౨ | నెద్దేవ. | యద్దేశ. |
| ౫౧ | ౪ | తోడఁజేర్కొనక. | తోడనూఁగొనక. |
| ౫౩ | ౨౨ | రథోద్ధిశా. | రథోద్ధతా. |
| ౫౮ | ౧౫ | నయ్యయోగ్య. | నియ్యయోగ్య. |
| ౬౦ | ౬ | డెసంగు. | డెసంగ. |
| ౬౩ | ౨౦ | హీనుండనఁ. | హీనాత్ముఁడై. |
| ౭౪ | ౧౨ | పాధి. | పాస్త్రి. |
| ౭౫ | ౧ | జేర. | జేరి. |
| ,, | ౨౫ | యొనరు. | యొపరు. |
| ౭౮ | ౨౪ | విశ్వాసంబునను. | విశ్వాసంబున్న. |
| ౮౧ | ౧౨ | మయూఖా. | మయూఖ. |
| ౮౨ | ౧౫ | దొలఁగునటవే. | దొలఁగునటెయిది. |
| ౮౩ | ౨ | ముందునో. | మొందునో. |
| ౮౪ | ౨౨ | పాటి. | పాటు. |
| ౮౭ | ౧౦ | రాఁదవు | గాదవు. |
| ౮౮ | ౨౫ | జేసియచ్చో. | జేసినచ్చో. |
| ౯౬ | ౧౨ | యెఱఁగిన. | యెఱిఁగిన. |
| ౧౦౧ | ౨౨ | రీతి. | నీతి. |
| ౧౦౨ | ౭ | మం. | మ. |
| ౧౦౬ | ౧౮ | మెఱయంగ. | మెఱయఁగ. |
| ,, | ౨౪ | పారతరు. | పారతక. |
| ౧౧౩ | ౧౨ | రొలువ. | గ్గొలువ. |
| ,, | ౨౫ | పిడప. | పిడుప. |
| ౧౧౪ | ౨ | పాత్ర. | పాత్రు. |
| ,, | ౧౦ | గిన్నరాపతి. | గిన్నరాధిపతి. |
| ,, | ౨౩ | గధ. | గంధ. |
| ౧౧౫ | ౩ | తోయంబులు. | తోయంబుల. |
| ,, | ,, | ప్రసవములును. | ప్రసవములను. |
| ౧౧౯ | ౧౩ | సమరచన. | సమర్చన. |
| ౧౨౧ | ౧౭ | గేలోయి. | గేల్గోయి. |
| ౧౨౪ | ౨౨ | కలిసిన. | కవిసిన. |
| ౧౨౬ | ౧౦ | వానిని. | వానికి. |
| ౧౨౮ | ౧౮ | ధనంబటఁ. | ధనంబుదుఁ. |
| ౧౩౨ | ౧౧ | విరించనసుతుఁడు. | విరించనజుఁడు. |
| ౧౩౪ | ౫ | భ్రాంతి. | భ్రాతి. |
| ౧౩౫ | ౭ | రానియొక్కటి. | రానిదొక్కటి. |
| ౧౩౬ | ౪ | గాఁదగు. | గానగు. |
| ౧౩౭ | ౨౧ | మన. | కొను. |
| ౧౩౮ | ౬ | యయ్యెఁ. | నయ్యెఁ. |
| ౧౩౯ | ౬ | ప్రతిపాది. | ప్రవిపారి. |
| ౧౪౦ | ౩ | కోర్కులిడ. | కోరుకులిడ. |
| ౧౪౨ | ౫ | నిపుడయే. | నిపుడయు. |

శ్రీరస్తు.

శుభమస్తు.

అవిఘ్నమస్తు.

శ్రీగణాధిపతయేనమః.

శ్రీసరస్వతీదేవ్యైనమః.

శ్రీహయగ్రీవాయ నమోనమః.

# శ్రీమహేంద్రవిజయము.

## ఇష్టదేవతాస్తుతి.


రంజిల్లనొనర్చుఁ గావుత శిలాజీవప్రదానప్రథా
ధౌరంధర్యముఁ గాంచి దారుశకలద్వంద్వంబునుం బాదుకా
కారం బూని భజింప భూధరవిభాగ్యస్ఫూర్తిఁ గల్పించు సీ
తారామాంఘ్రియుగంబు మాకు ససుఖోదారాయురైశ్వర్యముల్. ౧.

చం. వసుధ జనించి యాజనకవంశము నయ్యినవంశ మింపుసొం
పెసఁగ సమున్నతత్వము వహింపఁగ మించినసీత శీతదృ
క్ప్రినగణము ల్సుధారసపరంపరలై యలరారుఁ గాత వే
దనదృశదోహదస్ఫురణ నస్మదభీష్టలతాఫలాప్తికిన్. ౨.

శా. శ్రీవర్ధిల్లఁగఁ జేయుఁ గావుత జటాశ్రేణీమిథోబంధరే
ఖావిశ్లేష మొనర్చ స్వర్ణది తరంగవ్యాజహస్తంబుచే
శీవిం జొన్పినదంతకంకతముమాడిక్కన్నాళి లేఁజల్వడా
ల్పూవుం దాల్చినశంకరుం డెపుడు సమ్మోదం బెదం గ్రమ్మఁగన్. ౩.

ఉ. స్నానజలంబు ధౌతవస•నం బనులేపన మోగిగంబు దా
నే నెఱిఁ గూర్చి నాథు నెన•యించు నెం పెండిలికూఁతు రంచు సం
ధ్యానముఁ బూని యవ్వరుని • యవ్వ నటంచు నటించుభృంగిచం
దానకు నెచ్చెలుల్ నగిన • నవ్వెడుశాంకరి మమ్ముఁ బ్రోవుతన్. ౪.

చం. అనుపమ మైనగాత్రచతు•రానన రూఢికిఁ దోడు సత్యవ
ర్తనము మెఱుంగువెట్ట విబు•ధప్రకరంబుల కెల్లఁ బెద్దయై
మనుమని నగ్గళాకలన•మానితుఁ జేసిన సద్దయార్ద్రహృ
ద్వనరుహుఁడౌ మహామహుఁ బి•తామహుని న్నుతియింతు నెంతయున్. ౫.

శా. శ్రీపూర్ణాకృతిముక్తిసౌధచతురం•ఘ్రిస్ఫాటికస్తంభశో
భాపీఠీకృతశాతమన్యవశిలా•భాస్వత్ఖురోద్యద్రజ
శ్శ్రీపేర్మిం బురుషార్థపాళి నిడ నా•శ్రీధేనువాగీశ్వరీ
రూపం బూనితనర్చువాణి సమకూ•ర్చు న్మాకు వాఁగున్నతుల్. ౬.

సీ. కలుము లీనోపఁడే • కమలాప్తసుతరాజ్య,సంఘటనోపాయ•చతురమంత్రి
యిష్టార్థము లొసంగఁ•డే జానకీరాఘ,వాన్యోన్యకుశలవా•ర్తైకదూత
చిరతరాయుర్వృద్ధిఁ • జేయఁ జాలండె ల,క్ష్మణజీవదానభి•షగ్వరుండు
కళల నీనేరఁడే • ఘనమానిసంపూర్ణ,రామసక్థైకపా•రాణికుండు

తే.గీ. పావనాకృతి శైవాంశ•భవుఁడు శ్రీహ,రిస్వరూపుఁడు భావివి•రించనుండు
నిరవధికకీర్తి యగునాంజ•నేయమూర్తి, తత్ప్రసేవనములు జగ•త్పావనములు. ౭.

సీ. ప్రవితతప్రత్యూహ•పవమానగిళనదు,ర్వారశుండా జగ•రంబువాఁడు
బహులశాంతరాయప•ర్వత వినిర్భేదన,ప్రౌఢైకదంతవ•జ్రంబువాఁడు
పటువిఘ్నగణతుష•వ్రజసముద్ధూనన,ద్రాఘిష్ఠకర్ణశూ•ర్పముల వాఁడు
ఘనతరాతంకపం•కక్షాళనపటిష్ఠ,కటతటీదానోద•కంబువాఁడు

తే.గీ. భూరిపుష్కరఫూత్కార•వారికల్పి,తానమయవర్షసిక్తరౌ•ప్యాద్ర్యుపత్య
కాతటోత్థాతకేళిసం•ప్రీతివాఁడు, సిద్ధిగణనాథుఁ డిష్టాప్తిఁ•జేయుఁ గాత. ౮.

మ. కవనాఖ్యేక్షువణంబు నాటి జగతిం • గాండోన్నతిం బెంచి ప
ర్వవితానస్థితి సంఘటించి రసనం•పన్మాధురీసాధురీ
తివిశేషంబు రసజ్ఞజాలమునకుం • దెల్లంబుగాఁ గూర్చి గౌ
రవముం జెందినవారి భక్తిఁ దలఁతుం • బ్రాచేతసవ్యాసులన్. ౯.

కం. నన్నయభరితమనోజ్ఞక, నన్నయభవ్యోక్తిగా సౌందర్యునఁ గృపచే
నన్నయభయధృతిమతితో, నన్నయభట్టాదికవిజనంబునుతింతున్. ౧౦.

మ. తమకావ్యాదుల సత్కవుల్ "గుకవినిందం జేసి" యం చొక్కభా
గముఁ గల్పించి రకారణంబ యది నిష్కారుణ్యమాత్సర్యభా
వమె కా కాఘను లుండకున్న నలదేవానాంప్రియశ్రేణి కె
ట్లమరుం గీర్తివిశేషపూర్తి యిలఁ గావ్యాసారపూర్ణోత్థమై. ౧౧.

కం. అని యిష్టదేవతావం,దనముఖకావ్యముఖలక్షణంబుల నెల్లం
బొనరించి యొద్దియే నొక, వనమాలిక్షేత్రమహిమ వర్ణించుటకై. ౧౨.

కం. ఊహాల కనుగతిగాఁ గౌ,తూహాల మెద మెదల భక్తిదోహాలహితపం
దోహాలలితానుమతి ను, త్సాహాలసచ్ఛక్తిపూర్ణతాహాలహాలికన్. ౧౩.

కం. ఏవానిం గృతిపతిఁగా, భావింతునో యెట్టిదివ్యభవ్యక్షేత్ర
శ్రీ వర్ణ్యమొ యనియోజన, కావించుచునుండి యే నొకానొకరజనిన్. ౧౪.

సీ. శ్రీజానకీదేవి చెలఁగువామాంకభా,గముతో నిరాబారిగమలతోడ
నాంజనేయాంజలిన్యస్తమా శస్తమా, పదముతో నధికసమ్మదముతోడ
వెనుక సౌమిత్రి వట్టినయట్టిహురుమంజి,గొడుగుతో నపరంజిమడుఁగుతోడ
భరతశత్రుఘ్నులు సురటులూనినపార్శ్వ,యుగముతోఁ జిఱునవ్వు మొగముతోడఁ
తే.గీ. గరములు మొగుడ్చున్నఫులలతోఁ గపులతోడఁ, బ్రేమరసపూర్తిఁ బట్టాభిరామమూర్తి
పుష్పకాంతరవర్తియై పూర్వపుణ్య,కలన నామ్రోల నిల్చినట్టులు దలంచి. ౧౫.

చం. నిలిచినకౌసలేయుఁ గని నమ్మద సమ్మద మిమ్మడింప సాఁ
గిలి ప్రణమిల్లి కొంతవడికిం బులకింపన మేనితోడ దో
యిలి నిటలంబునందు ఘటియించి తదంచితచారుదివ్యనుం
గళమహనీయమూర్తిపదకంజములం దిలకించుచున్నెదన్. ౧౬.

మ. ఉపమాకాకృతిఁ బుష్పకంబును సుపర్ణోర్వీధరశ్రీ నువ
ర్ణవరార్థోన్నతపీఠబంధురసరఃప్రౌఢి స్థానూమత్కరా
బ్జపుటప్రోడము వేంకటాధిపతిశేవన్ రామచంద్రుండు నా
కపు డాదేశమురీతిఁ దోఁచె మును నే నాదేశముం గాంచుటన్. ౧౭.

కం. వెరవు న్వెఱుఁగు న్వెఱవుం, బొరకొన నప్పుడు నను ల్నుతు ల్సేయఁగఁ జె
చ్చెరఁ గన్నొఱంగి యొటకే, నరిగెను శ్రీరామమూర్తియనుచరయుతుఁడై. ౧౮.

కం. అంతట జాగ్రదవస్థాక్రాంతుఁడనై యుండు నప్పుడు కనుపట్టె నితం
డెంతవిశదప్రసాదస్వాంతము గలవాఁడొ యనఁ జమత్కృతికుతుకముతోన్. ౧౯.

సీ. మద్వంశజుల దయామతిమీఱ నాదినుండియుఁ బ్రోచె వారలనిష్ఠ కలరి
మత్ప్రతామహపితామహు రామశాస్త్రిని, దోడఁ బల్కుచుఁ గృతార్థునిఁగఁ జేసె
మత్ప్రపితామహుమహితు వేంకటకృష్ణ శాస్త్రి నేలెను దదర్చలకు మెచ్చి
మత్పితామహుఁ గాచె మహిని సీతారామశాస్త్రిఁ దత్సేవకు సంతసించి
తే.గీ. మజ్జనకు నాత్మబోధసంపజ్జనకునిఁ, గృప మనిచె మున్ను వేంకటకృష్ణశాస్త్రిఁ
దత్తదుపచారసంతుష్టచిత్తుఁడగుట, నన్ను మన్నించె నిటులు ప్రసన్నవృత్తి ౨౦.

తే.గీ. అనుచు ముదితాంతరంగుఁడ నగుచు నిష్టదైవతం బగు రఘుపతిధ్యానవేళ
నాదివిభవావతారమర్చావతార, మనఁ జూపుట కేమి హేతువో యటంచు.

కం. మా కీమూర్తిద్వయ మొక్కటి, గా మది భావింపు మనుట గా నెంచి కృతి
స్వామిని రాముని వర్ణ్యశ్రీమహితుని వేంకటేశుఁ జేయుతలఁపుతోన్. ౨౨.

తే.గీ. దేవభాషోదితంబు లాంధ్రీకృతంబు, లై సులభార్థపద్ధతు లగును దాన
నఖిలపఠనీయశైలిచే నలరు నందు, వలన వల నగు విఖ్యాతి గలుగు నంచు. ౨౩.

తే.గీ. బ్రహ్మకైవర్తనామపురాణవిహిత
గరుడశైలఘనక్షేత్రగురుమహత్త్వ
మును దెనుఁగొనర్పఁ గుతుకంబు మున్నుఁగొనంగ
మును కనుంగొన్న తద్ధామమును దలంచి. ౨౪.

సీ. ఆసమున్నతశైలభాసమానానమ్రప్రాసాదమంటపప్రాంగణంబు
నాపావనగ్రావసోపానపార్శ్వప్రదీపావళీస్ఫురద్విభ్రమంబు
నారామణీయకస్ఫారరామలోపత్యకారామతులసీసుసౌరభంబు
నామేఘమేచకశ్రీమేదురామేయ, కోమలస్వామితేజోమహత్త్వ
తే.గీ మాపురం బాసకంబారధావతంస, మామహాతైర్థికులు నాయుపాయనంబు
లామహోత్సవ మాభోగమాప్రసాద, మామహాలక్ష్మిఁ గనినట్టులపుడు దోఁప.

చం. ఇలఁ గలమానవావళి కభీష్టదుఁడై సులభప్రసాదుఁడై
కలియుగమందుఁ దోడఁబలుకం దగు వేలుపు వేంకటేశుఁ డ
జ్వలితపుదైవతంబు నిలువం జెలువం బగు గారుడాద్రికి
న్నిల నుపమాతిగ తన్మహిమ నెక్కొను గాధ లభింపఁ గోరుచోన్, ౨౬.

సీ. ద్వైతమతాచారతత్త్వరహస్యజ్ఞుఁ, డఖిలపురాణేతిహాసవిదుఁడు
దేవతాబ్రాహ్మణాతిథిపూజనాసక్తుఁ, డలిపిరాలాన్వవాయాబ్ధిచంద్రుఁ
డమితతీర్థక్షేత్రయాత్రాతిమాత్రపవిత్రగాత్రుఁడు బుధస్తోత్రపాత్రుఁ
డనఘుఁడు నిత్యసత్యవచఃప్రచారుండు, నగులక్ష్మణార్యసమాహ్వయుండు
తే.గీ, స్పష్టవర్ణసమిష్టిగా వ్రాసికొనిన, సంస్కృతగ్రంథము నొసంగె సంతసమునఁ
గరుడగిరిశేఖరాధ్యుఁ డింకరణిఁ గరుణ, వృద్ధవిప్రాకృతిని వచ్చియిడె ననంగ.
కం. దానిం గొని చదువుకొనం, గా నింద్రజయంబు ముఖ్యగాథగఁ దోఁచెన్
గాన మహేంద్రవిజయ మని, దీనికిఁ బే రిడుట మంచిది కదా యనుచున్.

చం. అదనులఁ దైవతావళి కుదగ్రముగాఁ గృప భక్తపాళిపై
నొదవిన సజ్జనాకృతుల నొక్కొకచోఁ బొడసూపు నంచు న
భ్యుదయపరంపరాప్తికిది యొ ప్పగుసూచక మంచు నెంచికొం
చెద ముదమంది రామవిభు నిక్కృతికిం బతిఁ జేయువాఁడనై. ౨౯.
కం. రామకరుణాత్తవృద్ధి, క్షేమకళాభోగభోగకృతికృతికీర్తి
స్తోమకమనీయవైభవ, మానుకవంశావళీక్రమం బెటిఁగింతున్. 30.

## కవివంశావతారవర్ణనము.

సీ. బ్రహ్మర్షులకు నైనవాఙ్మనసాతీత, మగుచు నగోచరం బైన దెద్ది
యాద్యంతశూన్యమై యఖిలంబుఁ దానయ్యుఁ,దన కఖిలముగాక తనరు నెద్ది
దిక్కాలములకు భేదింప కవిచ్ఛిన్నముగ నిత్యసత్యమై నెగడు నెద్ది
సంతతాఖండసుస్వప్రకాశకమహో,జ్యోతిస్స్వరూపమై యొప్పు నెద్ది
తే.గీ. యట్టి శ్రీపరబ్రహ్మమైనయట్టి, యాదినారాయణుని నాభియందు ముందు
పొందుగఁ దదీయసంకల్పమున సిసృక్ష, పరఁగ సగఁజతుర్ముఖబ్రహ్మవొడమె.
కం. ఆవనజాతప్రభవుని, పావనమూర్త్యంతరములు ప్రభవించిరి లో
కావనసక్తులు నమదు, జ్జీవనశక్తులు సుతు ల్వసిష్ఠప్రభృతుల్. 3౨.
తే.గీ. పరమపావనదివ్యతపఃప్రపూర్తి, శిష్టముష్టింపచవ్రజశ్రేష్ఠమూర్తి
యాత్మవిద్యావరిష్ఠుఁడౌ నవ్వసిష్ఠు,గోత్రమునఁ బుట్టెఁ గౌండిన్యగోత్రమౌని. 33
కం. కౌండవశశిఖండశిరో,మండనుఁ డన సర్వమౌనిమండలమునిమా
ర్తాండద్యుతి గౌండిన్యుఁ డ,ఖండతపశ్శ్రీప్రభావఖనియై తనరెన్. 3౪.

శా. లోకస్తుత్యుఁడు శాంతిదాంతినిధి సు•శ్లోకుండు నైనట్టియా
శ్రీకౌండిన్యమహామునీంద్రుని తప•శ్శ్రీగౌరవం బెట్టిదో
లోకంబం దితరర్షిగోత్రు లాకపా•లుం బాలు తద్గోత్రజుల్
ప్రాకట్యంబుగఁ గావ్యకర్తలు బుధ•శ్లాఘ్యుల్ గలా రెన్నఁగన్. ౩౫.

కం. ఆకౌండిన్యసగోత్రు ల, నేకులు గల రిల రమాస•మిద్ధకటాక్ష
శ్రీకలితలలితకవితా, ప్రాకటనైపుణ్యపుణ్య•పరిపాకమతుల్. ౩౬.

కం. అందు మతత్రయభూమీ, బృందారకబృందములను • వెలసిరి స్మార్తుల్
గొందఱు వారిరు తెలుఁగుల, నొందిరి వైదికులునా ని•యోగులు నాఁగన్. ౩౭.

ఉ. అందుఁ ద్రిలింగవైదికబు•ధాగ్ర్యకుటుంబజనాగ్రగణ్యతా
ధిం దగుఁ బాండితిం గనిన•శీవుల దేవులపల్లివంశ మొ
ప్పం దనశాన్పు ముత్తెములపో•ఁడిమి వృత్తవిశుద్ధమై గుణా
స్పందగతిం దనర్చి మహీ•పత్యుపకంఠవిభూషణంబుగాన్. ౩౮.

కం. ఆదేవులపల్ల్యన్వయ, యాదోనిధిపూర్ణచంద్రు • లగువిద్వాంసుల్
వేదంబుల శాస్త్రంబుల, వాదంబుల నెదురులేని•వారలు గారే. ౩౯.

కం. ధరఁ గొంద ఱందు సీతా, వరపదసేవనవిధాన•పావనులు గగం
బర్గయం గొందఱు లక్ష్మీ, నరసింహపదాబ్జసేవ•నప్రహ్లాదుల్. ౪౦.

మ. సముదంచద్గతిఁ దత్కుటుంబములు గృ•ష్ణాగౌతమీమధ్యభా
గమునం దాగిరిపల్లినామకమహా•గ్రామాగ్రహారంబు ము
న్నమరన్ స్వప్రతిభావిశేషముల క•త్యానందుఁడై షాదుశా
యమరం బిచ్చుట నచ్చట న్నిలచె ని•త్యం బైనకాణాచిగాన్. ౪౧.

ఉ. వారలలోన రామపద•పంకజభక్తినిరంకుశప్రభూ
తారభటీప్రభూతపటి•మాసమమంజులవాక్ప్రసంగవి
ద్యారమణీయకీర్తిసము•దారుఁడు వేంకట ధీరుఁ డెంతయుం
గూరిమి నిల్చెఁ జామరల•కోట పురిం దదధీశు కోరికన్. ౪౨.

తే.గీ. అప్పుడప్పుడు వారల•యందు మఱియుఁ, గొందఱలమండపేటయుఁ•గోరుమిల్లి
మొదలుగలయూళ్లఁ గాఁపురం•బుగ వసించి, రచ్చటచ్చటివిభులసం•ప్రార్థనముల.

క౦. దేవులపల్లికులాగ్రణి, యావేంకటసూరిమణి బుధావళిమదినం
భావింప మించుప్రతిభం, గావించెం గావ్యనాటకము లమితముగాన్. ౪౪.

తే.గీ. సప్తగోదావరాంతరజనపదమున, నెందు షడ్దర్శనీపారదృశ్వుఁ డైన
యతనిసిద్ధాంతసాంప్రదాయంబె కాని, పరమతోదితరాద్ధాంతఫణితి గలదె. ౪౫.

క౦. అతనికి స్వప్రతిబింబ, ప్రతిముఁడు బ్రతిభావిశేషవాచస్పతి యా
సుతుఁడు జగన్నాథార్యుఁడు, ప్రతతయశస్కుఁడు జనించె వంశకరుండై. ౪౬.

శా. సాధుస్తుత్యచరిత్రుఁ డర్కసమతేజస్కుండు సర్వావనీ
నాథానీకసభాప్రపూజ్యుఁడు జగన్నాథాభిధానార్యుఁ డం
బోధిస్ఫారతరంగరంగదురువిస్ఫూర్జద్వచస్సంగునిం
గాఢా బోధనశాలి వేంకటబుధుం గాంచెం దనూజోత్తమున్. ౪౭.

క౦. ఆవేంకటబుధమణి గనె, ధీవాచాజితబృహస్పతి భుజంగపతి
శ్రీవృతుల రామకృతిఘనుఁ డావేంకటరామశాస్త్రియనునందనులన్. ౪౮.

తే.గీ. అగ్రజుం డొప్పె సకలశాస్త్రార్థవేది, సేతుశీతాచలాంతరఖ్యాతచరితుఁ
డఖిలసర్వంసహాధీశ్వరార్చితుండు, కీర్తిలసితుండు శ్రీరామకృతివరుండు. ౪౯.

తే.గీ. అతఁ డెలమి మైలవరపువంశాబ్ధిచంద్రుఁ, డగుచు విఖ్యాతిఁ గనువేంకటావధాని
పుత్రికామణి ధర్మకళత్రముగను, గొనియె సీతాంబసకల సద్గుణకదంబ. ౫౦.

సీ. మును ధారిణి జనించి జనకాన్వవాయంబుఁ, బరమపవిత్రమై పరఁగఁ జేసి
పిదప శ్రీరామసాధ్వీరత్నమై మించి, యినవంశమున కెల్ల ఘనతఁ దెచ్చి
భర్తతోడను మహావనవర్తన మొనర్చి, సకలదోషాటనాశము ఘటించి
భాస్వత్సుతాదికు ల్భక్తిసంయుక్తులై, పరిచర్య సేయ సంపదలఁ బొదలి

తే.గీ. యారయ యీసతి నామంబు సార్థకముగఁ, దనరె ననుచును జనులచే వినుతిఁ గాంచె
ముఖవినిందితహిమధామ నిఖిలభాగ్య, ధామ సీతాభిధానకాంతాలలామ. ౫౧.

ఉ. భాసురకీర్తియై విబుధవర్గనుతుం డగురామమూర్తి సీ
తాసతిఁ బెండ్లియాడి వసుధ న్విలసిల్లిన కైవడి న్జగ
ద్భాసురకీర్తియై విబుధవర్గనుతుం డగురామశాస్త్రి సీ
తాసతిఁ బెండ్లియాడి వసుధ న్విలసిల్లెను ధర్మశాలియై. ౫౨.

సీ. తనదు రామాహ్వయంబున కనుగతిగాఁగ, సీతాపతికుఁడై చెలఁగె నెవఁడు
తనదు సర్వజ్ఞత్వమున కనుకృతిగాఁగఁ, గామాదివిజయంబుఁ గాంచె నెవఁడు
తనచతురాస్యత్వమునకు సమంబుగా, సరసవాక్సంగతిఁ బరఁగె నెవఁడు
తనదు సూర్యాత్మజత్వమునకు సరిగాఁగ, ధర్మప్రతీతిచేఁ దనరె నెవ్వఁ
తే.గీ. డతఁడు నుతిఁజెందె జగతియందలరెఁ గీర్తి, ఘనమహీపతి జగపతి గజపతీంద్ర
వరసభాస్థానపాండిత్యపదనిరూఢి, భాసురుండైన రామభూమీసురుండు. ౫౩.

చం. నిజపదమూలవత్తికృతి నిత్యకృతోత్తమతారకాఖ్యమం
త్రజపములం బ్రతుష్టుఁ డగు రామునిచే వర మాతఁ డాత్మనం
శజులకునై కొనెన్నిగమశాస్త్రపురాణరహస్యతత్త్వవి
త్త్వజనక మాతదంఘ్రియుగభక్తివిశేషము శాశ్వతంబుగాన్. ౫౪.

చం. అతనికిఁ బూసపాటికులజాగ్రణియౌం గవితారసజ్ఞుఁడుం
బ్రతతయశుండు నా విజయరామనృపాలవరుండు గౌరవాం
చితమతి రాజధానిదరిసీమ నొసంగెను సర్వసస్యశా
శ్వతఫలసారి మాలెలగవాఁడసమాఖ్యమహాగ్రహారమున్. ౫౫

కం. అతని సోదరుఁ డగుచు మహీతలమున వెలసె లసదహీనవచోవి
ఖ్యాతుఁడు వేంకటరామసు, తిలకము సర్వదేశదివ్యద్యశుఁడై. ౫౬.

తరల. జనకజాధిపపాదపంకజషట్పదాయితమానసుం
డనుపమానకళాధురంధరుఁ డర్కసన్నిభతేజుఁడున్
ఘనుఁడు వేంకటరామసూరి విఖండితాంతరవైరియై
వినుతిఁజెందెను లోకమందు నవీనపాండితి దండినాన్. ౫౭.

కం. అతఁడు మృదుసంగీత ఖ్యాతిని సాహితికళాచకాచకి సకల
జ్ఞాతలనేతలచేత న్వహా తగుగౌరవముఁ గను సభాంగణములలోన్. ౫౮.

ఆ.వె. అతఁడు సుకృతినిగఘుఁ డతివగాఁ గొనెఁ గోట
మర్తిహనుమదార్యమణికుమారి
సత్యసుమతిని రఘుపత్యంబ యనుపేరఁ
దగువధూటి సకలసుగుణపేటి. ౫౯.

కం. వారితనయుఁ డలరారెన, వారితనయుఁ డాత్మన్యవతిం బార్శ్వగనానా
సూరిహితకారి బ్రహ్మన, సూరి దశాస్యారి భక్తిసువ్యక్తమతిన్. ౬౦.

చం. నవగపథవ్యకావ్యరచనారుచిరప్రచురస్ఫురద్వచో
నిచయుని రామనామ జపనిర్మలధర్మలసత్ప్రవర్తనా
ర్జవలసమానమానసుని రావు మహీపతి రాయ భూపతి
ప్రవరగురుత్వభాసురుని బ్రహ్మనభూసురు నెన్న శక్యమే. ౬౧.

కం. బాపన దీనజనార్తిం, బాప నరాధీశు కడఁ గృపామతి నెసఁగుం
గోపనయేతరగతులకుఁ, గోపనఁ దగువారి నెడపి గురుభావమునన్. ౬౨.

కం. తారావళిఁగృతిఁగొని యాత్మారమణుం డతని కొసఁగె మాన్యక్షేత్రం
బారూఢి భక్తి మదిఁ జెలు,వారఁ బగర్తీనుపాలెమను గ్రామమునన్. ౬౩.

తే.గీ. అతని జ్యేష్ఠపితృవ్యుఁ డైనట్టిరామ
సూరి దత్పతి సీతాంబ సుతులఁ గోరి
రామచంద్రాంఘ్రిపూజనవ్రతనిరూఢిఁ,
బెంపుఁగనుచుండి తత్కృపావిలసనమున, ౬౪.

తే.గీ. తనయు వేంకటకృష్ణాఖ్యుఁ గనిరి పిదప
రామసూరియు నఖిలగార్హస్థ్యసుఖము
గని తురీయాశ్రమంబున ఘనతఁ గాంచి
పరఁగె ధారిణి శ్రీశివస్వామి యనఁగ. ౬౫.

కం. తత్పుత్రుఁడు సర్వమహీ,భృత్పూజితపదుఁడు సదయహృదయుండు గళా
విత్పతి రఘుపతిసేవా,తత్పరమతి కృష్ణకృతి నుతస్థితిఁ దనరెన్. ౬౬.

శా. జోహారుల్గదియింతు రాతనికి శిష్యుల్దేశదేశాగతుల్
సాహిత్యోన్నతి శాస్త్రపద్ధతినిఁ బ్రజ్ఞాశాలులై ఘట్టసం
దేహాపేతమనస్కులై భువిఁ బ్రసిద్ధిం జెంది విద్వాంసులై
యాహా వేంకటకృష్ణశాస్త్రిమణివిద్యాప్రౌఢి సామాన్యమే. ౬౭.

గీ. అతఁ డప్పలపురుషోత్తమాభిధప్ర
సిద్ధకార్తాంతికావళీశేఖరునకు

గొనబు గారాపుఁగూఁతురై • కొమరు మిగులు
దాని వేంకటలక్ష్మి నుద్వాహ మయ్యె. ౬౮.

మ. కృపకుం జోటు సుమంగళీత్వమునకుం • గేహంబు సుగర్వస్ఛనా
నిపుణత్వంబున కాటపట్టు సుగుణానీకంబు శోభిల్లు చో
క్కపుఁ బద్యంబు పతివ్రతాత్వమునకుం • గాణాచి వీక్షింప ను
ర్వి నయి వేంకటలక్ష్మి శోడశపురంధ్రీలోకచూడామణిన్. ౬౯.

మ. జననం బందిరి నారి కాద్యులు తనూజన్మల్ త్రిమూర్తుల్ వరే
ణ్యవిద్యానిధి రామశాస్త్రియును లోకఖ్యాతశాస్త్రప్రవ
ర్ధనుఁ డౌ వేంకటరామశాస్త్రియును సీతారామనైకన
ర్తనసంలబ్ధకళావిశేషుఁ డగుసీతారామ విద్వాంసుఁడున్. ౭౦.

కం. ఆముగ్వురిలో నగ్రజుఁ, డా[illegible]మాకీర్తి
స్తోమవిశదీకృతాఖిలభూమండలుఁ డగుచు రామబుధవరుఁ డలరెన్. ౭౧

సీ. రచియించె నెవ్వాఁడు • రమ్యచంపూప్రబంధము రామచంద్రోదయ మనుదాని
ఘటియించె నెవ్వాఁడు • కనదలంకారశాస్త్రము వరసాహితీదర్పణంబు
వచియించె నెవ్వాఁడు • బాలభాగవతాఖ్యఁ దనరారు మృదుకావ్యమునకు వ్యాఖ్య
నొనరించె నెవ్వాఁడు • ఘనతరధ్వనిభావ, నవరసంబులఁ బెక్కు • నాటకములు
తే.గీ. నాతని నుతింపఁ దరమె రాజాధిరాజ రావు వేంకటనీలాద్రిరాయలబ్ధ
పరసతరసాహితీసారచక్రవర్తి, బిరుదపరికరుఁ డలరామవిబుధవరుఁడు

కం. అతనికి వేరొకనామము, పతిపేరని సీతమాంబ • పలుకమిచే నం
చితమగు ముద్దులపేరై, క్షితి బుచ్చయశాస్త్రి నాఁగఁ • జెలఁగుచు నుండెన్. ౭౩.

మ. ఘనుఁ డా బుచ్చయశాస్త్రి ధర్మగృహిణిం గాఁ గైకొనెం బ్రీతి ను
ర్వ్యని విద్యానిలయంబనాఁ దనరు సంపూర్ణాల లక్ష్మీనృసిం
హునిపుత్రి న్నరసాంబ వక్త్రతులనా • ప్రోద్యన్నిశానాథబిం
బను సత్కీర్తికదంబ బింబఫలసంబంధార్హదంతాంబరన్. ౭౪.

సీ. అఖిలదేశికసమూహరథాంగనిత్యభాస్వరసూర్యమండలి • నరసమాంబ
నిఖిలదీనవ్రజానీకచాతకచయావిరతకాదంబిని • నరసమాంబ

సర్వబాంధవపిక•జాలసాంతత్యకాం,తవసంతవేళ యా•నరసమాంబ
సకలయాచకచకో•రకనిరంతరవిభా,స్వరచంద్రరేఖ యా•నరసమాంబ
తే.గీ. నాథసేవావలంబ యా•నరసమాంబ, పరమసుగుణకదంబ యా•నరసమాంబ
నయనియుక్తకుటుంబ యా•నరసమాంబ, నరసమాజస్తవాలంబ•నరసమాంబ.

కం. ఆబుచ్చయశాస్త్రికి సుతు,లై బహుశాస్త్రాగమజ్ఞు•లై వేంకట భూ
మీబుధుఁడుఁ గృష్ణశాస్త్రి యు, నాఁ బొడమిరి మువురు లక్ష్మ•ణమనీషియు నాఁగన్.

కం. ఆమువ్వురిలో నవరజుఁ,డై మెఱసెను లక్ష్మణార్యుఁ•డవనీతనయా
స్వామిపదాబ్జయుగధ్యా,నామలమతిజగతిఁ బ్రశు•తామితయశుఁడై. ౭౭.

వ. అందగ్రజుండు. ౭౮.

ఉ. వేంకటరాయశాస్త్రి పృథి•వీతలయాహృదయాధినాథప
త్పంకరుహద్వయాపచితి•వైభవజాతసమగ్రసాహితీ
సంకలితప్రగల్భసువ•చస్కుఁ మనోజ్ఞయశస్కుఁ రూపమీ
నాంకు విఘాతశంకుఁ దర•మా నుతియింపఁగ నేర కేనియున్. ౭౯.

ఆ.వె. వినుతిసుగుణశాలి • వేంకటరాయార్య, పాళి మాళిహాళి • నాలిగాఁగఁ
బేర్మిచే వరించె • విశ్రాలకృష్ణార్య, సుతను దిమ్మమాఖ్యఁ • దతిసమాఖ్య. ౮౦.

చం. అతఁ సహోదరుం డలరె • నామలయాద్రిహిమాచలాంతర
క్షితితలవర్తి శేషనృప•శేఖరభవ్యసభాంతరాళసం
స్థితపరవిద్వదోఘకరి•సింహము వేంకటకృష్ణసూరి స
న్నుతగుణహారి శిష్యజన•తోషణకారి యశోనుసారియై. ౮౧.

కం. ఆవేంకటకృష్ణాఖ్యో,ర్వీవిబుధుఁడు పతిసమాఖ్య•వేంకటలక్ష్మీ
దేవి వచింపమిఁ దమ్మన, కోవిదుఁ డను వేరు పేరఁ • గొమరొందె భువిన్. ౮౨.

సీ. సంతతాంతేవాసి•చింతితవిద్యాస,మృద్ధిక్రియాహయ•గ్రీవమూర్తి
దినదినశ్రీరామ•దేవసేవాధీనం,చితమనస్స్ఫురణాంజ•నేయమూర్తి
నిత్యసూనృతభాష•ణాత్యంతతాత్పర్య,సాంద్రవర్తనహరి•శ్చంద్రమూర్తి
సతతదీనావన•వ్రతమహాకారుణ్య, విభవసంపూర్ణతా•విష్ణుమూర్తి
తే.గీ. వఱలె హరిదంతకరిదంత•వలయకాంత, మహితకలధౌతకటరాయ•మానకీర్తి
నయగుణస్ఫూర్తి తమ్మన•నామధేయ, సకలపండితమండలీ•చక్రవర్తి. ౮౩.

కం॥ చెన్నలరుబుద్ధి గురు మిం, చెన్నలరుచి నెంచె రూపు • సిరి హే లని త
మ్మన్న నల విబుధు లెల్లను, మన్ననలను మెచ్చి నిచ్చ • నానిచెద రెలమిన్. ౧౪.

చం॥ ఘనుఁ డశిం డింద్రకంటికుల • కంధిసుధాకరుఁ డైనకొండయా
ఖ్యునకును బాపనమ్మకును • గూర్మికుమారిక యైనబుచ్చమా
ఖ్యను హరిదంతదంతురిత • కాంతసుధాకరకాంతసత్సమా
ఖ్యను వరియించెఁ బంచశర • ఘస్మరుఁ డద్రికుమారి కైనశిన్. ౧౫.

సీ॥ స్ఫూర్జితక్షాంతివి • స్ఫూర్తిచే సర్వంసహాదేవితోడ సా • మ్యము వహించుఁ
బరమపాతివ్రత్య • గరిమచేత నరుంధతీసతితోడ బాం • దిరి వహించు
బహుభోగభాగ్యసం • పదచేత నిందిరాసుందరీమణితోడ • జోకగాంచు
ఘనతరసౌభాగ్య • కలనచే భూమిభృత్పతికుమారికతోడ • జత వహించు
తే గీ॥ నహహ యాసాధ్వి కెనయైన • యట్టిదాని, నెందులను గాంచమని యెన్న • నెసఁగె నవని
నసమనుగుణకదంబ కృ • పావలంబ, పూర్ణతరసత్కుటుంబ శ్రీ • బుచ్చమాంబ.

కం॥ సుతు లాదంపతుల కయా, న్వితులై బుచ్చయ్యశాస్త్రి • వేంకటరామ
క్షితిసురవర్యుఁడుఁ బొడమిరి, మతిమంతులు కీర్తిపూర్తి • మగ్నదిగంతుల్. ౧౭.

కం॥ హరిరువురలో జ్యేష్ఠుఁడు, శ్రీరామసమర్చనాగ • రిష్ఠుఁడు సుగుణ
వారశ్రేష్ఠుఁడు బుచ్చయ, సూరివరిష్ఠుండు దనరె • సుస్థిరకీర్తిన్. ౧౮.

సీ॥ ఏయార్యవర్యుండు • గాయత్రితోఁ గూడ, నధ్యయన మొనర్చె • నాగమములు
నేపండితుఁడు పది • యేండ్లయీడుననువ, క్కాణించె నలపంచ • కావ్యములను
నేసూరి పదియారెం • డేండ్లవాఁడై కనె, నాటకాలంకార • పాటవంబు
నేకోవిదుండు పదా • రేండ్లప్రాయమ్మునఁ, జదివె శబ్దన్యాయ • శాస్త్రయుగము.
తే గీ॥ నేవిచక్షణమణి పూర్ణ • యౌవనమున
నాంధ్రభాషామహారహ • స్యంబు నెఱిఁగె
నతని వినుతింపఁ దరమె ది • గంతకాంత
పద్యశస్సాంద్రు బుచ్చయ • శాస్త్రిచంద్రు. ౧౯.

ఉ॥ నిచ్చలు రామనామజప • నిష్ఠ సమాశ్రితశిష్యకోటికి
హెచ్చుగ విద్యలం గఱపు • నేరుపుల స్గురువృద్ధసేవల

స్వచ్ఛరితప్రభూతసుయ•శంబుల నెల్లధరాతలంబున
న్వ్యచ్ఛయశాస్త్రి సాటి యగు•పూరుషు లెందు రె యెందు రందఱున్. ౯౦.

మ. ప్రకటగ్రంథవిదుండు బుచ్చయసుధీం•ద్రశ్రేష్ఠుఁ డావింజమూ
రికులేంద్రుం డగు వేంకటేశబుధపు•త్రీరత్న మా సుబ్బమన్
సకలస్త్రీజనతాశిరోమణి సమం•చన్మంజువాగ్ధోరణి
న్వికచాంభోజదళాక్షిఁ బత్నిఁగ మహా•ప్రేమంబుచేఁ గైకొనెన్. ౯౧.

చం. అతని సహోదరుండు తన•రారె నిరంతరరామనామసం
స్మృతిపరిపూతచిత్తుఁడయి • మేదిని వేంకటరామశాస్త్రి య
ప్రతిమవిహాయితప్రచుర•రావుకులేశ్వర రామరాణ్మహీ
పతి కరుణాకటాక్షసము•పాత్తబహూకృతియై కృతీశుఁడై. ౯౨.

కం. ఆ వేంకటరామార్యుఁడు, శ్రీవంగలవంశవరన్ను•సింహాహ్వయసం
ఖ్యావన్మణిసుత లక్ష్మీదేవి న్వరియించెఁ గులవ•తీమణి గాఁగన్. ౯౩.

ఆ. సత్సతీసమాజ•సంశ్లాఘ్యమానపా,వనపతివ్రతాత్వ•భాసమాన
యగుచు గణుతిఁ గాంచె • జగతి లక్ష్మిదేవి, సాటి బోటు లెల్ల•మేటి యనఁగ. ౯౪.

కం. ధరణీకుమారికావర,కరుణాస్ఫురణాభివృద్ధ•కాంక్షితుఁ డాయి
ర్వ్యరకుఁ దనూభవుండై, ధర శంకరరామశాస్త్రి•తనరారె నెుగిన్. ౯౫.

కం. అతఁ డతివఁ వరియించె, న్వ్రతత శ్రీవింజమూరి • వేంకట రామ
క్షితిసురవర్యుని కూరిమి, సుత వేంకటరమణమాంబ • సుగుణకదంబన్. ౯౬.

కం. అతనికి వేంకట రామయ, సుతుఁ డెసఁగుచునున్నవాఁడు•సుగుణాన్వితుఁడై
క్షితిజాధినాథకరుణో, న్నత విద్యాయుర్యశోధ•నశ్రీయుతుఁడై. ౯౭.

ఉ. ఆతని తాత తాత యయి • ఖ్యాతివహించినరామశాస్త్రికిం
బ్రీతిఁ దనర్చు తమ్ముఁడయి • వేంకటరామసుధీవరుండు భూ
మీతనయాధినాయకస•మిద్ధకృపాసముపాత్తసవ్వభు
ర్వేతరశాస్త్రకౌశలస•మేతుఁ డనం దనరారె ధారిణిన్. ౯౮.

శా. తర్కవ్యాకరణాదిశాస్త్రములు సిం•ద్ధాంతంబు సందేహసం
పర్కం బించుక రాక యుండ జగతిం • బ్రఖ్యాతి యాతారకేం

ద్వర్కం బైతనరారఁగాఁ దెలిపి శి•ష్యశ్రేణికి న్నిత్యముం
గోర్కె ల్వేంకటరామకోవిదుఁ డొసం•గుం గూర్మి వాటిల్లఁగన్. ౯౯.

మ. అతఁ డార్యాగ్రగణి వింజమూరికులజుం•డై యొప్పు లక్ష్మీశుఁడన్
క్షితిదేవోత్తము కూర్మికూఁతు సుగుణ•శ్రీసంవిధాన న్మహో
యతకీర్తిప్రతిభాసమాన రఘుప•త్యంబాభిదాన న్సమం
చితరాగంబున ధర్మపత్నిగ వరిం•చె న్నారి లక్ష్మీన్వలెన్. ౧౦౦.

మ. అఘవిధ్వంసనహేతుసువ్రతవిధా•నాసక్తి లోకప్రియా
లఘుసత్యోక్తి హరిత్సమూహపరివే•ల్లత్కీర్తియు న్సర్వభూ
తఘృణాస్ఫూర్తి నితాంతశాంతియును ని•త్యక్షాంతియుం జూడ నా
రఘుపత్యంబకుఁగాక యన్యల కిలం • బ్రాపించునే యేరికిన్. ౧౦౧.

కం. తనయుఁడు వారికి సమధిగ్యతనయుఁడు జనియించె రూప•తారుణ్యరమా
తనయుండు కృష్ణవిబుధుం, డనిశముఁ దనయశము దిశల•నసదృశతఁదగన్.

గీ. సరసవిద్యల గురువుల • సరస నేర్చి
నిర్మితిగఁ గావ్యనాటక•నిర్మితిఁ గని
రాజు లర్చింప బహుశిష్య•రాజు బలర
మహితగతిఁ గృష్ణబుధుఁ డొప్పె • మహితలమున. ౧.3.

ఉ. అర్కనిభుండు కృష్ణబుధుఁ • డాతఁడు రాజసభాంతరంబులం
గర్కశతర్కశబ్దము ల•ఖండతగంబుగ వ్యాహరించుచో
శర్కర లట్ల దోఁచు మృదు•సాహితివాక్యము లుచ్చరించుచో
శర్కర లట్ల దోఁచును ర•సజ్ఞగసజ్ఞలచంద మెట్టిదో. ౧౦౪.

ఉ. నిర్జితవైరియూథుఁ డవ•నీసురనాథుఁడు కృష్ణకోవిదుం
డార్జవ మొప్ప భూవరస•భావళి శాస్త్రములం బ్రసంగము
ల్వార్జనురుద్భవాండచయ•భాండవిఖండనలీలఁ జేయుచో
స్ఫూర్జితగర్జితస్ఫురణ•ముం బచరించుచు మించు నెంచఁగన్. ౧౦౫.

కం. కిరణవిభా న్యరుణవిభా,స్ఫురణ దగం గృష్ణశాస్త్రి•భువిఁ దనకు మహీ
వరజనతాదరము వత, స్థిరఘనతాప్రాపణముఁ బ్రసిద్ధి ఘటింపన్. ౧౦౬.

సీ. తనదువ్యాఖ్యాక్రియాదక్షత విశ్వగుణా దర్శకావ్యసంద్వ్యాఖ్య వలుకఁ
దనఘనపాండితీదార్ఢ్యంబు దర్కసారంబు నాఁ దనరుగ్రంథంబు నుడువఁ
దనసరసప్రబంధనిబంధనంబు సాహిత్యసార మనుమహాకృతియె తెలుపఁ
దనసర్వవిద్యాప్రపంచానైకతానత, శిష్యప్రశిష్యగోష్ఠియె వచింప
తే.గీ. నలరె శ్రీరామచంద్రపాదారవింద.యుగళసంసేవనప్రాప్తనిగమశాస్త్ర
సారసారస్యసరణిప్రశస్తమధుర,మృదువచనపాళి కృష్ణశాస్త్రిం దమాళి. ౧౦౭

గీ. పృథులగుణశాలితయును సంద్వృత్తతయును విమలకాంతి యుఁ గనఁ దనరు న్వసురాగ్ర
గణ్యుఁ డగుకృష్ణశాస్త్రి వినుత్యుఁ గాంచె, లలితకులవంశముక్తాఫలంబనంగ. ౧౦౮

మ. త్రితయిన్యాస్థిజప్రతోషణహయగ్రీవుండు కృష్ణార్యుఁ డా
యుక్తిరిస్థిక విల్మకన్నికుఁ జెండౌ సూర్యనారాయణా
క్షితిదేవోత్తము పుత్రి సన్నుతగుణశ్రేణి న్మహాలక్ష్మి నం
తతమోదంబు మంబునందుఁ బొలుపొందం బత్నిఁగాఁ గైకొనెన్. ౧౦౯

సీ. కాంతపాదాంబుజాక్రాంతసంసర్గసం,క్రాంతభృంగాయితస్వాంత యగుచు
సంతతగురుజనసంతోషసంధాయి,శాంతతాదిగుణనిశాంత యగుచు
సంతానభూజలతాంతకాంతిస్ఫుటా,నంతకీర్త్యుజ్జ్వలాశాంత యగుచు
స్త్రాంతరాఖిలసతీసంతతిప్రతిదినా,త్యంతసమ్మానితోదంత యగుచు
గీ. మఱి కృతాసేతుకాశికామధ్యసంస్థ,సకలపుణ్యనదీక్షేత్రనికరయాత్ర
యుభయగోత్రపవిత్రశ్రీశుభచరిత్ర, యైమహాలక్ష్మితనరారె నారగోత్ర. ౧౧౦

శా. స్త్రీనానాఖిలభామినీజనవతంసం బౌమహాలక్ష్మియం
దావిద్వజ్జనతాశిరోమణి సముద్యద్భాగ్యసౌభాగ్యస
ద్ధీవైశద్యముచేత హృద్య మగుపుత్రీయుగ్మముం గాంచి తా
నావారాణసి మేను వాసి కనె నిత్యానందమాస్థానమున్. ౧౧౧

సీ. శ్రీదగు నక్కమాంబిద్వయి జ్యాయసి, యై పురంధ్రీరత్నమగుచుఁ దనరు
చున్నలక్ష్మీదేవి నన్నగాధీశ్వర,కన్యకఁ జంద్రశేఖరుని కరణి.
వింజమూరికులాబ్ధివిశదాంశుఁ డైనట్టి, వేంకటరామశోవిదవరేణ్యుఁ
డుద్వాహమై శ్రీరఘూద్వహపాదపం,కజయుగసేవాప్రకర్షలబ్ధ

తే.గీ. బహులసదపత్యభృత్యసం•ప్రాప్య మౌతి
భాగ్యసౌభాగ్యసంపద•వాసి చెందె
వసుధ నాదంపతులె కదా • భవ్యకీర్తిఁ
బ్రథిమగనుచుఁద్రుడు మామక•శ్వశురు లగుచు. ౧౧౨.

కం. భాసిలె నాకృష్ణబుధా,గ్రేసరుని పితృవ్యుఁ డగుచు•శ్రీరామసదా
వాసహృదయాంతరుండై, శ్రీసీతారామశాస్త్రి • చిరతరకీర్తిన్. ౧౧౩.

సీ. సకలలోకఖ్యాత•సకలలోకవ్రాత, నిత్యసంస్తుత్యపాం•డిత్యశక్తి
మిత్రనందనముఖ్య•మిత్రనందనసఖ్య, రామపాదామలో•ద్దామభక్తి
శ్రుత్యంతసమ్మత•శ్రుత్యంతసమ్మిత, సత్యసాంగత్యసం•ప్రత్యయోక్తి
బంధురక్షణకథా•బంధురక్షణవిధా, గణ్యసాద్గుణ్యసై•పుణ్యయుక్తిఁ
తే.గీ. గాంచి మించె నబ్ధి•కాంచిమధ్యస్థనా,నాథతాతలాధి•నాథలబ్ధ
రాజితస్వమాన్య•రాజి సీతారామ,బుధవరుండు ధీవి•బుధగురుండు. ౧౧౪.

శా. శాంతిం జూచిన మూర్తియే శుచిత నెం•చ స్రూపమే జానకీ
కాంతాంఘ్రిద్వయభక్తినారయఁగ నా•కారంబె యశ్రాంతహృ
త్సంతోషం బరయంగ విగ్రహమె సీ•తారామవిద్వద్వరో
దంతం బెంతని యెంతు మూర్విఁ గలరే • తత్తుల్యు లౌపండితుల్. ౧౧౫.

శా. సీతారామసుధీవరుం డతఁడు వా•సిన్ భాసిలెం బాండితి
న్నీతిప్రౌఢిఁ బరోపకారనిరతి•న్నీలాద్రిరాయాధిపుం
బ్రీతుం జేయుచుఁ దత్కుమారమణియౌ•శ్రీసూర్యరాయక్షమా
నేతన్ రంజిలఁ జేయుచు న్సరసవా•ణీధోరణిన్ ధారణిన్. ౧౧౬.

కం. కొలచెలనకొండనాఖ్యో,జ్జ్వలబుధసుత సుబ్బమాఖ్య•సహధర్మిణిగా
నలసీతారామార్యుం, డలసీతారామ రాయు • నట్లవరించెన్. ౧౧౭.

సీ. ఏపురంధ్రిమనంబు • గాఁపురంబుగ నుండు, నేపుగఁ బతియంఘ్రి•దాపునందు
నేసతిసౌభాగ్య • మాసతితో సాటి,యై సరిలేనివి•శాన మూను
నేభామసౌందర్య•శోభావిశేషంబు,శ్రీభామినీజకాం•తాభఁబూను
నేవధూటిశమం బి•లావధూసదృశమై, ధీవరేణ్యస్తవ•శ్రీ వహించు

తే.గీ. నట్టి కల్యాణి మృదువాణి • నసితవేణిఁ
గులయుగపవిత్ర సుచరిత్ర • జలజనేత్ర
సుతనుగణముఖ్య సుసమాఖ్య • సుబ్బమాఖ్య
వినుతిఁ జేయంగఁ దరమె శేషునకు నైన. ౧౧౮.

ఉ. ఆమహనీయదంపతుల • కాత్మజుఁడై పొగడొందె భవ్యతే
జోమిహిరుండు సుందరశ•రుందరుఁ డూర్జితబుద్ధిశాలి వి
ద్యామహితుండు మేరుధర•ధైర్యుఁడు వేంకటకృష్ణశాస్త్రి ల
క్ష్మీమహిళాబ్జనాభులకు • జిల్కుహుమాయివజీరు తీరునన్. ౧౧౯.

సీ. తనముఖాంభోజాత•మున కంబుజాతాన,నాంగనామణి రాజ•హంసి గాఁగఁ
దనమనస్సారసం•బునకు రాఘవరామ,భద్రుండు మత్తష•ట్పదము గాఁగఁ
దనకీర్తియోషి దా•ననసీమకు నభంబు, కస్తూరికాచిత్ర•కంబు గాఁగఁ
దనయాతిథేయతా•ఘనసమాగమవేళ, కతిథిజాలము బర్హి•వితతి గాఁగఁ
తే.గీ. బరిఢవిల్లెను సేవ్యుల•పల్లివంశ,కలశజలనిధియామినీ•కాంతుఁ డఖిల
భూతలేశ్వరనికాయ•పూజ్యుఁ డగుచుఁ, బృథులగుణహారి వేంకట•కృష్ణసూరి.

గీ. క్షితివినుతి గాంచె వేంకట•కృష్ణసూరి, శ్రీమహారాజపదరావు•రామరాయ
రాజమౌళికిఁ దారక•బ్రహ్మమంత్రి, సిద్ధతత్త్వోపదేశదే•శికతఁ బూని. ౧౨౧.

కం. ఆవేంకటకృష్ణార్యుఁడు, భావుకజనమంచివంశ•వారిధిలక్ష్మీ
దేవి యగు వేంకమాంబను, బావనతరగుణకదంబఁ • బరిణయ మయ్యెన్. ౧౨౨.

శా. పాతివ్రత్యముచే నరుంధతిని సౌ•భాగ్యంబుచే గౌరి వి
ఖ్యాతస్ఫీతశమంబుచేత ధరణిం • గల్యాణసంపత్తిచే
శ్రీత న్వామణిఁబోల్పఁ గాఁదగు ననం • జెల్వొందు సాధ్వీజన
వ్రాతోత్తంసము వేంకమాంబ వినుతిం•పన్శక్యమే యేరికిన్. ౧౨౩.

సీ. అనఘాత్ముఁ డైనట్టి•జనమంచికృష్ణాఖ్య, ధరణీసురేంద్రుండు • తండ్రి గాఁగ
సాధ్వీలలామయై • జగతిపైఁ దనరిన, గౌరమ్మ దల్లియై• గరిమ మీఱ
సుజనావతంసమై • సాబ గొందుచున్నర,త్నాకరార్యుఁడు దమ్ముఁ•డై తలిర్ప
నీహారశిఖరి తం•డ్రిగ మేనకాసతి, జననిగా మైనాకుఁ • దనుజుఁడు గను

తే.గీ. శివి నెసఁగెను పార్వతీదేవి యనఁగఁ, దేజరిల్లిన సత్పురంధ్రీమతల్లి
తతయశఃకల్పవల్లి మాతల్లి యైన, వేంకమాంబను వినుతింతు విపులభక్తి. ౧౨౪.

ఉ. ఇజ్జగమందు నెచ్చటయు నిట్టిసతీమణిఁ గాన మంచు వి
ద్వజ్జనము ల్నుతింప సతతంబుఁ జెలంగుచు భవ్యకీర్తిసం
పజ్జితకల్పవల్లియయి మాన్యతఁ గాంచిన వేంకమాంబ న
న్సజ్జనని న్నుతింపఁ దరమా ధర మాదృశు లైనవారికిన్. ౧౨౫.

కం. ఆదంపతులు తనూజుల, నాదశరథనృపతనూభవాంఘ్రిసపర్యా
సాదితసకలకలాస, మ్మోదితలోకులను గనిరి ముప్వుర మమ్మున్. ౧౨౬.

కం. భాసిల్లె మాకు నగ్రజుఁ, డైసీతారామశాస్త్రి యనఘుం డనిశ
శ్రీసీతారామధ్యా, నాసక్తిపవిత్రమానసాంతరుఁ డగుచున్. ౧౨౭.

గీ. వింజమూరికులపవిత్ర సీతారామ, యార్యునకును రాజమాంబికకును
సుతను సుబ్బమాఖ్యసతిగ సీతారామ, విబుధమణివరించి వినుతిగాంచె. ౧౨౮.

గీ. అమహితురాలు సుహిమజావ్నానిని బోలుఁ
బున్నియంబులబారు నోములకొతాను
సతులకును మేటి కరుణాసంపుఁ జేటి
సుగుణనికురుంబ దనరారె సుబ్బమాంబ. ౧౨౯.

కం. వరగుణుఁడు చిరంజీవిగఁ, బరఁగుమనున్నాఁడు రామభక్తుఁడు మత్సో
దరుఁ డన్నిట మత్సముఁడై, ధర వేంకటకృష్ణశాస్త్రి తమ్మన్నయు నాకా. ౧౩౦.

గీ. అకలుషస్వాంతవర్తనుం డగుచు వింజమూరిచినసుబ్బరాయావతారనామ
యుగళివిఖ్యాతి గనిన సూర్యనిసుపుత్రి, ధర్మపత్నిగ నాతఁడు దద్వాహమయ్యె.

కం. కనె నతఁడు సుతుఁ జిరాయువుఁ, జినవేంకటకృష్ణశాస్త్రి శ్రీరామకృపన్
దనరారుచు నున్నాఁడిఁక, దనరఁగలఁడు నాఁ డపత్యధనసంపదలన్. ౧౩౨.

సీ. హితపండితులఁగూడి శతలేఖినీపద్య, నిర్మాణచాతురిఁ బేర్మినరసి
నిజవంశముక్తావళిజనంబువినుతింప, గీర్వాణభాషనుగృతిగ్రహించి
యాశ్చర్యకరవిధానాష్టావధానవి, నోదకేళులఁగడు మోదమంది
యభిమతబహుపురాణార్థగుంభితకుంభ, దానుధారాళిలాలించి

తే.గీ. కల్పితానన్యసామాన్య• గౌరవమునఁ, బ్రేమ రావు గంగాధర• రామరాయ
భూమివరమణి సానుజ• న్ముని గనెపుడు, మించు కృపఁ జూడ విఖ్యాతిఁ• గాంచినాఁడ.

ఉ. సాధుజనావనప్రవణ• శస్తయశస్తవనీయ రావు గం
గాధర రామ రాయ నృప• గౌరవపూర్వకదత్తసింహపీ
ఠీధనరత్నభూషణప• టీప్రకటీకృత కావ్యకల్పనా
సాధనుఁడం దదాత్మభవ• సంస్కృతదేశికతాప్రసిద్ధుఁడన్. ౧౩౪.

కం. శ్రీమద్రఘురామప్రభు, నామస్మృతిపాదపూజ• నవ్రతముఖదీ
క్షామతిఁ జంద్రముపాలె, గ్రామనివాసుండ సుబ్బ• రాయాహ్వయుఁడన్. ౧౩౫.

ఉ. వేలుపు రాఘవుండు వది• వేలపురాణము లన్య్వ నెన్న నీ
యేలిక లెన్న రావుకులు• లెప్పటి పారల కప్పు డొప్పు భూ
పాలి నిజంబుగాఁ దన కం• టంచును దేవులపల్లివంశభూ
పాలిదలంచుచుండుఁ దన• పాలిటి కీయుభయంబె ప్రాపుగన్. ౧౩౬.

## షష్ఠ్యంతములు.

కం. ఏవంవిధమత్కులతుల, దైవతభావానుభావ• దర్శయితృత్వా
ర్థాః షట్కృతావతారమ, హాపిభవాకృతిక సీకృ• తాస్మత్కృతికిన్. ౧౩౭.

కం. మిత్రాన్వవాయమణికి సు, మిత్రాపుత్రానుసృతిస• మేధితవిశ్వా
మిత్రాధ్వరవినుతసురా, మిత్రాగ్రగసంపదనుస• మీరణఘణికిన్. ౧౩౮.

కం. గ్రావాస్యభిమర్శభవో, గ్రానార్యక్రోధగౌత• మాగ్రహయుగ్గ్రా
వాభిహతాహల్యా, గ్రావాకృతిముక్తికరచ• రణరేణునకున్. ౧౩౯.

కం. జపదధిపగాధినృపజ, న్యుపదిష్టవిదేహవల్ల• భోపానీతా
నుపమకపర్దిగనుస్సహ, స్యుపగతిసీతా స్వయం• వరోద్వాహునకున్. ౧౪౦.

కం. సూత్క్షేతరచక్రాదిక, లక్ష్మాంకరుచిరపదా• బ్జలలితాంగునకున్
లక్ష్మణహనుమత్సీతా, పక్ష్మలచక్షుర్న్యస్తాం• తపరిషంగునకున్. ౧౪౧.

కం. భాసురతరభూసురవర, ధీసురుచిరకవనపద్ధ• తిస్తుత్యగుణ
శ్రీసక్త్యభిరామునకును, శ్రీసీతారామునకును• శ్రీరామునకున్. ౧౪౨.

వ. సమర్పణంబుగ నాయొనర్పంబూనిన మహేంద్రవిజయంబునకుం గథాక్రమం
బెట్టి దనిన. ౧౪౩.

చం. కల దిల నైమిశం బనఁ నొకానొకపావన మావనంబు స
ల్లలితఫలావనమ్రబహుళద్రుమపుష్పలతావనోచితా
మలతటినీవనంబు కలమంజులనాదలసత్పికీశుకీ
కులకలహంససంపదనుకూలసమంచితజీవనంబునై. ౧౪౪.

ఉ. కులపతి శౌనకాఖ్యమునికుంజరుఁ డందు జగద్ధితంబుగాఁ
దలఁగనిదీక్షతోఁ జలుపు ద్వాదశవార్షికసత్త్రముం గనం
బలువురుమానిముఖ్యులు సమాగతులై నిజశిష్యకోటితో
నిలిచిరి పెక్కునాళ్లచట నిర్మలకర్మలసత్ప్రసక్తిగాన్. ౧౪౫.

సీ. తరుమూలవేదికోపరిభాగజపవిధా, నాస్తీర్ణహరిణకృష్ణాజినంబు
ద్రుమకోటరన్యస్తసుమసమిత్కుశపరి, గ్రహణప్రసారితకరతలంబు
మృగశృంగసంగతాత్మీయాక్షమాలికో, న్మోచనోన్మీలితలోచనంబు
త్మజశాఖాశోష్యమాణవల్కలసమా, దానసమున్నమితప్రవేష్ట

తే. గీ. మగుచు నచ్చోట నెచ్చోట నరయు సరయ
సముపకల్పితసుహితసవనహవన
నవనవద్రవ్యసంభృతిప్రవణశిష్య
సంకులము దోఁచు సంయమీశ్వరకులంబు. ౧౪౬.

ఉ. వారలు భక్తియుక్తులయి ప్రత్యహముం గృతనిత్యకృత్యులై
శౌరికథార్థము ల్వినుచుఁ జక్రిఁ దలంచుచు శార్ఙ్గపుంగళా
కారము నాత్మనెంచుచును గాలముఁ బుచ్చుచు నుండ్రు సంసృతి
క్షీరధిఁ దాఁట శ్రీరమణసేవలె కేవల నౌక లౌటచేన్. ౧౪౭.

గీ. నిరతశౌనకకథాకర్ణనరతవరత, పోధనశ్రేణి గనిరొ సుబోధనప్ర
తీతుఁ దగురోమహర్షణజాతు గుణప, మేతు నధికప్రభాపూర్ణు సూతు సూతు.

గీ. కాంచి యాదరణాతిరేకాంచితముగ, విహగపతిశైలమహిమంబు వినఁదలంచి.
పలికె నావ్యాసశిష్యునివలన వింటి, మమితదివ్యస్థలీమహిమముల నందు. ౧౪౮.

చం. కలిగెను గాదె యాదట జ•గంబునఁ గల్గునగంబు లెన్ని యో
వలమురిదాల్పువేల్పు నిలు•వం బలువన్నెయు వాసియు న్విరా
జిలఁ జెలువొందు నందలి య•శేషవిశేషము లాలకింపఁగా
నల గరుడాచలస్థలమ•హాత్మ్యకథ న్వినుఁడీ కొంతగాన్. ౧౫౦.

సీ. గోత్రవిఖ్యాతమై • స్తోత్రవాగ్విన్యాస, పాత్రమై పరమప•విత్రతాతి
మాత్రకీలి సరిత్క•ళత్రరోధఃక్రోశ, మాత్రదూరస్థమై•యాత్రనీక
నేత్రపర్వంబుగా • మిత్రశతాంగభృ, త్పథమార్గాంతర్ధి•చిత్రశృంగ
పత్రరథాన్వయ•నేత్రభిఖ్యాకన, గ్గోత్రసన్నిధిజన•స్తోత్రసౌఖ్య
తే.గీ. దాత్రళిసుగీతిపదశత•పత్రమాన, సత్రపాకగబంధుర•గోత్రసరసి
ధ్యాత్రఘముఁ బాపనోపు నో•మిత్రపుణ్య, గాత్ర శ్రీబాదరాయణ•చ్ఛాత్రవర్య.

కం. ఉపమాకలనము గానమి, నుపమాకయనం బ్రసిద్ధి•నొందినయద్ది
వ్యపదంబున హరి యప్పర, మపదంబున నెట్టులటుల • మసలునఁట కదే. ౧౫౨.

ఉ. ఆయుపమాకయందు నిఖి•లాశ్రితకోటి కభీష్టదాయకుం
డై యరవిందమందిర య•హర్నిశముం దరి నిల్వ నల్వయుం
గాయజవైరియుం గొలువఁ•గా నల వేంకటశైలభర్త నా
రాయణుఁ డప్రమేయుఁడు ప•రాత్పరుఁ డేల వసించె లీలతోన్. ౧౫౩.

కం. నిగ్రహము ననుగ్రహము ను, దగ్రముగా నొదవ సదవ•నాప్తత నర్చా
విగ్రహము నిలిపి యచట స, మగ్రముగఁ గలి నడించె•నఁట యటఁ గరుణన్.

కం. ఏలా యచ్చోటను గరు, డేలా భృన్మౌళి వొందమెం• నేలా తన్మూ
ర్ధాళిందమునందుఁ గమలము, మాళిమిళిందమున ముదిత•మతి హరి నిలచెన్. ౧౫౫.

కం. మానవలీలలతో నస, మానవరాభోగభోగ•మతిఁ గలి నేఁచం
దానవరపుఁ డం దేచం దాన వసించెను వచింపఁ•దగు సుగుణనిధీ. ౧౫౬.

కం. బంధుర మనుకొలను జగ, ద్బంధురజనిరమణనయనుఁ • బాటితభవదు
ర్బంధురమావిభు నంబుజ, బంధురమై తనుప నెటుల • భాసిలె నచటన్. ౧౫౭.

శా. ఆచార్యాగ్రణి యైనవ్యాసుని దరిన్ • స్వాంతైకసంతుష్టిమై
నీచారిత్రము లెల్లఁ దెల్లముగ నీ•వేరీతి నాలించితో

మాచిత్తంబులకు న్ముదంబు నిడవే ◆ మాధుర్యమాధుర్యమా
వాచాచాతురిచేత నాతతగతిన్ ◆ వా్రకుచ్చి యారీతిగాన్. ౧౫౮.

చం. అనవుడుఁ బక్కి వల్కులుల ◆ నారసి యారశిరఃపరిస్ఫుర
ద్ఘనఘనజాలమై దృఢసు ◆ ధాధవళాజిరచంద్రశాలమై
యనుతటధాతురాగపట ◆ లారుణితాఖిలసాలమై జనా
ర్దననివహించుతార్క్ష్యగతిఁ ◆ దన్నగ మెన్నఁగ మించు నంచొగిన్. ౧౫౯.

చం. వెరవునఁ బక్షిరాజు దన ◆ వెన్నున వెన్నునిఁ బూని విన్నునం
గరమును వింత యైననడ ◆ కల్పచరించుచు మున్ను పౌరులన్
హరికి హాయంబు గింకరుఁడు ◆ నై కొలువం గెలు పొంది తృప్తుఁడై
పరమకృపాప్తిచేత నొక ◆ పట్టున నానతి యిచ్చె నీగతిన్. ౧౬౦.

తే.గీ. ఓవిహగవర్య నీసేయు ◆ నూడిగముల, కెంతయును సంతసించితి ◆ మేమివరము
గావలయుఁగోరికొనుమన్న ◆ ఖగవరుండు, విన్నపమొనర్చె నీగతి ◆ వెన్ను నకును.

సీ. దేవదేవర లప ◆ ద్దివ్యమంగళవపుః ◆ స్స్పర్శనంబున నను ◆ బావనునిఁగఁ
జేయుతలంపుతో ◆ సేవకావళిలోనఁ, గారుణ్యపాత్రత ◆ గానిపింపఁ
బక్షపల్యాణంబు ◆ పైఁబదంబులఁజాఁచి, యనువుగ మూఁపునం ◆ దధివసించి
మన్మూర్తితేజిభ ◆ వన్మూర్తిసాదిగా, వాహ్యాళులందరి ◆ ప్రథనకేళు

తే.గీ. లందువిడువని పగిది నెల్లప్పుడునాదు, వీఁపున వసించుటయె నా ◆ యభీష్టమనిన
నీవు శైలాకృతివహింపు ◆ మేను మేను, వర్ప్యమొనరింతునని మేనుఁ ◆ డానతిడిన.

కం. భగవల్లసదనుకంపన్, జగమెల్ల భజింపఁ దగిన ◆ సంపద చెలఁగన్
ఖగవల్లభుఁ డగతల్లజ, ముగ వల్లనమూర్తి నిలిపె ◆ భువినబ్ధిదరిన్. ౧౬౩.

చం. అరయఁ గృతంబునందుఁ గన ◆ కాకృతి రాజిలు రాజతంబుగాఁ
బరఁగును త్రేతయందు వల ◆ ద్వాపరమందునఁ దామ్రమూర్తిసుం
దరమగు రూప మాపలము ◆ దాల్చి కలిం జెలు వొందుచుండు నీ
గరుడధరాధరంబు ద్విజ ◆ గన్నుతపావన భావభవ్యమై. ౧౬౪.

సీ. ఆవీటిచిఱుదాన ◆ రయ్యాలనెయ్యంబు, గోరుచుందురు నిత్య ◆ సూరివర్యు
లావీటిచటకాదు ◆ లైనపత్తులతోడ, వియ్యమందఁగఁ గోరు ◆ విహగభర్త

యావీటికుల్యాపయఃపూరములదాస్య,వృత్తిఁ గొల్వఁగఁ గోరు విరజవారి
యావీటిచిదుపత్తాలైన నాత్మాచార్య, బుద్ధి సాలగ్రామములు దలంచు

తే.గీ. మఱియు నావీటిపాలముగుల్మములఁ దమకుఁ
గొలముసాములగా నెంచుఁ గులసివనము
లహహా యావీటినిత్యకల్యాణమహిమ
పరమపదమందు వెలె నందు వారి వసింప. ౧౬౫.

ఉ. స్వామిరథోత్సవంబుఁ గనవచ్చినదివ్యులు వేల్పుటేటిపాం
దామరపాకుపొట్లముల దాఁచినకల్పతరూపదంశముల్
వేమఱు నంజికొంచు చట వేళ భుజింతురు సారసారభే
యామథితంబుతోడఁ దగఁ దృప్తి సుధామలశీతలాన్నముల్. ౧౬౬.

కం. విధియైనను బహువర్షా,వధియైన నశక్తుఁ డనుచుఁ బలుకం బడ నే
విధి నేరుతు శ్రేయస్సే, వధి నే నుపమాకమహిమ వర్ణించుటకున్. ౧౬౭.

కం. ఐనను మద్గురుచరణ,ధ్యానముఁ గావించి మీదుదయ గలిగినచో
నానేర్చుపగిదిఁ దెలిపెద, దీనియతి వినుండు మౌని తిలకములారా. ౧౬౮.

సీ. మును ప్రపంచము సర్వమును సర్వకారణ,మును సర్వశక్తికమును బ్రధాన
మును నైనవ్యక్తియందున లీనమైన యా,ప్రకృతి విశ్వాత్ముని భావమందు
డిందె నప్పుడు మహానందంబులోఁ బరా,త్పరుఁ డైనయట్టి శ్రీవాసుదేవుఁ
డొకఁడ యిందిరతోడ నుల్లసిల్లుచు నుండె, నమితయుగంబు లానంత దనుక

తే.గీ. నంతట జగత్సిసృక్షని జాత్ముఁ డగుచు, నాహరి సృజించె హైమకటాహమొకటి
యందు నేకార్ణవోదకమందు నైక,వర్షములఁ దాను గ్రీడించె బాలులీల. ౧౬౯.

ఆశ్వాసాంతము.

కం. పారావారగభీరా, ధీరాహిత్యప్రచారవిజయాధారా
ధారాళకృపాసారా, సారామలవర్ణనీయసద్వ్యాపారా. ౧౭౦.

శా. బ్రహ్మాదిస్తుతభవ్యదివ్యమహిమప్రాగ్భారపాదద్వయా
జిహ్మైణాకృతితాటకేయహననక్షీణక్రియా పంతతా

బ్రహ్మణ్యోక్తిమహర్షిహర్షఘటనా • రంభప్రియా తారక
బ్రహ్మోంకారనిజావతారశుభసం • పర్కాంకితార్కాన్వయా. ౧౩౧.

మాలిని. అగణితగుణధుర్యా • హర్యనీకాత్తకార్యా
జగదభినుతచర్యా • జాగ్రదత్యుగ్రశౌర్యా
నగపరివృఢధైర్యా • నామసంప్రీణితార్యా
నగరకులజవర్యా • సమ్యగానందితార్యా. ౧౩౨.

## గద్యము.

ఇది శ్రీమద్రామనామపారాయణ పరాయణాతిధన్య కౌండిన్యగోత్ర
పవిత్ర దేవులపల్లికులపయఃపయోనిధిః శానిధిసీతారామశాస్త్రి పౌత్ర,
వేంకట కృష్ణశాస్త్రి పుత్ర, తమ్మనాభిధానాంతర వేంకటకృష్ణ
శాస్త్రి నామాగ్రజన్మ, త్రిలింగదేశాగ్రజన్మ సుధీ
విధేయ సుబ్బరాయ శాస్త్రి నామధేయప్రణీతం
బైన మహేంద్రవిజయంబను ప్రబంధంబు
నందుఁ ప్రథమాశ్వాసము.

శ్రీ సీతారామార్పణమస్తు.



శ్రీరస్తు.

# శ్రీమహేంద్రవిజయము.

---

## ద్వితీయాశ్వాసము.

---



పద్మబాంధవాన్వయ
దీపక గోపకజనముఖ్య దివిషత్పరిష
త్పాపక భూపకలాపక
లాపక ధృతచాపశరకలాపక రామా. ౧.

గీ. అవసరింపుము శౌనకాద్యఖిలమాని, జనులఁ దిలకించి రోమహర్షణసుతుఁడు
స్పష్టవాక్పుష్టి నుత్తావశిష్టకథను, వక్ష్యమాణవిధంబుగఁ బలుకఁ దొడఁగె. ౨.

కం. ఈయులుండఁగఁ దన్నాభీ,పుటమందు ఘటిల్లినట్టి పొందామరఁ ద
త్ప్రాయుసంకల్పమునన యొక్కట నలుమోములనిసుంగు గలిగి యొప్పంగెన్. 3.

కం. ఎన్నాగినలనఁ బొడమితి, నెవ్వఁడ నే నాకుఁ జేయ నెద్ది యగు నటం
చవ్విధి వికలత మొఱలిడ, నవ్వేళను గగనవాణి యడలకు మనియెన్. ౪.

ఉ. శ్రీహరి యిట్లుమూర్తిగ విరించి గుఱించి వచించె నవ్వ డీ
మోహ మదేల నీ కభయము౯ శుభముం బ్రభవింపఁ గూర్తు నీ
దేహము నే సృజించితిఁ గదే జగదేకనిసృత్తువృత్తి ను
త్సాహము మీఱ నార తను నా విను జాగ్రదనుగ్రహంబున౯. ౫.

ఉ. నా విని యావినిద్రవనలీనప్రభవుండు చతుర్ముఖుండు దే
వా! విను నాదువాంఛను బ్రపన్నతఁ దెల్పెద సుప్రపన్నత
దావకభావుకాకృతిఁ గనం గరుణించి కృతార్థుఁ జేయవే
కేవలపావనుండ నయి కీర్తిఁ బ్రవర్తిలుచుండఁ బొందుగా౯. ౬.

కం. అన విని వనజోదరుఁ డ,య్యనఘుని ప్రోల స్మరించె•నాశ్చర్యముగాఁ
గను సారంగము భంగినిఁ, గనుఁగొనఁగా మహిమ పేర్మి • క్షణమాత్రములోన్.

గీ. తనదుఘుర్ఘురకృతినోంకృతి•స్వనము దెలుప నదియె ప్రణవోపదేశమా•నంచు నెంచి
కొం చలవిరించనుండు వీ•క్షించుచుండ, నంత నంతర్హితుం డయ్యె•నవ్విభుండు.

సీ. వేధ నప్పుడు తామ • వేదంబులు భజించెఁ, దన్మూలకంబు లై•తనరునట్టి
వేదాంగములును సే•వించె నంతట నతం, డిఁక నాకొనర్చెడు•కృత్య మెద్ది
యొకొ యంచుఁ జింతించు•చుండఁగాఁ బొడసూపి, ప్రశ్రేష్ఠ నీ వెల్ల•భువనములను
నిర్మింపు దిట మూని•నే నెప్డు నీకుఁ దో, డౌదు న టంచు శ్రీ•హరి వచింపఁ

తే.గీ. బూర్వకీతిఁ జతుర్దశ•భువనములను, గడఁగి సృజియించి సత్యలో•కమున వీత
కలుషుని సేవ్యమానా•గ్రమ్మి•కమునఁ దగుచు,మించు వేడుక తోడవ•సించియుండె.

కం. తామరసనూతి యొకతఱి, సోమరితనమూని యుండఁ • జోరత నిగమ
స్తోమముఁ దిడింగములతో, సోమకనామకుఁడు రా•క్షసుఁడు వడిఁగొనియెన్.

గీ. విధిని గికురించి యప్పుడు•విధినిషేధ
బోధకం బగు నామ్నా•యయూధకంబు
నధికవ్యతిఁ గొని మఱియు న•వ్యకేతుఁగా యం
బధిని మీనాకృతి వహించి • యడఁగఁ జొచ్చె. ౧౧.

కం తా మఱచి నిద్రపాల్పడి,తా మఱచిన విమల శ్రుతులు • తలఁగి చనుట్లకై
తామర మాలి ముకుందుని,తామరచూలి సమర్ధ•తాం ఘ్రిఁ దలఁచినన్. ౧౨.

గీ. ఇంచుకెంచక క్రించున•క్తంచరుండు
వంచన నకించనుని గా వి•రించనునిఁ ద
లంచి శ్రుతులు హరించి భూ•కాంచి నుంటఁ
గాంచి కాంచనపటుఁడు రో•జించి యపుడు. ౧౩.

సీ. తపనీయవసనకాం•తిపరంపరలు దమా,స్తనహాగ్రాముద్రం•లను వచింప
సుహనీయకౌస్తుభ•మణిఘృణిశ్రేణులు, లక్ష్మీ పదాలక్త•లక్ష్మ నుడువఁ
గమనీయవనమాలి•కాప్రభాపూరము, ల్కమలాకటాక్షలీ•లలను బలుక
గమనీయలాంఛనసౌ•రశ్మవిచ్ఛట లింద్, రాకజ్జలాంక వి•భ్రమముఁ దెలుప

తే.గీ. శంఖచక్రగదాఖడ్గ♦శార్ఙ్గధరుఁడు, సజలజలదప్రభుఁడు చతు♦ర్భుజుఁడు భుజగ
శయనుఁ డంబుజమిత్రేందు♦నయనుఁ డండ, జాధిపాశ్వుండు శౌరి ప్ర♦త్యక్షమయ్యె.

కం. కాంచనపటు నిటు లెదుటం, గాఁచి నమస్కృతు లొనర్చి ♦ కడునంచితరో
మాంచము మించ విరించి ప్రపంచితగతిఁ జంచదర్థ♦ఫణితి నుతించెన్. ౧౫.

కం. దేవా తావకపదయుగ, సేవాహేవాకలబ్ధ♦చిదచిద్విజ్ఞా
నావాసవాసితాత్ములు, భావాతిగమూర్తి నిన్ను♦భావింతు రొగిన్. ౧౬.

శా. నీమాయాపరిమోహితాత్ములు నిను ♦ న్నిక్కంబు భావింపఁగా
సామర్థ్యం బొకయింతయుం గనక దుః♦స్సంసారనిర్మగ్నులై
కామక్రోధముఖాదివర్గజితులై ♦ కష్టైకతానస్థితిన్
సీమాతీతవిషాదమేదురగతిం ♦ జింతింతు రోయీశ్వరా. ౧౭.

గీ. నేనె నీతత్త్వ మెఱుఁగంగ ♦ లే ననంగ, నితరసురు లెంతవారు మ♦త్సృష్టమూర్తు
లార్తరక్షావిధానదీ♦క్షాంతరంగ, కరధృతరథాంగ సద్విహం♦గమతురంగ. ౧౮.

గీ. ఆద్యుఁ డవ్యయుఁ డచ్యుతుఁ ♦ డక్షరుండు
నప్రతీకాశుఁ డనఘుఁడు ♦ నప్రమేయుఁ
డఖిలనాయకుఁడు ననంతుఁ ♦ డనాదియుండు
నను మహామ్నాయములు నిన్ను♦నభినుతించు. ౧౯.

కం. సర్గస్థితిలయహేతుని, సద్గుణమాత్రయుపకార♦సంజ్ఞాకాగో
త్సర్గామలదివ్యవర్చో, త్రిగుణమూర్తి వని నిన్నుఁ ♦ దెలుపు నిగమముల్. ౨౦.

కం. కర్మజ్ఞానఫలాత్మక, ధర్మస్వర్గాపవర్గ♦దాయక మగునీ
నిర్మలనామస్మరణము, నర్మిలి మా కొసఁగి ప్రోవు♦మయ్య మహాత్మా. ౨౧.

గీ. దిక్కు లెందాఁక నీవ్యాప్తిఁ ♦ దెలియ లేవు, కాల మెంతకు నీతుదిఁ♦గాంచలేదు
కాన దిక్కాలనిర్విశే♦షానవద్య, హృద్యతేజోమయాత్ముఁడ ♦ వీవ దేవ. ౨౨.

గీ. పొందలేనికతంబున♦నెందునుండి, మనసుతోఁగూడి వాక్కులు ♦ మరలుచుండు
నట్టివస్తువు నీవంచు ♦ నాశ్రయింతు, నమితకారుణ్యస్వభావ♦యాదిదేవ. ౨౩.

గీ. మశకపర్వాన్మధ్యవర్తివై♦వాటి యనంత, భువనముల బొజ్జ నొకపజ్జ♦బూనుటనను.
వణువుకంటెను మహత్తును♦మహత్తుకంటె, ననుముఁ బ్రాజ్ఞులు ని♦న్నభినుతించు.

కం. సామీప్యంబున నీమెయి, సామీచీన్యం బెలర్ప సామీ! యస్తో
కామితపరిపాటిగ వ్యాకామితము లొసంగఁ గావఁగా నైతివిగా. ౨౫.

కం. అని వినుతించిన వనజాసనుఁ గనుఁగొని యప్పరమాధిశయనుఁడు తనయా
నను దలఁచిన పని యేమొకొ, వినిపింపు మనంగ హరికి విధి యిట్లనియెన్. ౨౬.

కం. శ్రీవర! నీవరదయ నా, కై వఱలు టెఱుంగ కేవఁడో ప్రామిమ్మ లోగిం
గావరమునఁ గొని చనుటం, గార రహిన్నిష్ఠఁ దలఁపఁగా వలసె హరీ. ౨౭.

మ. అనవుం డాఘనపుండరీకనయనుం డప్పద్మజుం గాంచి మిం
చినకారుణ్యమున న్మనస్థ మగుగ స్తీం బావఁగా సూత్రులా
లనవాక్యంబులఁ దేల్చి పల్కె నిఁక వైక్లబ్యంబు నీ కేల ప్రా
ఖనుకుల్ ప్రముచ్చిలినట్టియాచ్చునఁటి బల్మింబట్టి నే దెచ్చెదన్. ౨౮.

కం. అద్దిర యెంత ప్రమాదమ్ము, సుద్దిరహస్యముగ నొక్క సోకుఁడు వడిగా
నిద్దురవస్థితిఁ దెచ్చెను, నిద్దుర నీవొందలు మఱవ నిగమంబులకున్. ౨౯.

ఉ. ఉపదేశం బొనఁగూడకున్నఁ జదు వెందో కాని శోభింప దే
వ్యపదేశంబున నైన విస్మృతికిఁ బ్రాపౌఁ గాన వేయేల ని
ష్కపటప్రక్రియ నొజ్జనజ్జ దృఢశిక్ష న్నేర్చి తాశిష్యుసం
గృపచే జెప్పి కృతార్థుఁ జేసినఁ గదా వృధ్వి ప్రసిద్ధిం గనున్. 30.

సీ. విద్య లోకాచారవిజ్ఞానమును గూర్చు, విద్య యెల్లెడ గారవింపఁ జేయు
విద్య యాత్మాన్యనీవృద్బంధువై పేర్చు, విద్య రూపవిశేషహృద్యుఁ జేయు
విద్య లోకాలోకవిఖ్యాతిని ఘటించు, విద్య యుక్తాయుక్తవిదునిఁ జేయు
విద్య యానంద మావిర్భవింపఁగఁ జేయు, విద్య ప్రజావశ్యవిధ మొనర్చు
తే.గీ. విద్యయొన్నని పెల్లు గావించుఁ గాన
విద్య వరులకు ముఖ్యసంపాద్య మైన
ధనము దానికి ముఖ్యసాధనము గాదు
మంత్ర మొక్కటియే ఘమా మాన్యచరిత. 3౧.

కం. విద్యోపదేశ గురుఁ డన, వద్యమతిని బోధకత్వపద్ధతి వైరా
రద్యుఁడు జాతివయోమహి, మాద్యున్నతివందనీయుఁ డై యొనర నలెన్. 3౨.

చం. వినయవిధేయవర్తనుఁడు విస్మృతిశాలి యసంశయాశయుం
డనితరసక్తమానసుఁడు స్వార్థవిదూరుఁ డధీతపాఠచిం
తనపరుఁడున్ సుఖగ్రహణధారణగణ్యుఁడు సూక్ష్మబుద్ధి సు
స్వనుఁడు గురుప్రియుండు నగు వానినె శిష్యునిఁగాఁ గొనం దగున్. ౩౩.

గీ. ఏను స్వర్భానుభానుజభానుభూమిసూనులను సితభానుకృశానుబాణ
సానుమత్స్థానముల నుండఁగా నరసితిఁ, గాననిష్టార్థపునరాప్తిఁ గలుగు నీకు. ౩౪.

కం. సోమకుఁ దనియెడు సోఁకుం, డామున నిన్నుఁ గికురించి సాంగముగ శ్రుతి
స్తోమంబును బ్రుచ్చిలి నీ, ర్వామిం జొఱ మేను పూని వసియించె నజా. ౩౫.

కం. కావునఁ బునరానయనం, బేవడువున నగు నటంచు నెన్నెద వేవో
యోవిధి విను విధివిహితం, బౌవిధిఁ దప మాచరించు నవుడు లభించున్. ౩౬.

కం. ఆదిత్యపత్యముం గృత, వేదాపహృతి న్వధింతు విశ్రుతముగ నా
యాదిత్యపత్యభిష్టుత, వేదాఁపక దల్పితిం దపింపకుము సుతా. ౩౭.

కం. తపనీయగర్భ! నిర్భర, తప మిర్యేడ నాచరింపు దానఁ దలంపుల్
విపులముగ నొదవు గానన్, విపులఁ దపం బే సుమీ యభీష్టద మరయన్. ౩౮.

కం. తప మఘదుర్దమకర్దమ, తప మవిరళతమతమః ప్రతారణచండా
తప మని మహర్షులు పరం, తప మన్నించెదరు దానిఁ దరమె నుతింపన్. ౩౯.

గీ. దుస్తరంబు దురాపంబు దుర్గమంబు, దుష్కరంబును సాధ్యమౌఁ బుష్కలముగఁ
బుష్కరోద్భవ తపముచే భువిఁ దపంబు, మాత్ర మొకటియె దురతిక్రమం బుసుమ్మి.

ఉ. ఇందిర నేనుఁ గూడి వసియింతుము తాపసమానసంబులం
దిం దిరవంచు నిక్కముగ నెంచుచుఁ దామసంబులందు నిం
దిందిరయుగ్మకం బన ననిందిత మాళిఖులోఁద వహ్ని వే
దిం దిరమైనరీతిగ నతిప్రమదంబు మదిం గదించుచున్. ౪౧.

కం. విను మస్మత్ప్రియము దపం, బనఘ తపోధనులు మత్ప్రియాత్మకు లటుగా
వున ననుఁ దలంచుచును దప, మొనరింపుము నిర్జితేంద్రియుండ వగుచు నజా.

కం. రం గగుజలనిధి కౌశక్రస, శ్కం గన గరుడాద్రి యద్రిం గతిరోధిలతా
లింగితకుహీజసంగత, శృంగారోత్తుంగశృంగ శృంగాటకమై. ౪౩.

గీ. అది మదిష్టపదంబు సౌఖ్యాస్పదంబు
పరమదివ్యతపఃఫలప్రదము దాని
కెలన బంధుర మన నొప్పు కొలను కొలను
మించు కొలను దొలంగ శాసించు మహిమ. ౪౪.

గీ. తత్తటాకతటాకల్పతరుల దరులఁ, దద్ధరిత్రీధరేంద్రంబుదరుల నరులఁ
జెందు నాకల్పకృతతపస్సిద్ధిఫలము, స్వల్పకాలాసకృన్మంత్రజల్పనమున. ౪౫.

శా. ఆకాసారతటంబునం దయినఁ దార్క్ష్యాహార్యముం బైన న
న్నేకాగ్రాత్మత నెవ్వఁ డేనియుఁ దపోవృత్తిం బ్రసేవించు వాఁ
డో కంజాతభవా! స్వవాంఛితఫలప్రోద్యన్మహాలాభల
క్ష్మీకల్యాణమహోత్సవంబు గను సుమ్మీ నెమ్మి వేగమ్మునన్. ౪౬.

మ. మహిమోత్కృష్టతచే నొకానొకమహామంత్రంబు రాజిల్లు నో
ద్రుహిణా! నీ కుపదేశ మివ్వఁ దొనరింతున్ దాని నిష్ఠన్ముహు
ర్ముహురావర్తన మొప్పఁ జొప్పడఁ దపోరూఢిన్ జపింప న్శుభా
వహమై భావహమై యభీప్సితఫలప్రాప్తిన్ ఘటించుం జుమీ. ౪౭.

గీ. దాని ఋషియును ఛందంబు దైవతంబు, బీజశక్తికీలకములు విశదమగుచు
వెలయు నంగకరన్యాసములును గవచ,మాలలును దిగ్విముక్తియు నమ్మాధవుండు.

గీ. కంజసంజాత! షోడశాక్షరి యనంగఁ, దనరు దన్మంత్రమున కధిదైవతంబు
జ్ఞాననిర్మలతరవిభానందమయము, సేవకాభీష్టదము హయగ్రీవమూర్తి. ౪౯.

కం. కానఁ దపం బొనరింపంగా నరుగుము గరుడగిరిశిఖం దగుసాలపా
కానతు నని సామాగమ, గానకుతూహలి వచింపఁగా నజుఁ డెలమిన్. ౫౦.

చం. అరిగి సరోరుహప్రభవుఁ డంతఁ గనుంగొనియెం బయోధికిన్
సరసను గూటకోటికటఘూటలసత్కనలారుణప్రభా
నిరతవిజృంభణాత్తతపనీయమయప్రథిమామరాపగా
తరచరదచ్ఛపక్షశకునచ్ఛదజాలముఁ దార్క్ష్యశైలమున్. ౫౧.

గీ. కాంచి కాంచనగర్భుఁ డాగ్రావసీమ, నేమము దలిర్పఁ దపమందు నెఱపఁ దగిన
నెలవు నెమకుచు నందంద నిలిచి నిలిచి, యరసె నాపాదశిఖరాంచలాద్భుతములు.

గీ. ఆత్మసృష్టికి నది లోని•దయ్యె విధికి, వింత యొనరించె నొక్కొక్క•వేళ నాదవు
కవనలిపి శిల్పగానపా•కములు గర్త, లెఱుఁగని తెఱంగు మెఱుఁగుల•నెసఁగుఁగాదె.

కం. కబరీజితవాలములై, శబరీజాలముల వెంటఁ • జమరీగణముల్
నిబిరీసత నందు నవిక్లబరీతిఁ జరించు జితుల • గతు లట్లు కదే. ౫౪.

సీ. లీలాశయానశా•ర్దూలప్రదేశంబు, రత్నకంబళసం•స్తరణతలంబు
దీర్ఘరాహిఫణామణీ•దీప్తప్రదేశంబు, కర్పూరదీపికాం•గణతలంబు
వనవారణకరాగ్ర•వమధుప్రదేశంబు, ధారాంబుయంత్రశీ•తలతలంబు
హరికర్ణోద్యుక్త•శరభప్రదేశంబు చంచదష్టాంఘ్రిముం•చకతలంబు
తే.గీ. కపికరాఘాతచలసగ•ఘూప్రదేశ, మతిరుచి తవితానసం•వృతతలంబు
గాఁగఁదోఁచుటనగ్గుహ•డాగసీమ, కమలసంభవునకు భీమ•కాంతమయ్యె. ౫౫.

కం. సింగము లచ్చన లాడఁగ, డంగిన చెంచెతల కచ్చ•టం గాయలఁ గూ
ర్చుం గరిశిరములముత్తెము, లింగితము లెఱింగి కొలుచు • గృహసేవకులై. ౫౬.

సీ. సెలయేటియిసుకతిం•న్నెల గూఢమణికేళి, కల నిలింపాంగన • ల్గలసి యాడ
దీర్ఘికాబ్జములనం•ధిత్యకహంసముం, డలములు జతగూడి• వెలయఁజేయ
వృక్షశాఖల దాసి • ఋక్షాళి దేజస్తి మిరమేళనాశ్చర్య•గరిమఁ జూపఁ
కటకకూటములందుఁ • గదిసి గంధర్వసం, ఘాతంబు సంగీత•కలనఁ జెరయ
తే.గీ. నాకభూలోకములకు సం•తతముగాఁగ, రాకపోకలు నెరపఁ బం•రస్వరంబు
దివిజమనుజులఁ గోర్కి సం•ధించుకొనిన, దండినిశ్రేణి యనఁగ నం•కొండ దనరు.

సీ. ఘనసాకదళికాం•కాండ మొక్కచోట, మఱియొక్కచోట జాం•బవచయంబు
సముద్రగలాంగలీ•షండ మొక్కచోట, వేరొక్కచోట జం•బీరతరులు
ఫలనమ్రశాఖామ్ర•వనము లొక్కచోట, నొంకొక్కచో దాడి•మోత్కరంబు
ఫలపూరకుజపూర•వాట మొక్కచోట, నిఁక నొకచోట కం•టకఫలద్రు
తే.గీ లమర నుమనసకల్యాత•టాగ్రసీమ
పూగపూగాను వేల్లిత•నాగవల్లి
గణము లొక్కచోట నొ•కానొకయెడ
నందు మందారకుందకుం•జాళిఁ గనుచు. ౫౭.

వ. మఱియు నగ్గిరివరం బురుతరసురుచిరసురవరశరాసనానుకారిభూరికిరణారికాను
యూరకాంతిసంతానంబుల నత్యంతకాంతంబులై, సంతతదంతురంబు లగు
సంతమసంబుల నితాంతంబు వసూర్యంపశ్యోదరంబు లగుటం దరంబుగ
దురఁ గృతమాలనక్తమాలతమాలసాలరసాలాదిసాలజాలంబు లగువనషండంబు
లను ఘనమండలంబులకు శంపాలతలసంపదలసొంపు సంపాదించుచు నుద్ద్యో
తమానంబు లగుజ్యోతిరింగణజ్యోతిర్గణంబుల విస్ఫురణంబులు దుఱంగలింప
నిరంతరాసారధారాధారంబులగుమరందరసపూరంబు లీరంబుల చేరువులం
గాలువలై ప్రాన్తశ్రేణ్య సమయ సముజ్జృంభణంబుం దలఁపించు తావులుం,
దావులకుం దావలంబు లగుచుఁ గుస్తరించి యందంగఁ బ్రస్తరించుకస్తూరికామృ
గస్తోమంబులు దీమంబులం దగిలి దిగులువడి చూచుచూపులకుం జాలివడి విడి
పింపం జాలివడిఁ బరతెంచి యొడలించు సిద్ధమునిశుద్ధాంతిసంఘాతంబులును,
ఘాతంబులఁ దొఱఁగుసెలయేటితీరంబులఁ దోరంబు లగుకరీరాంకూరంబుల
మోరలం దిమలించి నమలఁ గమకించి కించిదాకుంచితపూర్వాంగంబు లగు
గోలంబులఁ గోలలం గేలిమెయిం దోలి తూలించు గోలల నాలోకించు
చెంచునాయకుల దేహచ్ఛాయలకు దాయాదంబులై దండల దండిగ మెండుగఁ
దిరుగువనవేదండంబులతండంబుల గండమండలంబుల నుండి పిండుగట్టి యొగయు
గండుతేఁటులకూటువులతోడికూటమిం బాటించులోవల్లోవల్రకేవలఁ గేవలంబు
సాపలంబంబులగు లతావితానంబుల వనదేవతాబాలికాపాలికాకేలికాడోలికల
పోలికలఁ గ్రాలి కనుపట్టు విడిమట్టుల మట్టుమీఱి యిట్టలంబు లగుచిట్టకంబుల
దట్టంబుగ రొట్ట బలిసిన తులసిచెట్టులు కట్టువలై చుట్టు వలగొని చెలఁగ దిట్టంపు
జాకట్టులం బడి జర్జరంబులగు జలంబు లమలంబులగు బిందుబృందంబులై యొగసి
ముత్తెంబులమొత్తంబులపగిది నొగి దిదృక్షువీక్షాసేచనకంబులై వృక్షాసేచ
నంబు సేయ వనకుసుమసముదయకుళవిసరసమిత్సమిద్ధంబులును బ్రవృ
ద్ధంబులునై ప్రచ్ఛాయకిరుచ్ఛటాచ్ఛాదనశీతలచత్వరభూతలంబులై సవిధంబుల
వివిధంబు లగుమల్లికావల్లికామతల్లికల వల్లికొన నుల్లసిల్లుచు నుల్లంబులకు నుల్లా
సంబు పల్లవింప నింపు నింపు మంజులకుంజపుంజంబుల రంజిల్లుచుం బరివేష్టితకుట
జంబు లగుకుటజంబులం బొలిచి పావనంబు లగుతపోవనంబులఁ బరిస్ఫురిం
చుచుండు. ౫౯

శా. అందందఱ బరికించి యందొకవివిక్తావాసయోగ్యాశ్రమా
ళిందంబం దరవిందనందనుఁడు హాళిన్నిర్మలాస్వాంగమై
డెందం బొప్పఁ దపం బొనర్పఁగొనఁ బాటించుం గదా యంచు సా
నందం బొందుచు రూఢనిశ్చయమతిం దత్ప్రాంతసీమంబునన్. ౬౦.

చం. తనజనయిత్రియిమ్ము దనతమ్మునియైదఱవైనయమ్ములుం
దన వగువారువమ్ములు పంతమ్ము హితమ్ముగ వర్ధితమ్ములై
తన [illegible] నాత్మబంధురచిత్రప్రియవైఖరిఁ జేర్చుబంధురం
బనుకొఁటు న్వారించి కనె నధ్వపరిశ్రమ మాఱఁ జేరువన్. ౬౧.

శా. సాసంగార్భకము ల్విహారమతినుత్సంగంబులం జేరి యిం
పారం గ్రుమ్మరఁ బుండరీకనిచయం బచ్చాంతరంగాప్తి ని
ర్వ్యాప్రక్రియనొప్ప సిద్ధమునిసేవ్యం బైనపుణ్యాశ్రమా
గారంబో యన సౌమ్యమై తనరు సక్యాసార మత్యంతమున్. ౬౨.

సీ. బంగార సారబంధురోదకములం దు నిరూఢనియతి మజ్జన మొనర్చి
సర్వతోముఖముల సర్వతోముఖముల, నాచమనంబుల నాచరించి
విహితకృత్యముల భావిహితకృత్యాసక్తిఁ, గావించికొని లేచి కదలి వచ్చి
యతివివిక్తం బైనయలవివిక్తప్రదేశము సొచ్చి యచ్చటం శమదమంబు

తే.గీ. లవన సమాధికనిష్ఠమై నధివసించి, భగవదుపదిష్టపద్ధతిఁ దాఁ జపింప
గాఁడంగను సైంధవకంధరాధిదైవతక మైనదివ్యమంత్రము నజుండు. ౬౩.

కం. అతనికి నొకపరి జపమునఁ, జతుర్గుణంబుగ ఫలంబు సమకుఱె సత్య
స్థితునకుఁ బెక్కుముఖంబుల, జతనం బది గాదె యర్థసంసిద్ధి యిలన్. ౬౪.

గీ. అతఁడప్పుడు కమలజ ఖ్యాతుఁడగుట, ముడముగనుర మహోత్సవం బునవసించి
సారసత్వంబు బూనుట చెనుసుగాని, యాత్మరాజవృత్తిఁబో నాడుటరిది.

## ⟶* గ్రీష్మర్తువర్ణనము. *⟵

కం. అట్టియెడ వెట్టకాలము, బెట్టిదముగఁ దోఁచె మన్ను బిట్టుగసి చదల్
ముట్టఁగ వడి సుడిగాడ్పులు, నెట్టన నెట్టుకొని పీవ నిఖిలావనిపై. ౬౬.

క. పాటలకుసుమపరిమళ, పాటచ్చరవృత్తి బయలు • పడకుండఁ బవల్
మాటుగ నిశాంతముల నొక, పాటిగఁ జరియించు నపుడు • పవమానంబుల్.

గీ. ఇనునిసత్ప్రపదినలక్ష్మి • హెచ్చు టరసి, నిశలునానాఁట భృశకృశ • దశలఁ గాంచె
నొరులసిరులకుఁ జాపోప • కున్నఁ దనదు, పెంపుదఱుఁగుటగాకన్య • వృద్ధి సెడునె.

గీ. ఇచ్ఛఘును లుండి రని యవ్వ • లిచ్ఛవడసి
పొంగి పొరలినపరసుల • పొలుపు దటిగె
మున్ను గలకీర్తిసారముల్ • పోవనవ్వ
డప్పులను జొప్పడినయొవ్వ • ముప్ప గాదె. ౧౯.

ఉ. గాలికిఁ గాలు నిల్వకొనఁ • గాఁ దగునాఱటపండు వాభుజం
గాలికి నక్తభోజనమ • హావ్రతపర్వదినంబు తాళవృం
తాళికి వస్నివాసియుఁ బ • యల్పతుయోగదశాగమంబు నై
తాలిమి దూల నాఁ డొకఁ • డౌన జనం బెడపెట్టె దినంబులన్. 20.

సీ. పూఁట కొక్కొకనూఁతి • నీట దప్పి యడంచు, కొనె దవ్వ చని తెచ్చి • కొని జనంబు
వెలఁబెంచి పానీయ • విక్రేత లింటింటా, పుల క్షారనీరముల్ • గలపి దెచ్చి
రనుదినంబు మడు గుల • లను దెచ్చి యిడుచాళి, నాలుగైదా రేడు • నాళ్లకొకఁ గెఁ
గ్రుంకులాడఁ గొలంకు • లింకఁ బాఱుట స్రోత్రి, యులకు వేళలఁ దాన • మొదవకుండెఁ

తే.గీ గరటచటకాదికం బైన • గ్రామ్యపక్షి, జాల మిలు సొచ్చి బెదరక • జనుల నడుమ
కుంభసంభృతజలములఁ • గ్రోలఁ జొచ్చెఁ, బుడమి నొదవిన నీటియొ • ద్దడికి నపుడు.

సీ. తొలుత వ్రాల్చినప్రక్క • నులివెచ్చఁ దనమొక్క
నొండొక్కప్రక్కకు • నొత్తి గిలుచు
వ్యజనసమాకర్ష • కజనంబు సెయిమార్చు
కొనిసంత హుంకృతిఁ • గినుక వడుచు
వారియంత్రపుసూక్ష్మ • ధార లిట్టటు గాలిఁ
దెరలిన సఱచూడ్కిఁ • దెఱచికనుచు
నిదురఁదోఁగె సటంచు • పదములొత్తభుజిష్య
లూరకుండిన సంఘు • లూఁపు కొనుచు

తే.గీ. వలపుఁ బన్నీరు చిలికిన • చలువవలువ, సెజ్జ లామజ్జకపతి • సీర లెసఁగు
నిదుదగుమ్మలచుట్టు పం • దిళ్లయిండ్లఁ, బవలు పొరలాడు సామంత • నివహ మపుడు.

ఉ. గొజ్జఁగినీటి చిన్ని చినుకు ల్వలిపంబులు గంధసారముల్
మజ్జిగతేట మల్లెకుసుమంబులు వెన్నలబట్టబైటిపూ
సెజ్జలు వీణపాటలు సుశీరపువీవనలుం ఘటించు భూ
భృజ్జనకోటికిన్ని దురపించుక వేసవి రేయి వేఁకువన్. ౨౩.

సీ. ప్రహిబహిః కుట్టిమాభ్యర్ణ గాంభఃపూర్ణ, కలశాంబువులు గతిక్లమముఁ బాప
నవనారికేళ పర్ణకలింజకస్థితుల్, మార్గాతపోత్థశ్రమంబు నుడుప
జంబీరరసపూరసమ్మిశ్ర మగుతక్ర, సారంబు దృషను జల్లారఁ జేయ
నాయతకాయమానాంతరస్థితతాళ, వృంతముల్ ఘర్మాంబువితతి నడఁప

తే.గీ. నిదుర గదురంగ నపుడధ్వనీనజనము, విడియునొక్కొక్కపుణ్యాత్ముఁడిడినయట్టి
ప్రపనపారసుఖాప్తి మైకొంబనుల మఱచి. పట్టపవలింటి వడసోఁకు దట్టకుండ.

సీ. వాతూలతూలతల్పము పాల్పు నవరించి, శౌరిఁ జొక్కించు దానేరకుండు
ఘనఘటావళినీటఁ గర్షకుల్ దనియంగ, హలమాంకురము పెంచు పొలము కాఁపు
హరిపదంబునఁ గాఁపు దిరుగు కవ్వలదాయ, వంశమార్చెడుదళవాయి పెద్ద
కదలియింటికి ధునీకన్యలఁ గైసేసి, తోలిసారి యంపించుఁ గులగురుండు

తే.గీ. దోఁచె గ్రీష్మావసానము త్తుంగసౌధ, జాలబహిరంగణాప్రపవోషప్రభాత
చరదూష్మార్తిదంపతీ విస్మృతాలి, దృఢపరీరంభపునరుపదేష్ట యగుచు. ౨౪.

గీ. బైటితలిమంబులను లోన బైట లోని, తలిమముల వైచికొనుచు రాత్రుల జనంబు
పాఱ్కుఁజినుకులచే నస్వప్నసౌఖ్యయింత, యైన నిదురింప నెడలేకయుండఁ జెందె.

కం. ఘనులు కరకాంబువుల ఘనజనులం దనియించు సితలసచ్చిత్రరుచిం
దనరెడుదవళిఖుల నెఱిం గనుఁగొన గ్రీష్మంబు వర్షకాలముఁ బోలెన్. ౨౬.

గీ. కదసి కలకంఠములకు మౌనవ్రతంబు, నెఱప నుపదేశ మొనరించి నీలకంఠ
తతికి సోత్కంఠముగఁ దదుద్యాపనంబుఁ, గడుప గ్రీష్మర్తువాచార్యకం బొనర్చె.

కం. పంచజనపంచవక్త్రంబు, పంచగురు న్మదిహయాస్యు భావించి సదా
పంచాగ్నిమధ్యమున నృపప్రంచాస్త్రజ్యేష్ఠుఁ డురుతపం బొనరించెన్. ౨౭.

### వర్షర్తువర్ణనము.

కం. వర్షర్తు వొడవె నంతట, గర్షకహర్షకరవర్షకలితపయోదో
త్కర్షాభిశంసితాపా, కర్షిఝురీప్రవణనన్నికర్షం బగుచున్. ౨౮.

సీ. మండూకములు చర్మ•మాత్రశేషత వీడి, చెలఁగి మెల్లంగ సం•జీవకరణి
బర్హిణంబులు వర•స్వరభాస్వరముగ ఘో•షింప సారస్వత•సిద్ధరసము
బిసకంఠికలు చూలు • వెసఁ దాల్చి తొసఁగ స•ప్తపయోధిసంగయా•త్రాఫలంబు
చాతకంబులు పిపా•సను బాపి వాసి ఘా•సిలఁ బ్రపాతంబవుం•గళములహార్తి
తే.గీ. మఘుచుఁ బొగడొందెనప్పుడుల్లో•కైకతాప,హారణకరణాభ్రనిత్యసం•చరణసాంద్ర
తరుణతరుణాభ్రవిభ్రమ•స్ఫురణకరణ, మైనప్రావృడనేహస్స•మాగమంబు. ౭౧.

గీ. స్వాతిమౌక్తికములఁ గాంచి • స్వాతిశయముఁ
బూనె నని యార్ద్ర) జగమార్ద్ర)•ముగఁ దలిర్పఁ
బద్మరాగంబులను గాంచి • పరఁగె ననఁగ
నింద్రగోపంబు లెల్లెడ • నెసఁగె నపుడు. ౭౨.

కం. అకలంకద్యుతికలహం,సకులము స్వకుల మగుమాన•సమునకుఁ జనుపూ
నిక పోలుపుఁ దెలుపు ప్రాస్థా,నికశుభదానకములై స్త•నితములు మొరసెన్. ౭౩.

ఉ. గర్జితనిస్వనం బపుడు • కర్ణకఠోరముగా ముహుర్ముహు
స్సూర్జిత మైనవినుఁగవఁ • జొన్పినయంగుళు లొప్పఁ బ్రాజ్ఞులున్
స్ఫూర్జథువిభ్రమభ్రమను • జొక్కి౯రి నిల్వెఱపాటు దోఁపఁగా
వర్జునముఖ్యనామదశ•కానకృదుచ్చరదాత్తజిహ్వులై. ౭౪.

కం. చిట చిట మని సొటసొట మని, పొట పొట మని ఝల్లు మనియు•భోరని ధారా
స్ఫుటనియతి నపుడు జలధర,పటలము పటునియతిఁ గుంభ•వర్షము గురిసెన్.

కం పెళ పెళ నుఱుములు నుఱుమఁగఁ,దళ తళ మెఱుపులును మెఱయ•దళముగ జలదం
బులు గ్రమ్మి కాఱుకొని వి,చ్చలవిడి వర్షింపఁదొడఁగె • జడిగొని వడిగాన్.

శా. సారంగావళి మేఘలోలుపమన•స్కాం బౌట వెన్వెంట నే
తేరం బుష్కరశీకరంబులు ధరి•త్రిం జెంద మందంబుగా
నీరంధ్రస్థితిఁ ద్రిమ్మరం దొడఁగె సు•స్నిగ్ధాంజనశ్యామలా
కారంబు ల్దనరం గళేబుతతినాఁ • గాదంబినీబృందముల్. ౭౭

సీ. కలమాంకురారోప•ణకరశాలిపాలికా, స్త్రీపాలికా పరస్ప•రతిప్రసన్న
మాత్తక్షితికృషిక్రి•యాధ్యక్షవృద్ధనియుక్త హాలికబాలుర కల•ధ్వయునపర్వ

మన్యపథసత్ప్ర•యాణప్రయోజన ప్రవణప్రజల కెల్ల • గ్రహణశాల
యర్కసందర్శనా•నంత గాభ్యవహార, శీలుర కేకాద•శీవ్రతంబు.

తే.గీ. నిజనివాసగృహాస్యమం•దిగయియాసు, ఖగసమూహంబులకు నెల్ల • జిఘురుఁ గండె
నిఖిలపశుయూథముల కెల్ల•నిగళబంధ, మెడతెగ నివానజడినస్వ• డెనఁ గెముసురు.

చం. వడ వెడఁ బ్రొద్దు గుంకు తఱి • వీటివిటు ల్సుమవీటి కాదు లె
క్కడుతమిఁ గూర్చుచున్నగరి•కొల్వగునంతకుఁ బోవగ త్తియల్
దడయుటచే హజాగమునఁ • దాళి చెలుల్ సనుదేర నజ్జడిన్
గొడుగులువట్టి చెట్టఁగొని • గొబ్బునఁ దోడ్కొని పోదు రిండ్లకున్. ౮౯.

సీ. వివిధప్రజలు గూడి•శివసహప్రఘటాభి, షేకప్రయత్నముల్ • సేయ కుండ
బాహాటశయ్యచే • హాచకు ల్నియతి మించ విగాటపర్వంబుఁ•జదువ కుండ
మాపుహవిష్యాన్న•మాత్రభుక్తిని ద్విజుల్. వారుణజపదీక్షఁ • బట్టకుండ
మృద్వికారాకారు•ఋష్యశృంగునిఁ బూని, విప్రు లుచ్చైస్స్తుతిఁ • బిలువకుండ

తే.గీ. గొంతిజాతిగఁ బామరుల్• గోగకుండ, సంజప్రొద్దులఁ బోసిల్లు• చల్లకుండ
సూర్యచంద్రులపరిధులఁ•జూడకుండ, ధరణినాసారవర్షంబు• గురిసెనపుడు. ౯౦.

సీ. ముసుఁగిడ్డ కుఱుమాపు• ముదుకదుప్పటి చెమ్మ, గిలకుండ నలఁతికో• వెలలుఁ జొచ్చి
హత్తించి తొడిగిన • క్రొత్తచెప్పులజోళ్లు, దడియకుండఁగ వీథి•బదులఁ జేరి
గుత్తంబుగాఁ జుట్టి•కొనిన చుట్టల నిప్పు, లాఱకుండఁగఁ బంచ•టరుఁగు లెక్కి
పొమ్మఁగట్టలయూఁతఁ•గన్నుఁగానకి జాఱి.పడకుండ రచ్చసా•వడుల నిలికి

తే.గీ. చేలవనులందుఁ జొప్పదు•చెలిమి సంజఁ
గాఁపుఁగొమరులు పడుపు సుం•కములఁ గొనిన
శాలిపాలికలకుటీర•పాళిఁ జేరి,
రట్టకేలకు నజ్జడి• నేకతముగ. ౯౧.

సీ. కేళీగృహాళింద•పాళీసముజ్జ్వల, ద్దీపద్యుగుల తెల్పు• దెల్పుచున్న
దృఢతరాలింగన•స్పృష్టముక్తాహార, ముల చల్లఁదనములు• వలుకుచున్న
శశ్వత్పరస్పరా•స్యగృహీత తాంబూల, రుచులవైకృతులు వా•క్రుచ్చుచున్న
వాతాయనాంత రా•యాతవాతానీత, నూత్నాబ్జగంధముల్ •నుడువుచున్నఁ

తే.గీ. ప్రొద్దువోదచె నేమొ యను•నుద్ది విడిచి, ఘనఘనంబులు గ్రమ్ముచీఁ•కట్లకతనఁ
దమతమకములవలన నూ•తనపుదంప, తులువిడువకుండి రజ్జడిఁ•దలిమములను.

కం. ఆతతిఁ బ్రాతఃకాలం, బై తగుసంగవముఁ జూడఁ•నటు సాయాహ్నం
బై తగునపరాహ్ణము ఖద్యోతుఁడు ఖద్యోతరీతి • నొందిన కతనన్. ౯౩.

చం. ఘనుఁ డని పేరుఁ గైకొనియొఁ•గాని సదా చపలాంతరంగుఁడై
పనిగొని యూరకే విమల•పక్షచరద్విజపీడఁ జేయఁ దా
ర్క్యాని చెలరేఁగి యవ్విషధ•రుండు వెసం గదువిచ్చె నప్డు స
జ్జనవితథాపకారులకు • శాశ్వతమా తమజీవనస్థితుల్. ౯౪.

కం. పద్మాపనుఁడై జప మ్మప్పద్మాసఖు నశ్వముఖుని•భావించి మహా
పద్మావృత్తి నొనర్చెను, బద్మాసనుఁ డపుడు గిర్యు•పరిభాగమునన్. ౯౫.

## హేమంతఋతువర్ణనము.

మ. అపు డేతెంచె హిమర్తువాసర మనం•తానంతభాగాంతరా
త్తపరిస్ఫూర్తిక శీతభూతపరిభూ•తవ్యాసకృద్వైపథు
గ్లపితప్రాణ్యభయప్రదాగ్నరవితూ•లస్థూలతూర్ణాపక
ద్విపటీచక్రకటీపటు స్తనతటీ•వీటీవటచ్ఛాయమై. ౯౬.

క. మృగమదవీటీభుగభుగ, లగురుంబొగలున్ వసంతి•కాగ్నులసెగలుం
దొగరుందుప్పటు లప్పటి, కొగి ముగియించెను హిమోద్య•మోద్ధతి ప్రజకున్.

సీ. వైకుంఠమందిర•ద్వాఃకవాటపుటంబు, లంచితంబుగ విప్పఁ•గుంచెకోల
యంజనాగర్భసౌ•ఖ్యప్రసూతి ఘటింప, నంది ప్రత్యావర్త•నక్రమంబు
బలిరసాతలజగత్•ప్రస్థానసన్నాహ, సాఫల్యమొనరింప•సన్మహార్త
మంభోజినీబాంధ•వాశ్రయాశులవెట్ట, సమగతిఁ జల్లార్పఁ• జలువమందు
తే.గీ. వాహినీవదవాప్యవ•గాహనక్రి, యాదితత్పరజనులతి•రావతరణ
విధికిఁ జొరకుండఁగా వెలి•పింప ఘోర, మకర మెల్లడ మించె హే•మంతఋతువు.

సీ. కుచనిపీడనకేళి• కచలవృత్తి వహించుఁ, గాని తియ్యనిమోవి•యానఁ బెదరు
దృఢపరీరంభవృ•త్తికి లతాకృతిఁ దాల్చుఁ, గాని నీవివిమో•క్షమునకొదుఁగు

గండనఖాంకరేఖలఁ బ్రసన్నతనూనుఁ, గాని గంధాలేపకలన కులుకు
హాలామదగ్లాని కామోదము వహించుఁ, గాని పన్నీటిసేకమున కడలు
తే.గీ. స్త్రైణ మప్పుడు మిక్కిలిజాణతనము, గలిగియుండియు నాథులఁ గవయువేళ
విజహదజహత్త్రపావేశవిలసనముల, వెలయు మధ్యాత్వసమయకేళులనుబోలె.

సీ. పట్టుఁబుట్టముఁ జుట్టి నట్టిబోడిశిరంబు, పై సెప్పు నక్షయపాత్రి యొకటి
యిరుకక్షములలోని తిరునామములపుస్తకమువను దాళవృంతమున రెండు
క్షుద్రకుటీప్రాంతశునకభీతినిఁ గుడి, కేలఁ దాల్చిన తిరుకోల యొకటి
డాచేతి దారుఖండపుఁ దాళయుగి రెండు, స్వప్రతీకంబులఁ బదియు రెండు
తే.గీ. రమణ నష్టాదశోర్ధ్వపుండ్రములు దమకు, నమర నత్యర్థవైష్ణవత్వము ఘటిల్ల
బికిర మెత్తంగ సాతానిపిండు దిఱుగుఁ, దగ ధనుర్మాసవాసరాంతములనపుడు.

సీ. నవశాలిసస్యకృంతనవిధానైకసం, భ్రమముహుర్త్రిముదంఘ్రిభవకులంబు
వార్షికవ్రీహిసంపాదనాజస్రస, త్వగచరద్గ్రామసేవకజనంబు
బార్థివగ్రాహ్యషడ్భాగగ్రహణజాగ్ర, దుద్యోగిపురుషభటోత్కరంబు
బ్రతిగేహపర్యటద్వాద్యనాదననాథ, కోణంగిముఖ్యభిక్షువ్రజంబు
తే.గీ. దనగ నవ్వేళ నాప్రభాతప్రదోష, మాప్రదోషప్రభాతంబు నటుల యిటుల
తిరుగ నయ్యయిపండడి తెఱపి లేమిఁ, జేలకూళ్లకు నొకవింత చెలువు దోఁచె.

కం. ఆసారనవాహుం డపు, డాసారసదృక్ప్రదద్వయపదాధ్యానుం
డై సాగతప మొనర్చె హి, మాసారములో గళద్వయస మగునీటన్. ౧౦౨.

కం. రాజీవనయనుఁ డాశ్రిత, రాజీవనచైత్రుఁ డపుడు ప్రాఁబల్కులకై
రాజీవనవాక్కృతితో, రాజీవనరాశిలోని రక్కసుఁ డెలమిన్. ౧౦౩.

మ. తిమిరూపంబున నేపులోఁ గడఁగి వార్ధిం గ్రుమ్మరం గ్రమ్మఱం
గమలాక్షుండు తిమింగిలాకృతిని రక్షశ్శిక్షణారంభసం
భ్రముఁడై పొంచి పరిభ్రమించి యరిఁ జేపట్టించి మేన్పించి యా
గమముల్ వేగమె యాక్రమించి విధికిం గాంక్షించి యంచద్గతిన్. ౧౦౪.

సీ. నిద్దంపుటద్దంపు నిగనిగద్యుతులతో
సొగడుబ్బుచాయ వెన్నెలలు గాయఁ

జెందంపుఁ జందంబు • చెందుమోరఁ దోరంగు
నురువు జ్ఞానామృత • స్ఫురణఁ దెలుపఁ
బలుసొంపు నలివింపుఁ • దొలఁకు హేషాధ్వనుల్
నెఱిగుల్కు తొలిబల్కు • టొఱపు నెఱప
నిరుప్రక్కలను జక్క • నెసఁగుచూపులకోపు
శ్రితపక్షపాతసం • గతి నచింపఁ

తే.గీ. బంచశాఖాచతుష్టయిఁ • బాంచజన్య
మును సుదర్శనమును బొత్త • ము నుపదేశ
ముద్రయు నెసంగఁ గరుణాస • ముద్రుఁ డైన
హరి హయగ్రీవమూర్తిఁ బ్ర • త్యక్ష మయ్యె. ౧౦౫.

కం. అప్పగిదిం బొడసూపిన, యప్పరమపదేశుఁ గని య • హా యీతఁడు మా
యప్ప యగుశౌరి యౌనని, యప్పరమేష్ఠియు నమ్ర • మగుహర్షమునన్. ౧౦౬.

కం. ముష్టాలులు వలగొని మది, మ్మురమగుభక్తి సాఁగి • మ్రొక్కుచు నటులే
క్రమ్మఱమ్రొక్కుచుఁబులకలు, గ్రమ్మ రహి న్నిటలతటుల • గతకరపుటుఁడై.

→* కందగీతి గర్భచంపకమాల. *←

ఘనఘనవిగ్రహా! వరద! • కాంచన చేల! కృపా విశాల! స
జ్జన వినుతా! హరీ! జలధి • శాయి! పరాత్పర! చక్రహస్త! పా
వన! వనజేక్షణా! భువన • పాలనఖేలన! పుణ్యశీల! లా
లన నిరతాశయా! ప్రవిమ • ల ద్యుతికౌస్తుభ రత్నభూషణా! ౧౦౮.

→* గర్భకందము. *←

ఘనవిగ్రహా! వరద! కాంచనచేల! కృపావిశాల! • సజ్జనవినుతా!
వనజేక్షణా! భువనపాలనఖేలన పుణ్యశీల • లాలననిరతా! ౧౦౯.

→* గర్భగీతము. *←

వరద! కాంచనచేల! కృ • పావిశాల! జలధిశాయి! పరాత్పర! • చక్రహస్త!
భువనపాలనఖేలన • పుణ్యశీల! ప్రవిమలద్యుతికౌస్తుభ • రత్నభూష! ౧౧౦.

కం. భక్తుల మత్ప్రముఖసుధా, భక్తుల కుత్తములఁ బాపి • పనిగొని కరుణా
యుక్తము లగుచూపుల సుఖ, యుక్తము లగునట్లుసేయు • దో హయవదనా! ౧౧౧.

శా. జ్ఞానానందమయా! స్ఫుటస్ఫటికభా • స్వద్విగ్రహా! సర్వవి
ద్యానిత్యప్రతిభావిశేషఘటనా • ధారా! బుధారాధితా
భానుప్రాకటతేజ! పుస్తకపుటీ • వ్యాఖ్యానముద్రాబ్జచ
క్రానూనాయతశస్తహస్త! హయకం • ఠా! శ్రీవికుంఠాలయా! ౧౧౨.

మ. అని యొన్నేని విధంబుల న్వినుతిసే • యంగాఁ దురంగాననుం
డనియెం బంకజనూతిఁ గాంచి వినుమ • య్యా! నీదు వేదంబులం
గొని యా సోమకనామకుండు సనఁ ద • త్కుక్షిన్ విభేదించి ప్రా
మినుకుల్ దెచ్చితి నీకొసంగ నివె పేఁ • ర్మిం గూర్మి వాటిల్లఁగన్. ౧౧౩.

కం. ఉపదేశ మ్మొందనిచదు, వుపయోగముఁ జెందదనుచు • నొమ్మనియావే
లుపుఁ బెద్దను హయవదనుం, డపు డుపదేశించె శ్రుతులు • సాంగంబులుగాన్. ౧౧౪.

చ. మఱియు మదీయమూర్తి మది • మాటికి మాటికె మాఁటి మంత్ర మే
మఱక జపించు మానిసి స • మగ్రకలానిభవాభిరాముఁడై
కొఱఁత యొకింత లేనిపలు • కుంబడికిం గడితంపుటిక్కయై
నెఱతన మేర్పడం జెలఁగు • నేర్పరులందుఁ బ్రధానగణ్యుఁడై. ౧౧౫.

కం. నా మను జపగిరి వరంబున, నామనుజపగరిమ సిరి మ • హామహిమంబున్
భూమహితప్రఖ్యాతియు, భూమహితప్రసితసుత స • మూహము నొదవున్. ౧౧౬.

ఉ. కావున నీవు నమ్మనుక దం • గం ద్రిజగన్నుత మైనదిన్ నన్
భావన చేయుచున్ మనుజ • పం బొనరింపుము దానఁ జేసి నా
నావిధభూరిబాలిభువ • నంబుల నంబుజగర్భ కౌశలం
బావహిలంగ సత్రముఁడ • వై సృజియించెదు సొంపు పెంపునన్. ౧౧౭.

కం. మహి నితరక్షేత్రంబుల, బహుకాలజపంబు వలనఁ • బడయం దగు నా
త్మహితార్థసిద్ధి యిచ్చట, ముహూర్తజపమాత్రమునఁ న • మోఘముగ నగున్.

కం. ఉపమా కాస్యక్షేత్ర, స్యవృథివ్యా మనుచు విబుధు • లనుకొనుటఁ జుమీ
యుపమాభిధ నీక్ష్యపదంబు ప్రసిద్ధిఁ గాంచె • నంభోజభవా. ౧౧౯

గీ. శ్రోణిపై ఫాల్గునంబున • శుక్లపక్ష, మందు నేకాదశిని నదీ • యావతాన
మగుట నాఁడిందు వేదపా • రాయణంబు, సేయఁ జేయింప విన ఘన • శ్రేయ మొదవు.

గీ. సింధుతీర మ్మైన యీ • క్షేత్రసీమ, బంధురాహ్వాయ ముగు సరో • వరము నందు
నాఁడు మజ్జన మాడునె • వ్వాఁడు వాఁడు, సంతరించిన కర్మన • స్యములు వాడు.

కం. ఈయశ్వగ్రీవాకృతి, నాయవతారములయందు • నరుల కుపాస్యం
బై యఖిలశ్రీవిద్యా, దాయకమై యఖిలసుఖని • దానంబు నగున్. ౧౨౨.

కం. అని యుపదేశపురస్కృతి, గను వేదము లొసఁగి తురగ • కంధరుఁ డరుగన్
వనజజుఁ డానంద మెదం, దనరం దనరమ్య మగుప • దంబున కరిగెన్. ౧౨౩.

## ఆ శ్వా సాం త ము.

కం. శ్రీరాఘవ! నతజనదు, ర్వారాఘవనప్రతాన • పావక! మునిరా
డ్డారాఘవనధరసమీ, రా! రాఘవ నటదమోఘ • రయవిశిఖౌఘా! ౧౨౪.

మ. మునిరాజక్రతురక్షణా! స్ఫుటసితాం • భోజాతపత్రేక్షణా!
వినతాభీష్టకృతిక్షణా! పరమధీ • విజ్ఞాన సంధుక్షణా!
ఘనసంగ్రామవిచక్షణా! సురముహుః • కల్యాణకృల్లక్షణా!
వినుతశ్రీకృతలక్షణా! ఖలమరు • ద్విద్వేషిసంశిక్షణా! ౧౨౫.

పృథ్వి. పురందరమణీగణస్ఫుటస • ముజ్జ్వలాంగప్రభా!
ధురంధరదిగంతదంతురిత • దోర్యశస్సౌరభా!
నిరంతరదయాభినందితవ • నేచరౌఘస్సభా!
మరందరసమంజువాఙ్మహిత • మైథిలీవల్లభా! ౧౨౬.

## గ ద్య ము.

ఇది శ్రీమద్రామనామపారాయణపరాయణాతిధన్య కౌండిన్యగోత్ర
పవిత్రదేవులపల్లికులపయఃపయోనిధికళానిధి తారామశాస్త్రి పౌత్ర
వేంకటకృష్ణశాస్త్రి పుత్ర తమ్మనాభిధానాంతర వేంకటకృష్ణ
శాస్త్రినామాగ్రజన్మ త్రిలింగదేశాగ్రజన్మ సుధీ
విధేయ సుబ్బరాయశాస్త్రి నామధేయ ప్రణీతం
బైన మహేంద్రవిజయం బను ప్రబంధంబు
నందు ద్వితీయాశ్వాసము.

శ్రీ సీ తా రా మా ర్ప ణ మ స్తు.



శ్రీ రామ.

# శ్రీ మహేంద్ర విజయము.

## తృతీయాశ్వాసము.




విద్వన్నుతకవితా
భావుకకౌండిన్యగోత్ర • భావితవరధీ
దేవులపల్ల్యన్వయకుల
దైవత యజపాత్ర దశర • థప్రభుపుత్రా. ౧.

గీ. అవధరింపుము శౌన • కాద్యఖిలమౌని, జాల మాజాలపాదరా • జన్యవాహ
నుని తపస్సిద్ధిపద్ధతి • విని వచించె, దనివితీరనిమది సూ • తుఁ గని వినీతి. ౨.

ఉ. ఓమహనీయబోధగరి • మోజ్జ్వలధీసముపేత సూత వా
ణీమహిళామణీరమణ • నిశ్చలభక్తితపస్సమాధియో
గామితనైష్ఠికస్థితి స • మగ్రముగా నిటు వింటి మింక నిం
దేమును లేమి సిద్ధిఁ గని • రేర్పడ నేర్పడర న్వచింపవే. 3.

కం. ఇందుఁ గలమహిమల విధం, బిందుగలన్మధురసుధర • హిందగునుడులన్
విందుము మాపీనుల కీ, విందు ముదంబునఁ గదింప • వే కడు వేడ్కన్. ౪.

చం. అన విని సూతుఁ డిట్లనియె • నమ్మునిముఖ్యుల నెల్లఁ జూచి యో
యనఘచరిత్రులార! వినఁ • డయ్య మదీయగురుప్రభావమున్
ఘన మగుమీకటాక్షమును • గల్గుటచే వచియింతుఁ గానిచో
ననువుగఁ జెప్పశక్యమగు • నా! ఖగనాథగిరిప్రభావముల్. ౫.

కం. అచ్చట మును తపముం బొరి, పొచ్చెము లే కదితికశ్య • పు లొనర్చి హరిన్
ముచ్చట దీరఁగ సుతునిఁగ, నిచ్చఁ గనిరి దాని తెఱఁగు • నెఱిఁగింతు నిటుల్ ౬.

సీ. దీక్షానిరూఢిజ్యో•తిష్టోమకర్తలౌ, యాయజూకుల కెద్ది • యాటపట్టు
న్యాయ్యపరిపాల•నాసక్తచిత్తులౌ, ధరణీశ్వరుల కెద్ది • తావలంబు
ధర్మవాణిజ్యత•త్పరవ్రాత్పరీతు లౌ, వణిగ్గ్రణుల కెద్ది • వాసగృహము
ద్విజసేవనాసక్త•విఖ్యాతిధన్యు లౌ, పాదజన్ముల కెద్ది • పట్టుఁగొమ్మ
తే.గీ. పరమశాంతతఁ బతిపాద•భక్తియుక్త, హృదయలౌ సాధ్వులకు నెద్ది•కుదురుఁబట్టు
దాని వర్ణింపఁ దరమె స•త్కర్మఫలసు, భోగసుకరంబు శ్రీస్వర్గ•పురవరంబు. ౭

కం. ఆపుర మమరావతి యన, గోపుర మనఁ గనకరత్న•గోపురశిఖర
శ్రీపరిచుంబితపంకజ, భూపట్టనహట్టఘట్ట•ముఖమై తనరున్. ౮

ఉ. కోరినకోర్కు లిచ్చు నఁట• గోవును జెట్టును తాయి మేలిబం
గారఁట నేలయెల్లఁ ద్విజ•గంబుల నప్పుర మగ్రగణ్యమై
పేరిమి గాంచి మించు నఁట • వేయివిధంబుల జాగరూకుఁడై
యారసి ప్రోచునాథుఁ డఁట • యచ్చటివారల భాగ్య మెట్టిదో. ౯

ఉ. పాయనిజవ్వనంబు గల•ప్రాయము సానలఁ దీర్చి యెవ్వరుం
జేయని వాఁడితూపు లను • జింగిరిమాంగిరిగాఁగ నెవ్వరు
న్నేయనివల్వ లప్పలను • నిప్పుల వండనివంటకంబులున్
మాయనికన్ను లన్నగరి•పోఁడుము లెంతయుఁ జెంతలై తగున్. ౧౦

ఉ. అప్పురి చొప్పుఁ జెప్పఁ దర•మా వివరింప నసాధ్యరీతిమై
యెప్పుడుఁ దా సుసాధ్యముగ• నే కనుపట్టు నభోమూర్తిగా
యెప్పుడుఁ దా సుభోగముగ• నే కనుపట్టు విమానరమ్యమై
యెప్పుడుఁ దా సుమానముగ• నే కనుపట్టు విచిత్రవైఖరిఁ. ౧౧

కం. వసువిసరప్రసితంబై, సుసిద్ధమహిమాఢ్యమై విశుంభత్సంతా
నసుమహితామోదంబై, యొసఁగెడి నచ్చోటి వాటి•కే కడ స్వస్సుల్. ౧౨

ఉ. ఇచ్చటి బ్రహ్మచర్యనియ•మైకధురంధరవర్తనంబు లా
యచ్చరపూవుఁబోండ్లఁ గల•యం దగునుంకువ లౌచు నెంతయున్
ముచ్చట దీర నందనస•ముద్భవభూరిఫలప్రదంబులై
మెచ్చుగ నచ్చటం బరిణ•మించుచు మించు సమంచితంబుగన్. ౧౩

సీ. అంశుమత్ఫలకు మ♦ధ్యంబు దధ్యముగ నే,తత్సామగాయ మో ♦ తరుణయజ్వ
సారంగివదనంబు ♦ సారంగలాంఛను, నెద్దేవ సేయు నో ♦ యాయజూక
చంద్రముఃకళనాభి ♦ చంద మింద్రోపల,స్యసమాన మో హవి♦ర్యాజివర్య
యష్టాపదగృహంబు ♦ నందె కదా యీత్రి,యామసుఖంచ మే ♦ యాహితాగ్ని
తే.గీ. యనుచు మందాకినీతీర♦మునను దాన,మున కుషఃకాలమునఁ గూడి♦కొనిన క్రొత్త
సోమయాజులు స్థాలికల్ ♦ద్రోమికొనుచు, నాత్మపరిభాషభాషింతు♦రచట నెపుడు.

మ. తనకే మున్నుగ మ్రొక్కె నూర్వసి వధూ♦త్తంసం బటం చొక్కఁడుం
దనకే కల్పఫలం బొసంగెఁ దొలుదొ♦ల్తన్ రంభ యం చొక్కఁడుం
దనకే మేనక మేన మున్నలఁదె గం♦ధంబంచు వే ఱొక్కఁడుం
దనియుం గర్మసురాళిలో నచట ధ♦న్యంమన్యభావంబునన్. ౧౫.

చ. ఎడనెడ వేల్పుసాను లెదు♦రేగి వరింపఁగఁ దద్గృహంబులన్
వడిఁ జొరఁబాఱఁ గొంక రట ♦ వాకిట జందెము లుద్ధృతోరులై
గొడుకుచు లన్న లున్నను స్వ♦కోన్నతి లోపల వేదపన్నముల్
నుడువుచుఁ దండ్రు లుండినను ♦ నూత్నసమాగతయజ్వ లచ్చటన్. ౧౬.

సీ. స్నానజపోపవా♦సశ్రమంబుల కోర్చి,తి మటంచు యజ్వ లొ♦ద్దికను వేఁడ
సంభారసన్నాహ♦సాహ్యం బొనర్చితి, మని కారయితలు మం♦తనముఁ బలుక
నూర కుండినవారిఁ♦ బ్రేరణం బొనరించి,తి మటంచుఁ బ్రేరకుల్ ♦దమినిఁ దెలుప
నౌను గాదనక మే ♦ మంగీకరించితి,మని యనుమోదకుల్ ♦ మనవు లనుప
తే.గీ. ద్రవ్యమును బట్టి కద సుకృ♦తంబు గాన, యాగభిక్షాప్రదాతల ♦ గాగ మేము
వలసినను మీకు బానిస ల్గ♦ల రటంచుఁ, బరిహసింతు రొకింత యచ్చరలు వారి.

సీ. స్వాశ్రితావనము సే♦యక యన్యులను బ్రోచు,భూవరు ల్సారరాని♦భువన మెద్ది
యుపకారవిముఖులై ♦ యపకారము లొనర్చు, మూర్ఖులు సారరాని♦భువన మెద్ది
పరగుణస్తుతికిఁ బా♦ల్పడక నిందలు సేయు, ముష్కరుల్ సారరాని♦భువన మెద్ది
స్వమతవిదూరులై♦పరమతాశ్రయు లైన, యవగుణుల్ సారరాని♦భువన మెద్ది
తే.గీ. త్యాగభోగంబులకుఁ గాక♦ధనముఁ గూర్చి. పానఁగులుబ్ధులు సారరాని♦భువన మెద్ది
యద్ది దన కుద్ది గనక ని♦త్యానపాయి, మోదభవనము శ్రీస్వర్గ ♦ భువన మొప్పు.

మ. నిజమాతాపితృభక్తిశూన్యులు స్వపత్నీత్యాగులుక్ దేవతా
భజనానక్తివిహీను లాత్మవిభువిశ్వాసానభిజ్ఞుల్ స్వకీ
యజనద్రోహులు మిత్రఘాతుకు లసత్యాలాపకు ల్సేరరా
నిజగం బాత్రిదివంబు దన్మహిమ వర్ణింపంగ సామాన్యమే. ౧౯.

సీ. విశ్వాసపరుల వీథివీథిసౌధంబులు, వీరిఁ గూరిమిఁ జూచు వేల్పు లేదు
కన్యకాప్రదుల విక్కడిచంద్రశాలికల్, వీరి మన్నించుటరు విబుధు లెల్ల
సంగరోద్ధతుల వీచాయవిమానముల్, వీరి నచ్చరలు సేవింతు రెలమి
సత్కావ్యకరుల వీపరణిఁప్రాసాదముల్, వీరి గురుండు భావించు మైత్రి

తే.గీ. నన్నదాతల వీచక్కిహర్మ్యతతులు, వీరి నిందఱుఁ గడుఁ గార వింతు రనుచు
దినదినము వచ్చు నవకర్మదేవతలకుఁ, దెలుపు నచ్చోటి పరిపాటిదివిజకోటి.

ఉ. అవ్వరి నొప్పు నప్పరిగ లందుల విందుల విందు లంచుఁ బొం
దుప్పతిలంగ నెక్కడిన మెుక్కొకరింటఁగ వేల్పుఁ గన్నియల్
దప్పక యాడుచో దరిసుధాకరు నుజ్జ్వలగూటిగిండి దం
డప్ప లిదే యటంచుఁ గదియం జని తే గమకింతు రంతయుఁన్. ౨౦.

క. అమృతంబును మందాకిని,యమృతంబునుఁ గల్పతరుసుమానవసారం
బమరగవిషయఃపూరం, బమరఁ జతుర్ముఖుఁడె యిట్టివనిరొమ్నఁ దగుక్. ౨౧.

సీ. గంధర్వకరతలాఘాతపుష్కరమృదం,గధిమింధిమిస్వనక్రమము లెసఁగఁ
గిన్నరీమధురసంగీతగాంధారనా,మగ్రామతానసంపద లెసంగ
విద్యాధరీపాణివీణాకలక్వాణ,మూర్ఛనాగమకవిస్ఫూర్తు లెసఁగ
నప్సరస్సుకమలాస్యాలాస్యవిభ్రము,భ్రమదంఘ్రినూపురారవము లెసఁగ

తే.గీ. నిత్యకైలాసవైకుంఠసత్యలోక,నియతగమనాగమనకృత్యనిరతసురసి
మానఘంటానినాదగుంభనము లెసఁగ, వీనులకు విందు గావించు వేల్పుప్రోలు.

మ. సరిగా నప్పురిఁ గానవచ్చు సిరిఁ గాంతునూ్ఫర్తిఁ గీర్తింపఁగా
సురగాధ్యక్షుఁడు దక్షుఁ డౌనె యమితాస్యుండయ్యు శేషున్నచో
నిర వొందం గనెనే యతండు త్రిదివంబేయూరి కేత్రోవ య
గ్గురుఁ డేకాననుఁ దయ్యు నచ్చట మెలంగుం గాన నర్హుండగుక్. ౨౨.

ఉ. ఆపుర మేలు నాత్మగురు♦నానతి దప్పఁడు సౌమనస్యముం
జూపును రేపు మాపు మను♦చుక్ బుధసంతతి నెంతయుక్ సుధ
ర్మోపగతిం దగుక్ సదయు♦నోచితవర్తనకీర్తనీయుఁ డౌ
నా! పరికింపఁగా నితఁడె ♦ రాజన నింద్రుఁ డతంద్రవైఖరిక్. ౨౫.

ఉ. ఆతని భాగ్యభోగసము♦దగ్రతఁ దెల్పఁగ నేల సాటిగా
నాతఁడె నూటిగాఁ దెలుప♦నాఁ దదుపేతుల కెల్ల ధైర్యశౌ
ర్యాతిశయంబు దెల్పవలె♦నా కులశైలమదాపనోదన
ఖ్యాతతరాపదానము శ♦తాధ్వరకర్తృత దెల్పుచుండఁగాక్. ౨౬.

చ. అతఁ డొకనాఁడు లీల చెలు♦వారఁగ వారగజేంద్రగామినుల్
చతురతదండలాస్యమును ♦ జక్కణిఁ జేరణిఁ గుండలిక్ సమం
చితగతిఁ జూపఁగా నెలమిఁ ♦ జిత్రశిఖండిజవహ్నిముఖ్యది
క్పతితతితో రసైకవశ♦భావమునం దిలకించుచున్నెడక్. ౨౭.

కం. నందనవనపవనము రా, నందనయము నలరుఁ దావి ♦ యపు డొక తీరై
నందన డెందము కుతుకము, నందఁగ నింద్రుఁ డటుచ♦నం దలఁ జొరవక్. ౨౮.

చం. కెలఁకుల నున్నవారిఁ బరి♦కించి గురుం గని యేమి! సామి యిం
దలరువినోద మిప్పటికి ♦ నాఁపు దమే మననందనంబు లో
పలిపవనం బపూర్వమగు♦వాసన దోఁగుచు వీచెఁ గాన నం
దలి వనపాలదోహదవి♦ధానచమత్కృతిఁ జూచి వత్తమే. ౨౯.

చం. ఇట నమరేంద్రుఁ డిట్లు వచి♦యించుటకై గురువంకఁ జూచునం
తట నట నాగవాసమున ♦ నాయికురా లొనరించు సన్న చేఁ
దటుకునఁ దాళశబ్దము మృ♦దంగరవంబు నుపాంగనాదము
స్ఫుటమయి తోఁప వారజికు♦ముంగల నర్తకి నిల్చె నొద్దికక్. ౩౦.

సీ. పడసినబహుమాన♦పాత్రంబుతోనె పాణులు మోడ్చి విభుపాద♦ములకు మ్రొక్కి
శ్రుతికిఁ గూర్చినవీణ ♦ జతనంబుగాఁ బోటి, చే నుంచి యమగుల♦జేరి మ్రొక్కి
తాళంపుఁ జిప్పలు ♦ గీలుఁగొల్పిన నీవి, తోఁ జేగి నమ్రత ♦ దోఁప మ్రొక్కి
నాయికురాలి చెం ♦ తను నిల్చి యొక్కింత, నానతోఁ బదపీఠ ♦ మాని మ్రొక్కి

తే.గీ. వెనుక నడకల మార్దంగి•కుని పిలిండి
దనుక నెఱతన మొయ్యార•మును హొరంగు
మురిపెమును మీఱ నేగి య•పూర్వపాత్ర
మందఱు గ్రహించి యచ్చర•లరుగునంత. 3౧.

గీ. వైజయంతీవికానభా•స్వరతఁ గనుట, శ్రీనివాసవిలాసంబు • చేఁ జెలంగు
వైజయంతంబుడిగివచ్చి•యాజయంతుఁ, గలసియింద్రుండు మొగసాల•కడవసింప.

మ. గరుడుల్ సాధ్యులు సిద్ధులున్ వసువులున్ • గంధర్వులుం జారణుల్
దురగాస్యుల్ మొదలైనవ్యోమచరసం • దోహంబు సోత్సాహమై
పరివేష్టింపఁగఁ బావకప్రముఖది • క్పాలావళు ల్తోడ రా
నరుగం జొచ్చె వియచ్చరేంద్రుఁ డట్లైకె • యైరావతారూఢుఁడై. 33.

కం. అరుగు నెడఁ దిరుగ నూతన, పరిమళపరిమిళితమైన • పవనము వడిగా
నరుదెంచె నిజ యుపాయన, మరసి గ్రహిం పుమని తెలుపు • నట్టు లతనికిఁ.

గీ. అపుడు దేవర్షి బ్రహ్మర్షి • లభ్రగతులఁ, గలసి యభ్రమువల్లభ • గతుని నతని
బలసి ప్రాస్థానికస్వస్తి•వాదముఖర, ముఖరములతోడ రాఁజూచి•మురియు చరిగె.

గీ. అటుల మందాకినీసరి • త్తటముఁ దరిసి, యచట నెక్కింత యిచ్ఛావి•హారకలన
వలన వలనగు సంతృప్తిఁ•బడసి మగలఁ, దగలి యుద్యానవనిఁ జూడ•నరుగు వేళ

సీ. సహజరోమాళల • జ్వాలాకలాపంబు, పగిది జటాకలా • పంబు దనర
నియతభస్మీకార • నిపుణత్వ మెఱఁగించు, భాతి సర్వాంగీణ • భస్మ మమర
స్వాభావికావిమ • ర్శప్రకర్షముఁ జూపు, రీతినిర్గతశ్మశ్రు దృ • క్పాత మొప్పఁ
బ్రకృతిసంలబ్ధశీ • ఘ్రప్రసాదముఁ దెల్పు, మాడ్కిని స్ఫటికాక్ష • మాల గ్రాలఁ
తే.గీ. బరమమాహేశ్వరుండుదు• ర్వాసుఁడప్పు, డెందునుండియొయెచటికో•నరుగుచుండి
పిడుగు పడినట్టుగా నుట్టి•పడియె నెదుట, నమరసమితికి నత్యాహి•తము ఘటిల్ల.

ఉ. వచ్చిన పారికాంక్షి సుర•వల్లభుఁ డల్లనఁ జూడఁ డన్నచో
నచ్చపుభక్తి స్వాగతము • నారయనే పరిచర్య సేయనే
హెచ్చపుఁ బంటపల్లకుఁ బ్ర•భుత్వము గల్గునటన్న మాత్రనే
హెచ్చు మదంబు ముజ్జగము • లేలెడివానికిఁ జెప్ప నేటికిన్. 3౮.

మ. ప్రకృతిక్రోధనుఁ డయ్యు నింతటికి రౌద్రస్ఫూర్తిఁ జూపింప నే
టి కటంచున్ ముని యెంచెనో! దివిజరాణ్ణిర్లక్ష్యభావంబుఁ జం
ద్రకళాశేఖరదివ్యమందిరవపుర్ధ్యానైకనిష్ఠాప్తి నిం
చుక యేనిం బరికింపఁడో కరటిసంస్థున్ వాసవున్ దగ్గరన్. ౩౯.

కం. ఆసుత్రామున కటుదు, ర్వాసుం డతిశీఘ్రకోపరసపరవశతా
భ్యాసభవశాపఘటనా, వ్యాసవచశ్చక్రమవిలాసుఁ డాసన్నుండై. ౪౦.

మ. ఒకవిద్యాధరకన్యకామణి తపోయుక్తిం దుషారాద్రిపు
త్రిక మెప్పించుట నామె సత్కృపఁ బ్రసాదింపన్ సువర్ణాబ్జదా
మకముం దోయిటఁ బూని తెచ్చికొనుచో మార్గంబునం దానుదా
సి సుమాకీ యిడుమాకు దీనికన నిచ్చెన్ శాపభీతాత్మయై. ౪౧.

కం. దానిఁ గొనివచ్చుపథమునం, దానిర్జరనేత వానికపు డెదురుపడం
దా నిడ శిరమునఁ బూనక, దానిఁ గరికుంభమున నరం బంతండును విడిచెన్. ౪౨.

కం. పదిగాన నదియునుందన, మదిఁ గాఁక కరము కరముపస్తకసీమన్
గదియించి త్రిప్పి చాలం, జదిపెం బొందమ్మిసరముఁ జిద్రుపలు గాఁగన్. ౪౩.

శా. ఆనిర్లక్ష్యమహాంధభావనికి మోహవ్యగ్రదుర్నీతత్వముం
దానే కన్గొనుటం గనుంగొనుట నిత్యక్రోధుఁ డత్యాగ్రహా
నూనభ్రూకుటి దుర్నిరీక్ష్యవికటాస్యం డైహితాచ్ఛిత్కృతి
స్వానోన్మిశ్రముగా మునీంద్రుఁడు కరద్వంద్వంబుఁ దాటించుచున్. ౪౪.

కం. స్వాలదలకరము నోలుకం, దిలకించెం గాని యింద్రు నియమప్రవృత్తిం
బలజాతి వడ నీకుండఁగ, కలవడియె శరణ్య మగుచు నయ్యాపదకున్. ౪౫.

శా. ఏరా! యోరిదురాత్మ మమ్మెఱుఁగవో యీకావరం బేలరా!
గౌరీదివ్యవరప్రసాదమహిమాంకం బస్మదానీత మీ
నీరేజాతసరంబు దీని నవమానింపం దెల్లొప్పెరా!
స్వారాజ్యప్రభుతామదంబునఁ గదా ప్రాపించె నీకీ యయాల్. ౪౬.

గీ. ఈ వృథావలేపమున కెల్లహేతు వైన, కలిమి శాత్రవులను జేరఁ గాతమనుచుఁ
బుట్టుదిట్టుల దిట్టయై నట్టితపసి, యుపశమింపనికినుక లేఖపు శపించె. ౪౭.

మం. అనుచుం బిట్టుగఁ దిట్టఁగా మఘవుఁ డత్యంతంబు భీతిన్ గుహా
లునఁ జౌదంతిని డిగ్గి తచ్చరణము • ల్మూర్ధంబు సోఁకంగ మ్రొ
క్కి నితాంతార్తి క్షమింపు మన్న నతఁడుం • క్షిప్రప్రసాదుండుఁగా
వున గోవిందుఁడె రక్షకుం డనుచు సేవ్యుం దెల్పి స్వేచ్ఛం జనెన్. ౪౯.

కం. అటు లాముని పటలాగ్రణి, చటులాక్షరరూక్షఫణితి • శాపాలాపా
ర్భటులాననమునఁ బెనఁగొన, నటు లాహా యనఁగఁ జనఁగ • సంక్రందనుఁడున్.

కం. శాపంబు నొంది పశ్చాత్తాపంబునఁ గుంది నిందితము లగు నార్తా
లాపంబుల నపరాధకలాపంబుల నిష్క్రియుం దలంపఁ దొడంగెన్. ౫౦.

గీ. వింతవలపున కంతగంభీరగుణము, విడిచి యరసికుగతి రక్తిఁ బెల్లి గొలుపు
వేళఁ గొలువట్లు చాలించి వెకలితనము, గలుగు టిబ్బంగిఁ గానుంట వలన నేమొ.

సీ. పయనంబు వెడలుచోఁ • బవమాన మెదురౌట, దుర్నిమిత్తం బనిఁ దోఁప దయ్యె
వాహనంబులు లేక • బ్రహ్మర్షిముఖ్యులు, దోడరాఁ దగదని • తోఁప దయ్యె
మాహేశ్వరుండైన • మౌని దౌదవ్వులఁ, బోఁప నప్రమత్తఁ జూపఁ • దోఁప దయ్యె
గౌరీప్రసాదరూక్షప్రయోజమాల కం, బోయి నద్దుకొనంగఁ • దోఁప దయ్యె
నేమి సేయుదు దివ్యపరీమళాఖ్య, బడిశమునఁ బడి శమగుణంబు దుంగ వడిఁ
జిత్తమీనంబు చిక్కులఁ • జిక్కె నకట, దైవనిర్ణయ మెవ్వారు దాఁటువారు ౫౨.

మ. మునిగాణ్ముఖ్యుని శక్తి మున్నెఱుఁగనో • ముక్కంటి యూదంటనై
యనసూయాసతియందు నత్రికి సుతుం • డై చెల్ల వాలింపనో
జనవన్క్రోధనుఁ డీతపోధనుఁడు దుస్సాధ్యప్రభావాఢ్యుఁ డం
చని విన్నాఁడను గాను నాతెలివి యేమైపోయెనో యక్కటా. ౫౩.

మ. అని చింతించుచు నింటికై శమితతూర్యస్వానుఁడై దీనుఁడై
చనుచో నేమిర! సామి! రక్షక! రమేశా! యంచు ఖేదంబుతో
వెను వెంటం దెఱగంటిదంటలును సోద్వేగంబుతో నేగ రా
క్కనిమేషంబున నిట్టిపాట్లనుచుఁ గింకర్తవ్యతామూఢులై. ౫౪.

కం. ఎచ్చటి యరదం బచ్చట, నెచ్చటి ద్విరదంబు వచట • నెచ్చటి తురగం
బచ్చట మఱి యెచ్చటి సుర, లచ్చటగా విచ్చి చొచ్చి • రాత్మాలయముల్. ౫౫

శా. ఈరీతి న్వతమన్యుఁ డన్యముఖము ◆ ల్వీక్షింపఁ గాలేక స్వా
గారం బందున గారవం బుడుగ సిం◆గారంబు లే కొక్కఁడున్
దారాపత్యనిజాంఘ్రిభృత్యులును జెం◆తం జేరఁ జింతాకులా
ధీరస్వాంతముతోడఁ జేర్కొనక మం◆దీభూతుఁడై యున్నడన్. ౪౬.

గం. అణఁకువతోడ నెప్పటి యుం◆దంతము నప్పుడె విన్నవింప ను
ల్బణతరనీతిశాలి యగు◆భార్గవు పంపున గూఢవృత్తిఁ ద
త్ప్రణిధులు నాకలోకమున◆వర్తిలు వా రటు లేగి రాక్షసా
గ్రణులు వినంగ నిట్లు బలిఁ◆ గాంచి వచించిరి శుక్రు సన్నిధిన్. ౪౭.

కం. దేవా! దేవాధీశ్వరు, కావరమున కావరముని◆గణ్యుఁడు శైవాం
శావిర్భావుఁడు లసదను,భావుఁడు దుర్వాసుఁ డలిగి ◆ వడి శపియించెన్. ౪౮.

కం. ఆశాపవిధముఁ దెలిపెద, మాశాపతిసేవ్యతాభ◆వాతిశయమదా
వేశాపశదా యోద్వేశా పరులను భజించు◆ నిఁక నీదు సిరుల్. ౪౯.

చం. అని శపియింప శక్రుఁడు ప◆దానతుఁడై క్షమియింపు మన్నచో
విని విననట్టు శాపవిని◆వృత్తి యొనర్పఁగ లేదు గాని గొ
బ్బున హరియే కలం డనుచు◆ బోయె నతం డెటకేనియో గృహం
బున కరిగె న్విషాదమున◆ మున్గుచు నీతఁ డపేతమోదుఁడై. ౫౦.

కం. అని చారు లివ్విధంబుగ, వినిపించిరొ లేదొ గాని ◆ వికవిక బోడ్తో
డనుమించెఁ గహకహార్భటి, యనుగతమై రాక్షసాట్ట◆హాసము తోడన్. ౫౧.

శా. ఎట్టెట్టా మునివంచకోడి కడక◆య్యాశాపరాకాయుఁడై
తిట్టన్ దిట్ట యనం బ్రసిద్ధుఁడగు న◆ద్దివ్యర్షి వెంచేసెనే
శట్టా యాతని గారవింపఁడె త్రిలో◆కస్వామ్య గర్వాంధుఁడై
గుట్టల్గొట్టెడు వెట్టివాఁడు మునియుం◆ గ్రోధోగ్రుఁడై తిట్టెనే. ౫౨.

ఉ. మేలు భళీ బలిం బలిమి ◆ మించినవారల వీరులం ద్రిలో
కీలసమానమానఘన◆కీర్తివిశాలుర దానశీలురం
బోలఁగఁ జూచినారమె బుం◆భుప్రభుసంపదఁ బెంప దక్షు లే
మాలఁగ రారు గల్గినబుం◆భుక్షుని కాపులె గాక శత్రులే. ౫౩.

కం. వారలకు మనము మనరుణ్, వారలుఁ బరుల మని యెల్ల • వారికిఁ దెల్లం
బారాజు వైభవము మన, యీరాజుం జేర నిర్ణ • యించెన్ విధియుక్. ౬౪.

కం. ఇది విమతులపై కెత్తుట, కద నని కదననియమజ్ఞుఁ • డగు భృగుజుఁడు గ
ల్పించఁగన్ బలిపీఠముపైఁ, గదలన్ గద లందికొనియెఁ • గద తద్భలముల్. ౬౫.

శా. అంతం దంతుర మయ్యెఁ దేజమున నం • యాస్థానగేహాజిరో
పాంతం బెంతయుఁ గుంతచాపపరిఘ • ప్రాసాసిముఖ్యాయుధో
ద్యాంతాత్యంతఘనస్ఫులింగరుచిసం • తానంబుతోఁ దచ్చమూ
కాంతానంతపరిష్క్రియాగణమణీ • కాంతుల్ ప్రసారింపఁగన్. ౬౬.

కం. నగరి మొగసాల నపు డొ,న్నగరము నిస్సాణనిక్వ • ణంబు చెలంగె
న్నగరిపుఁడు వసించెడు న,న్నగరి పయింబడి త్రస్త • మని తెలుపుమనన్. ౬౭.

శా. ఆసన్నాహముఁ జూచి యబ్బలియు దృ • ప్యత్సైన్యజయోద్ధాళితో
న్మానవ్యక్తబలాఢ్యులార! వినుఁడీ • యుష్మద్భుజావిక్రమో
ల్లాసం బెల్ల నిగూఢవృత్తిగఁ బరు • ల్బాధింప లేకుండుట
న్యాసం బొప్పఁగ నేఁగుటిప్పుడు చితో • పాయంబుగాఁ జొప్పడున్.

గీ. అతఁడు శాపోపహతుఁ డయ్యె • నతని శాప,ము నరునపసాననుదియని • మునిప దింపఁ
డయ్యెనిఁక నేమి మనకు జ • యంబు సిద్ధ,మంచు నెంచంగ నలదు త • థ్యంబు గాఁగ

కం. ఏమన నీమనసేనా, సామగ్రికి దేవసైన్య • సామగ్రి సమం
బై మోహరింప కసదగు,నే మతి భయమేల పటంచు • నేమతి యున్నే. ౭౦.

కం. హాసం దడిసియని వాఁడా, హాని స్మెప్పం మవాఁడు • మన కెపు డేమా
గా నేరము సురపతి యనఁ, గా నేరము బుద్ధిపూర్వ • క మెయ్య హరికిన్. ౭౧.

కం. దేవీప్రసాదలబ్ధం, బో వాచంయమియ పెచ్చెం • నో యెచ్చటిదో
పూవుం దండ తెఱం గా,దేవేంద్రుం డెఱుఁగఁ డతనిం • దే యాతప్పున్. ౭౨.

గీ. ఒదవు నల్పాపరాధున • కొక్క వేళ, నధికదండంబు నొకవేళ • నల్పదండ
మొదవు నధికాపరాధుని • కదియు నిదియు,ననుభవముపట్ల నొదవుయ • థార్హముగనె

గీ. కాన శాపఫలం బంత • కట్టి కుడుప, దెంచ శాపవిముక్తి వం • చించె మునియు
హరియె కలఁడంచు వజ్రి కాం • హరియు ప్రాప,కుండుగావునఁ దిరిఁ గొ • ల్పంగనుండు టెట్లు.

సీ. అభిసారికావృత్తి నరిగి వచ్చెడువేల్పు, మించుఁబోఁడుల నడ్డగించి కదిసి
ప్రోషితాయాతదంపత్యులవిమానము లూరు, సేరకుండఁగ లాగి చెలఁగ ద్రోచి
యపుడె క్రొత్తగ మింటికై యేగుకర్మదేవతల బిట్టుగ వెట్టిపనులఁ జొనిపి
యింద్రుఁ జూడఁగవచ్చు నితరలోకర్షుల, నట్టిట్టుఁ బోనీక పట్టి నిలిపి

తే.గీ. యొరులు సారలేని గడితంపు పరిఖ యగుచు
వెలయు మిన్నేటి నీరెల్ల వెలితిఁ బాఱఁ
గూల మందంపగనుమలు గొట్టి కూల్చి
ముట్టడించిరి దితిజు లప్పట్టనంబు. ౭౫.

ఉ. ఆపురిచుట్టు గొంద లపు డావల నీవలఁ ద్రోవఁ బోవగాఁ
గుప్పలు గూడి రక్కసులు గొబ్బున నాత్తపటీకుటీతటిం
జొప్పడుచప్పరంబులఁ బశుప్రకరంబుల బోయ లోయనం
దప్పక రాటకొక్కనిగ ద్రాటఁ బిగించిరి ఖేటకోటులన్. ౭౬.

మ. వరుసం దానవు లన్నిలింపవరు సంబంధంబుచే నొప్పన
మ్మరుదారామకుజంబులం దమరుదామక్షోమభూషానులే
పసాదుల్మణిగోహయద్విపరసావాసాదులున్ వమ్ము చే
సిరి వీఁకన్ ఖలకోటి కన్యసిరి వీక్షింపంగఁ జూపోపునే. ౭౭.

సీ. మీఁదిమేడలపై గమించునిర్జరలోక, పల్లవుల్ పైనుండి పైకిఁ బోవఁ
గ్రిందిమిద్దెలఁ బాన్పు లందున్న గణహతా, గతరాజు లాయుధప్రతతి వెదుకఁ
బెరటిపంచలలో జపించుసోమాసులు. దిడ్డిగంతల ద్రోవఁ దెఱచి పోవ
లోనిసావళ్లఁ బొర్లుచు నున్నయితరపుణ్యులమూఁక లిఱుకుసందులను దూఱఁ

తే.గీ. గవాక్షవార్భటిఁ జెలరేఁగి గములుగట్టి, తెగువ నింటింటికొక్క కొందఱుగఁ గడంగి
రక్కసులకూటు వొక్కట నుక్కు మిగిలి, సురనగరి వేళవాటంబు సొచ్చినపుడు.

మ. ఇద మిత్థమ్మని యించు కేని మది నూహింపంగ రాకుండుటం
ద్రిదివౌకఃప్రకరంబు లేమి యొవరేరీ యేల యీగోల య
ల్లదె యచ్చో నిదె యిందెపో యనుచు యాతాయాత వీతోత్తరీ
యదశం ద్రొట్టిలఁ దల్లడిల్లె నగరం బాబాల గోపాలమున్. ౭౮.

శా. ఆకోలాహల మాలకించి దివిజా•ధ్యక్షుండు రక్షోగణో
ద్రేకం బౌ నిది యంచు నెంచి యనలా•ర్కప్రఖ్యదిక్పాలకా
నీకంబుం బిలిపించి యప్పుడె సమి•న్నిస్సాణ ఘోషార్భటి
న్నాకానీకిను లెల్లఁ గూడుకొను సం•న్నాహంబు సేయుండనన్. ౯౦

సీ. సోఁకినచో నెల్ల•సురసురఁ దెగ మాడ్చు, వహ్ని యుద్యత్ప్రతా•పమున నెగడె
సకలజీవులకు నం•తకవృత్తిభయదుఁడౌ, యముఁడు మృత్యుసమేతుఁ•డగుచు నడచెఁ
బచ్చిరక్తముఁ ద్రావు•పలలాశనుండైన, నైఋతుం డతిభీష•ణతఁ గడంగెఁ
దనవారి బలిమిచే•తనె గుభాలున ముంచు, పాశి వాహినుల వెం•బడిగ నెదిరె
జగము దూలింపఁగల ప్రభం•జనుఁడు రేఁగె, భూరిసారంబు దనరుకు•బేరుఁ డేగెఁ
గంటమంటలఁ జిలుకు ము•క్కంటి గదలె, వారి వెనుకొని గీర్వాణ•వర్యుఁ దరిగె.

కం. అయ్యభియోగము గని తొలి, దయ్యపుజోదులును బాహు•దర్ప మెలర్పం
జయ్యనఁ బిలుతిబియక గడి, కయ్యమునకుఁ గాలు ద్రవ్వి•కవిసిరి కడిమిన్.

గీ. వ్యోమచరు లొట దైవత•యోధు లపుడు, చదలున నెయ్యుండి పోరికి•సంభ్రమింపఁ
గామచరు లొట రాక్షస•గ్రామణులును, బలసి యుండిరి మింట నే•ప్రతిఘటించి.

శా. నేమిస్వానవిహీనమై బలయుగీ•నిర్యత్ప్రజశ్యానమై
వ్యోమస్థప్రచరద్విమానరహితం•బై నారదారబ్ధగా
నామోదభ్రమణాదివిభ్రమవిశే•షాపేతమై వారిసం
గ్రామారంభము చూడఁ జొప్పడె నపూ•ర్వప్రక్రియావక్రమై. ౯౪.

మ. సరిగా నయ్యిరువాఁగు జోదులు యశ•చ్ఛన్ దాసి వీఁకం బర
స్పరశస్త్రాస్త్రనిపాతనంబులను లే•శం బైన లో గాసి చెం
దరు బింకంబుల వాసి డిందరు ప్రం•సిద్ధప్రోద్ధతిం జేసి క్రం
దరు పొంకంబులఁ బాసి కుందరు రణో•ద్యత్సాహసోత్సాహులై. ౯౫.

ఉ. ఆసమరాంగణంబున జ•యాపజయంబులు రెంటిలోన దే
వాసురు లెద్ది యెవ్వరికి • నౌను తెలుంగఁగరాక యుండ నా
సాసలఁ జేసి గెల్పునకు•నై తగఁ బోర నదృశ్యరూపుఁడై
వాసవుఁ డున్నతాపునకు • వచ్చి గురుండు వచించె నిమ్మెయిన్. ౯౬.

ఉ. ఓవిబుధాగ్రణీ! యెఱుఁగవో! మునిశాప మమోఘ మాటచే
భావిజయంబులో రిపులఁ బొలగు నీసిరి యంచు వేగమే
యావల శ్రీవధూవరుకటాక్షమున న్నినుఁ జేరునంచు నం
గావున సేన నిట్లువిరఁగా వెతగాఁటియువెట్ట నేటికిన్. ౯౭.

శా. ఘోరం బోర నమర్త్యసేనలకు గెల్పుం జావునన్ లేమిచే
రారా పాకకటిమాత్ర దోఁచు నతిమాత్రక్రూరదుర్వారదు
ష్ప్రారంభు ల్దితిజు ల్మడంగియును వీరస్వర్గముం జెంది యా
త్మారాశత్వము వాయ చేమి ఫలమీ వ్యర్థప్రయాసంబునన్. ౯౮.

ఉ. కావున నిప్పు డెందయినఁ గన్పడకుండఁ డాఁగి యుండి నీ
వేవిధినైనఁ గాని విను నే భజియించుచు నుండు మాతఁడుం
దైవతకోటిపై నెనరు దప్పఁడు తప్పడు గంటఁ ద్రోచు దై
త్యావళి ప్రమందఁ జేయు నని యంప గుతింగినచందమే కదా. ౯౯.

కం. అని తనగురుఁ డుపదేశించిన విని యనిమిషపురంబు శ్రీహరిఁ గొలువం
జని యెన్ మందరశిఖరికి, జనియించిన ధృతి స్వపక్షసంఘుఁ డగుచున్. ౧౦౦.

శా. అంతన్ దానవసైన్యనాయకులు ప్రత్యర్థు ల్పలాయించరై
యంతర్ధానము నొంద నెం దరిగిరో యంచు న్విగూహింపకే
కొంతే మే లిదె చాలదే విముఖులై యింద్రాదిక ల్పొంది ని
శ్చింతం దత్పుర మాక్రమింపఁ గలిగెన్ శ్రీశంభుశుంభత్కృపన్. ౧౦౧.

చం. మన బలిరాజుకోర్తుల కమర్త్యులె నిల్వక పాఱి రన్నరో
మనుజు లనంగ నెంతపని మానుషభుక్తతి నాతఁ డేలుఁ బే
ర్కొని గణుతింప నేటి కురగు ల్పరుగు ల్గప వాని దృష్టికిం
బనివడి యుజ్జగంబు లిటపై నతఁ డొక్కఁడె ప్రోచుఁ జక్కఁగన్. ౧౦౨.

కం. అని సంరంభవిజృంభణమున స్వర్గపురప్రవేశమునకు ముహూర్తం
బును శుక్రుం డిడి యెదుటం, గనుపట్టం బట్టనాట్టగతులై రసురుల్. ౧౦౩.

గీ. పుట్టినది గోలె నసురసమూహమునకు, నాత్మల సురాలయప్రవేశాభిలాష
కలదు గావున నది యబ్బెఁ గాని యప్పు, డాసవామోద మింతైన నబ్బదయ్యె.

గీ. వేశవాటమందు విఱిపడి పూర్వదే, వభటులు చటులవృత్తితోఁ బ్ర
వేశ మొనరఁ జేసి వేల్పుసానుల మదా, వేశగరిమఁ బట్టి వెదకు నపుడు. ౧౦౫.

సీ. ముద్దుగుమ్మలు మేళమున కేగ నింటికా, వలి యుంచు ముసలిపాపలును లేరు
గోవాండ్రతో సందుగొందుల గుసగుసల్, సలిపెడి తాపికత్తెలును లేరు
కన్నుసన్నల వీథిగడపల లేబాజుం, గులనాన కొల్పుకస్త్రీలును లేరు
సపరింపఁదగు పసు ల్పమకూర్చు నాడిగం, బుఁటకుఁ జేరిపబానిసలును లేరు
సాను లెటుపోయిరో వాండ్రతో నెవ్వండ్రు, దరలిరనితోఁచుఁ దెలిసినతలుపు లెల్లఁ
దెలిచినట్లనె యుండె సంద్దిర యటంచు, మిగుల విసివిరి గక్కసిమిండ లపుడు.

సీ. పిల్లి పొర్లించు త్రావినపాలకుండ నా, నమృతకుండము శూన్యమై తనర్చె
నూనె చట్టుపునేలనయినాఁగ సురగవి, పొదుఁగు పయోహీనముగను దోఁచెఁ
జెలఁది గూండ్లిడిన ప్రమోఁకులు వోలెఁ గల్పవృ, క్షములు నిష్ఫలములై కాన నయ్యె
మందు వేసవినాఁటి మడుఁగునా మిన్నేటి, యస లెండిబీఁటలై యడుగుఁ జూపె
నమర నమరావతీపట్టనమును విడిచి, సకల విబుధవ్రజ బుతో పథ్పథమునఁ
బొదలునలరాజువలసలు పోవఁ దజేని, యసురవిసరంబు విఱిపడి యాక్రమింప.

సీ. నందనోద్యానంబు నందనోఁకహసమూహంబు బవకేశిభావంబుఁ గనుట
మందుగా సుందిర ముంగు రాజిలు తేజు, లంతేని జపశూన్యవృత్తి గనుట
నాలానబద్ధశుండాలానవద్యసం, ఘాత ముద్వాంత వైఖరిని గనుటఁ
గామయానతిమించు వ్యోమయానంబులు, హీనసామర్థ్యకహాని గనుట
సరసి నిరసించుకొని రాత్మలందు వట్టి, గొడ్డుతాకట్టు విసువఁ గైకొనఁగ వేదు
కొంగిలింపంగఁబోయిన మంగలంబు, దొరకెనను మాడ్కి నంచు దైత్యులు విరక్తి.

చ. ఉతిసుతకోటు లిప్పగిది దివ్యులపట్టణ మాక్రమించి య
ప్రతిహత రీతి ఖ్యాతిగల రాజగృహంబున రాజు నాశ్యస
ప్రుత పగుమంత్రిగేహముల మంత్రులు జోదుల యిండ్ల జోదు లం
చితగతిఁ దత్తదష్టులు వసించిరి తత్తదగారసీమలన్. ౧౦౯.

మ. అసురస్తోమము సామదానరహితంబై భేదదండద్వయం
బెసఁగన్ వేల్పులపట్ల గార్త్యమున నుజ్జృంభించి యభ్యంచితా

స్తనమూహంబుగ నింద్రుమందిరమునం దత్తత్ప్రసిద్ధప్రదే
శనమాలోకనకౌతుకం బడర సంచారంబుఁ గావించుచున్. ౧౧౦.

సీ. కట్టించుకొనినాఁడు కద వైజయంతంబు, తన కేమొ యిది శాశ్వతం బటంచుఁ
గావించెఁ గద యోలగము సుధర్మాస్థాని, తన యధికారంబె తప్ప దనుచుఁ
బాలించెఁ గద స్వర్గపట్టనం బేపట్టు, నను దన కదియె కాణాచి యనుచుఁ
గొలిపించుకొనెఁ గదా పలపించి యప్సరస్సతులచేఁ దన సొంపె సతమటంచు
నార యాయింద్రుఁ డిప్పుడెందరి గెనొక్కొ, మనలఁ దొలివేల్పుల మాటమఱియు
[సవతి
తల్లికొమరుల మాటఁ దత్స్వర్గరాజ్య, మెల్లమనక ననుభోజ్యమం చెలుఁగఁ డొక్కొ.

గీ. అనుచు నమరేశ్వరసమృద్ధిహారణరూప, కాభిమతసిద్ధిజనితగన్యత్వబుద్ధి
శుద్ధమాత్సర్యగుణసమాబద్ధమగుచు, నుద్ధతత్వంబుఁ బ్రకటించుచుండె నంత.

సీ. మునుమున్నె లేవయ్యె నెనసియుండినహవి, ర్భాగముల్ సురలతోఁ బడయఁ దవకు
సమకూరలేదయ్యె నమృత మింద్రునితోనె, యంత్యాశ్రితం బౌట నపుడు భుక్తి
యందుండి తొలఁగె నీయురుగంగఁ బ్రతిబంధకం బయ్యె నాస్త్రీయకర్మపాశ
మెల్లైన నచ్చోట నే యుండవలె నన్న, దుస్సహం బయ్యె దైత్యలేదు బాధ
యయ్యయో యిట్టి నశ్వరస్వర్గ మెయోగ్య, మైన యధికారమునఁ బస్పందయ్యె "స్వర్గ
మున సుఁబోయిన నెడియేరు" లనువిధాన, నను దువగఁ జెందెఁ గద్దె వారి యు
[పుదు

ఉ. ఆమెయి నాకలోకవిధ్వాక్రమణం బొనరించి దానవ
గ్రామణి దానవత్వప్రథమగణ్యయశం బనిశంబునుం బ్రలో
కీమహనీయమై వెలయఁ గేవల ధీవిలసత్ప్రభావుఁడై
స్వామిహితైకతంత్రులగు వారల మంత్రులు గాఁగ గైకొనెన్. ౧౧౪.

చ. స్వజనములోఁ బరస్పరము స్వప్నమునందున మత్సరత్వముం
బ్రజల కొకళ్లొకళ్లకును భావములం గలహప్రవృత్తియుం
బ్రజనితమైనచో విభుఁడె బన్నము నొందు కొఱంతఁ గాన న
గ్గజిబిజి లేక యుంచ నధికార మొనర్చె సమర్థితార్యుఁడై. ౧౧౫.

ఉ. ఎవ్వరి నెట్లు మన్నఁదగు నెవ్వరి కెట్టియ గౌరవింపనా
నెవ్వరి కేవిధానఁ దనియింపఁగ వచ్చును వారి నెల్లఁ దా

క. అరుదెంచి యిసుసం దపుడా, హరిహయుఁ డప్పగిది దీనుఁ డైయుండినయా
యరుదెంచి భగవదిచ్ఛా, పరిణతికిం దిరుగు లేమి భావించి యనున్. ౧౨౪

చ. పురుషుఁడు దానె కర్త నని పొంగుట యెంతయు బుద్ధిలోప మీ
శ్వరుఁ డఖిలప్రపంచపరిపాలకుఁడై నిఖిలాంతరంగముం
జొరఁ డయి కర్మవృత్తులు జనింపఁగఁ జేసి స్వతంత్రశక్తిచే
సరవిగఁ దత్ఫలంబుల నొసంగుచు నెక్కుఁడెసంగు లీల చేన్. ౧౨౫

ఉ. వచ్చును మేలొకప్పు డటు వచ్చును గీడు నొకప్పు డంచు మే
లిచ్చఁ దలంపకుండు నరుఁ డెవ్వఁడు గీడుఁ దలంచ వాఁడెపం
డెచ్చును దగ్గ లేక ఫలియించు శుభాశుభకర్మసంచయం
బచ్చుపడంగఁ గర్మతతి యప్పరమేశ్వరులీలచే నగున్. ౧౨౬

సీ. గ్రామసంఘంబులా ఘనమెుందుఁ దూలము, నగరమెుందు నక్కజముగాఁ
స్థలవిభాగములు కచ్ఛములౌ నూపముల్, మరుభూములగును విస్మయముగాఁ
నాఢ్యుఁ డతెంచను దఁగునిర్ధనుఁడు మహా, భ్యత్వంబు నొందు నబ్రంబుగా
స్థానీయతతి యరణ్యానీత్వము వహించు, విపినముల్ పురము లౌ వింతగాఁగ

తే.గీ. చిత్రచిత్రప్రభావైక పాత్రుఁడైన, యీశ్వరుని శక్తిచేత నీయింద్రజాల
మును గనుచునుండి పురుషుఁడు తనకొకింత, శక్తిగలదని భ్రమయు నాశ్చర్యము గ ని.

కం. పెట్టె మున పెద్ది యిపు డది, పుట్టుట కొరకుగా నరుఁ బురుషుం డెదలోఁ
బెట్టక యుండిన యర్థము, పుట్టమికై వగల మునుగుల భోగుల నేలా. ౧౨౮

ఉ. ఒకఁ డుపకారముం జలిపె నోరుపఁ జాలక కెక్కసంబు వే
ఱొకఁ డుపకారముం జలిపె నొప్పగ ప్రేమ దలిర్ప నంచు నా
రక పరులందుఁ బెట్టు నది ప్రాజ్ఞతయే తనచేసికొన్న చేఁ
తరు ఫల మప్పు డప్పు డగు దప్ప కటంచు నెఱుంగ కక్కటా. ౧౨౯

క, ఎపు డెపు డెద్ది యొనర్చిన, నపు డపుడు ఫలించు నదియు యని యెంచినచోఁ
నుపశాంతి నొంది మానస, మపరిమితానందమగ్నమై తనివిఁ గనున్. ౧౩౦

క. కావున నో శ్రీవల్లభ, కావు ననుం గృప నటంచుఁ గని వేఁడినచోఁ
నావంత మనమునో నిఁక, నావంత మనము వహింప మవ్విభు కరుణన్. ౧౩౧

క. అరిదరకరుఁ డగుహరి యిపు, డరిదరకరుఁ డగుచు నీకు నభయం బిడునో
సురవరదానవరిపుభా, సురవర కారుణ్యగరిమ చొప్పెఱుఁగ వాకో. ౧౩౨.

గీ. అపుడు పరిసరవర్తులై నట్టిసురలు, దివిజవిభుఁ గాంచి యొజ్జలు దెలిపి నటుల
భక్తవత్సలుఁ డగుపరవాసుదేవు, దర్శన మొనర్ప కిందేల తడవు సేయ. ౧౩౩.

చ. అనవుడు దేవభర్త చతురాస్యసమైన నలభ్యమైన యా
ఘనునిపదాంబుజంబులను గన్గొను సంతతిభాగధేయమా
సనకసనందనాదు లగుసంయమివర్యులలో నొకండనో
యనవరతాత్మబోధభరితాత్ముఁడనో యెటు నాకుఁ జొప్పడున్. ౧౩౪.

శా. ఆవైకుంఠ పురాధిరాజ్యవిభవం బామూలచూడంబుగా
నే వేమాఱులు సన్మునీశ్వరులు వర్ణింపంగ భక్తిస్ఫుర
ద్ధీ వింటిం గనుఁగొంటి నెక్కటతటి వాగ్దేవాదు లేగంగ నే
నీవాచస్పతి మున్నుగాఁ జని దిశానీశానుషక్తుండనై. ౧౩౫.

క. అప్పటి నాచొప్పెవ్వఁడుఁ, జెప్పఁగ లేదయ్యెఁ గాని చెప్పఁగ వింటే
నప్పటి యిప్పుడు మీతో, నప్పరి మాయూరుఁ జేరు నడిగెనె యొకఁడున్.

సీ. కడుపునఁ గన్నట్టికొడుకైన బ్రహ్మకు, వెలుపలిపూఁదోట విడియఁ గలిగెఁ
బులహపులస్త్యాది మునిసంఘము వసించె, గరుడముఖ్యులగృహగణములందుఁ
గ[illegible] గాలత్తే[illegible] [illegible] పనయొజ్జ, లక్కడక్కడ నిత్యయాత్రజరిపె
నేను [illegible] నింటిపంచటరుంగు, [illegible] నిచ్చెలిఁ [illegible] యాజ్ఞ వదసి
తే.గీ. [illegible] దివ్యులసులచొప్పఁ [illegible], విరజదరులందునిరవొందు తఱల జాడ
నిలువ నీడయ్యెవానికవ్యులసునట్టి, యమరులకునంపనామరూపములుఁగలవె.

సీ. ఉపనిషద్వ్యాఖ్య ముపదేశ మొనరించు, రాజకీరము గిశోరములఁ బెంచ
సామగానక్రియాసామర్థ్యమును దెల్పు, బంగారుకీలము [illegible]బములను జేర్చ
హరినామసంకీర్తనం బభ్యసింపఁగఁ జేయు, శారికదారికా[illegible] గనిసి
ప్రణవనాదబ్రహ్మ[illegible] మోహింపజేయుఁ, బుష్పంధయము డింభములను దాని
తే.గీ. యచట సుద్యానతరువుల నధివసించు, సంతతానందితుండిల స్వాంతవృత్తి
నిర్విచారప్రచారంబు నివ్వటిల్ల, శౌరికరుణాకటాక్షప్రసారమహిమ. ౧౩౮.

క. అరుదెం దిగుసుం దపుడా, హరిహయుఁ డప్పగిది దీనుఁడై యుండినయా
యరుదెంచి భగవదిచ్ఛా, పరిణతికిం దిరుగు లేమి భావించి యనున్. ౧౨౪

చ. పురుషుఁడు దానె కర్త నని పొంగుట యెంతయు బుద్ధిలోప మీ
శ్వరుఁ డఖిలప్రపంచపరిపాలకుఁడై నిఖిలాంతరంగమం
దిరుఁడయి కర్మవృత్తులు జనింపఁగఁ జేసి స్వతంత్రశక్తిచే
సరవిగఁ దత్ఫలంబుల నొసంగుచు నెక్కుఁ డెసంగు లీల చేన్. ౧౨౫

ఉ. వచ్చును మేలొకప్పు డటు వచ్చును గీడు నొకప్పు డంచు మే
లిచ్చఁ దలంపకుండు నరుఁ డెవ్వఁడు గీడుఁ దలంచు వాఁడె పం
డెచ్చును దగ్గ లేక ఫలియించు శుభాశుభకర్మసంచయం
బచ్చుపడంగఁ గర్తతి యప్పరమేశ్వరులీలచే నగున్. ౧౨౬

సీ. గ్రావసంఘంబులా ఘవ మొందుఁ దూలము, గౌరవ మొందు నక్కజముగాఁగ
స్థలవిభాగములు కచ్ఛము లౌ ననూపముల్, మరుభూము లగును విస్మయముగాఁగ
నాఢ్యుఁ డకించనుం డగు నిర్ధనుఁడు మహైభ్యత్వంబు నొందు సంభ్రమముగాఁగ
స్థానీయతతి యరణ్యానీత్వము వహించు, విపినముల్ పురము లౌ వింతగాఁగ

తే.గీ. చిత్రచిత్రప్రభావైకపాత్రుఁడైన, యీశ్వరుని శక్తిచేత నీయింద్రజాల
మును గనుచునుండి పురుషుఁడు తనకొకింత, శక్తి గలదని భ్రమయు నాశ్చర్యము నను.

కం. పెట్టె మును పెద్ది యిపు డది, పుట్టుట తారుణ్యముగ నఁబురుషుం డెదలోఁ
బెట్టక యుండిన యర్థము, పుట్టమికై వగల పొగులఁ బొగులఁగ నేలా. ౧౨౮

చ. ఒకఁ డుపకారముం జలిపె నొరుపఁ జాలక తెన్నెనంచు వే
ఱొకఁ డుపకారముం జలిపె నొప్పఁగ బ్రేమ దలిర్ప నంచు నా
రక పరులందుఁ బెట్టు నది ప్రాజ్ఞతయే తన చేసికొన్న చేఁ
తకు ఫల మప్పు డప్పు డగుఁ దప్ప దటంచు నెఱుంగ కక్కటా. ౧౨౯

క. ఎపు డెపు డెద్ది యొనర్చిన, నపు డపుడు ఫలించు నదియు యని యెంచినచో
నుపశాంతి నొంది మానస, ముపరిమితానందమగ్నమై తనివిఁ గనున్. ౧౩౦

క. కావున నో శ్రీవల్లభ, కావు ననుం గృప నటంచుఁ గని వేఁడినచో
నావంత మనములో నిఁక, నావంత మనము వహింప మవ్విభు కరుణన్. ౧౩౧

క. అరిదరకరుఁ డగుహరి యిపు, డరిదరకరుఁ డగుచు నీకు• నభయం బిడునో
సురవరదానవరిపుభా, సురవరకారుణ్యగరిమ•చొప్పెఱుఁగ వాకో. ౧౩౨

గీ. అపుడు పరిసరవర్తులై•నట్టిసురలు, దివిజవిభుఁ గాంచి యొజ్జలు• తెలిపి నటుల
భక్తవత్సలుఁ డగుపర•వాసుదేవు, దర్శన మొనర్పఁ దిందేల•తడవు సేయ. ౧౩౩.

చ. అనవుడు దేవభర్త చతు•రాస్యునకైన నలభ్యమైన యా
ఘనునిపదాంబుజంబులను• గన్గొను సంతతిభాగధేయమా
సనకసనందనాదు లగు•సంయమివర్యులలో నొకండనో
యనవరతాత్మబోధభరి•తాత్ముఁడనో యెటు నాకుఁ జొప్పడున్. ౧౩౪.

శా. ఆవైకుంఠపురాధిరాజ్యవిభవం• బామూలచూడంబుగా
నే వేమారులు సన్మునీశ్వరులు వ•ర్ణింపంగ భక్తిస్ఫుర
ద్ధీ వింటిం గనుఁగొంటి నెక్కటి వా•గ్దేవాదు లేగంగ నే
నీవాచస్పతి మున్నుగాఁ జని దిశా•నీశానుషక్తుండనై. ౧౩౫.

క. అప్పటి నాచొప్పెప్పుడుఁ, జెప్పఁగ లేదయ్యెఁ గాని• చెప్పఁగ వలసెం
దిప్పటి యిప్పుడు మీతో, నప్పరి మాయూరుఁ జేరు•నడిగెనె యొకండున్.

సీ. కడుపునఁ గన్నట్టి•కొడుకైన బ్రహ్మకు, వెలుపలిపూఁదోట•విడిదిఁ గలిగెఁ
బులహపులస్త్యాది•మునిసంఘము వసించె, గరుడముఖ్యులగృహాం•గణములందుఁ
గాలక్షేపం•బొరుఁ డోటి వనయొజ్జ, లక్కడక్కడ నిత్య•యాత్రజరిపె
నేను నిష్కృపను•నింటిపంచటరుంగు, నందు నిల్చితిఁ బదే•యూజ్ఞ వడసి

తే.గీ. పిప్పి దిక్పాలకులచొప్పఁ• జెప్పనేల, విరజదరులందునిరవొందు• తటుల జాడ
నిలువ నీడయ్యె వానిక•వ్యులగునట్టి, యమరులకునంపు నామరూ•పములుఁ గలవె.

సీ. ఉపనిషద్విద్యార్థ• ముపదేశ మొనరించు, రాజకీరము గిశో•రములఁ గూర్చి
సామగానక్రియా•సాంప్రదాయము నెల్పు, బంభర్కికిలము శా•బములను జేర్చి
హరినామసంకీర్తనం • బభ్యసింపఁగఁ జేయు, శారికదారికా•సమితిఁ గదిసి
ప్రణవనాదబ్రహ్మ•పరతత్త్వ మొగిఁ గింౘుఁ, బుష్పంధయఘు డింభ•ములను దాసి

తే.గీ. యచట సుద్యానతరువుల• నధివసించి, సంతతానందతుందిల•స్వాంతవృత్తి
నిర్విచారప్రచారంబు• నివ్వటిల్ల, శౌంకరుణాకటాక్ష•ప్రసారమహిమ. ౧౩౮.

చ. గరుడుఁడు శేషునిం దరియఁగాఁ దనకోఁటల దుప్పుఁ జట్టుప
ల్లరుదనిలాంకురాన్నకబళంబులఁ దృప్తిగ వేయునోళ్ల వా
విరిఁ దగుపేర్మి డాసితినిపించు సతంబును నిచ్చలుం బర
స్పరకలహంబు కల్మిగలఁ పట్టునఁ బుట్టునె యెట్టివేళలన్. ౧౩౯.

మ. ఘననీలావఘనంబులున్ భుజచతుష్కంబుల్ పయోజాతలో
చనముల్ గౌస్తుభభూషణంబులును భాస్వచ్ఛంఖచక్రంబులున్
వనమాలల్ కనకాంబరంబులును శ్రీవత్సంబులుం గల్గి వా
రును వీరంచును వేరులేదు హరిసారూప్యంబు లందందఱున్. ౧౪౦.

కం. కలశీకృతవిరజామల, జలశీకరసేకరచితసంస్థులతాంచ
ద్దలశీతలతులసీవన,తలసీమ మెలంగు ముక్తతతులం దపుడున్. ౧౪౧.

సీ. కోమలతులసీసరామోదనశ్రీమ,హిమవిచారణవృత్తి నెసఁగు వారు
ధవళమృదూర్ధ్వపుండ్రవిశేషకవిశేష,ధారణగోష్ఠిచేఁ దనరు వారుఁ
గల్యాణగుణగణాఖండతరానుసం,ధానచింతనచేఁ దనర్చువారు
నిత్యసూరిసమాజనిర్ణీతహరితత్త్వ, సిద్ధాంతఫణితిఁ జర్చించు వారు

తే.గీ. నగుచు నెందెందుఁ బరికింప నందు నందు, నెగడునిత్యవిభూతిఁ జెందిన యనేక
దాససంఘ మస్పరమపదంబునందు, సందడిగఁ గ్రందుకొని మహానందమెసఁగెపు.

గీ. అందు గోవిందదివ్యపాదారవింద, యుగళసందర్శనస్పృహానిగళబద్ధ
దశపరించితి మమితవత్సరము లేము, లేము లేమున్న వపి నెడ లేదు సట మ.

గీ. అది యఖండతరప్రకాశాభిరామ, మగుట నిది పవ లిది రే యటంచుఁ దప
రామి నవ్యోచ్చటఁగాలనిర్ణయము సేయుఁ, దరము గాదయ్యె మనబుధగురునకైన.

కం. అటులుండెడు నాపనమున, ఘుటియిల్లె నెంతొ విసువు కటకట యిట్టి
చ్చట నిల్చి యెన్నినాళ్లో, యటమటగా నున్న దనుచు సవివేకమునన్. ౧౪౫.

కం. పురపౌరసమాజంబుల, దరిఁ గాలక్షేపమునకుఁ దరియం జన నె
వ్వరునైన నించుకైనను, బరికింప రటన్నఁ బలుకఁ భావింతు రిటుల్. ౧౪౬.

గీ. ఒక్కతతి నొక్కరుండఁ బుట్టోపశల్య, పనులవసపాలురైన నాపంకఁ జాది
పటుకరించిన సుబుసుపోవచ్చుననుచు, పంచరించుచు నిటు మదినెంచుకొంటి.

సీ. నిత్యకృత్యంబుగా • భృత్యభృత్యులనైన, కార్యకారులటంచుఁ • గాంచుకష్ట
మేపూఁట కాపూఁట• కెక్కుడుగుమ్మంబు, దిగోడుగుమ్మంబుగాఁ • దిరుగుశ్రమము
నెవరైన స్వామికి• నెఱిఁగింపరోకోయంచుఁ, బ్రతిహారుల భజింపఁ•బడుప్రయాస
మేధాతివాహ్యాళి • కేతెంచు భగవంతుఁ, డని యిటునటుఁ బ్రోవ• లరయుకష్టి

తే.గీ. కటకటాయిట్టిదనుచుఁ దఁ•బ్పుటకుఁదరమె, విసువుపుట్టించునాశ్రయ •వృత్తియెట్టి
వారికైనను బ్రాపింపఁ•వలదు కార్య, పరుల కెచ్చోట నిట్టివే• బాము లనుచు.

సీ. ఎవరైన వడివడి• నెదురుగా నేతేర, ననుఁ బిల్చుటకె వత్తు• రని తలంతు
సఫలప్రయత్నులై • చనువారివార్తలు, విని నాకు నిటు చెప్ప• దని తలంతు
నగరిమోసలలోని • నడయాడువారినెల్లను స్వామివల్లభు • లని తలంతు
దేవేరిబోనగ•త్తెలచేత నైన నా, మనవిఁ దెల్పింతునా • యని తలంతు

తే.గీ. నాకలోకంబునుండి నా•రాకఁ జెవుల, సోఁక నెఱిఁగించు వారలు•లేకయుఁటుల
శ్రీకళత్రుఁ డుపేక్షించెఁ• గాక యున్న, నీకరణి నుందునే యంచు•నేకతమున.

శా. ముల్లోకంబుల నేలుచుందు సవనం•బు ల్నూఱు గావించితిన్
దెల్లంబై తగుసౌమనస్యమున వ•ర్తింతున్ బుధశ్రేణియం
దెల్ల న్ముఖ్యుఁడనై మెలంగుదు న•న్నే యి ట్లుపేక్షించినాఁ
డుల్లంబందు నెఱుంగఁడో హరి యటం•చూహించు చున్నంతలోన్ ౧౫౦.

మ. ఒక మందారమహీజకోటరకులా•యోపాంతమందున్న శా
రిక వేరొక్క నికుంజనీడగతకా•రిం జూచి వీఁ డెవ్వఁడో
వికలస్వాంతుఁడో దుర్వినీతుఁడో గ్రహా•విష్టుండో నా మూరు చే
రక వర్తించుచు నుండెడిన్ హరిసప•ర్యాగంధహీనుండనన్. ౧౫౧.

ఉ. నావిని వీఁడు మూఁడుభువ•నంబుల నేలెడు వాఁడ నంచునుం
దా విధి మీఱ నూఱుసవ•నంబు లొనర్చినవాఁడ నంచునుం
గేవలసౌమనస్యమునఁ• గీర్తిఁ బ్రవర్తిలుచుందు నంచు నా
నావిబుధప్రధానతఁ ద•నర్చెద నంచు మెలంగు గర్వియై. ౧౫౨.

సీ. ఒకటి రెండు జగంబు•లొక్కఁడె వీఁడేలు, వాఁడ నంచును గర్వ•పడుచునుండు
నిట్టివి పదునాల్గు • సృజియించినవిరించి, యేమూల నుండెనో•యెఱుఁగ మెవర
మట్టిబ్రహ్మాండంబు•లనితసంఖ్యలు సృజింప, నను దెంప నణఁగింపఁ•గనుసమర్థుఁ
డైనశ్రీరమణుపా•దాబ్జముల్ దలకించు, సప్రభాయను నిగళంబు•చేతఁ గట్టు

తే.గీ. పదివేనంటదాను ముక్తులే పడయుదగిన, ఫలము బద్ధున కేరీతిఁ గలుగు నొక్కొ
యని తలంపక తన కబ్బె నని తలంచు, నెంత మూర్ఖుండొ వీఁ డంచు నేవగించి.

కం. హరిపదసందర్శన మఁట, దురహంకారాతిరేకదుర్లలితహృదం
తరుఁడగు దన కఁట వెన నది, దొరకమి కొక్కింతవినుగు దోఁచెనఁట కటా. ౧౫౪.

సీ. బహుజన్మవాసనాపరిపాకసంలబ్ధ, నిశ్చలాత్మజ్ఞాననియతిఁ జెంది
భగవదర్పణముగా భావించి సత్కర్మ, ముల నొనర్చుచు వినిర్మలమనీష
సకలభూతము లందు సమత వర్తించుచు, శాంతుఁడై దాంతుఁడై సంతసమున
సర్వజ్ఞభావంబు సార్వత్రికత్వంబు, సర్వేశ్వరత్వ మీశ్వరుని దనుచుఁ

తే.గీ. దలిసి సంతతసత్సంగవిలసనమున, సారిది నిస్సంగుఁడై ద్వంద్వశూన్యవృత్తిఁ
బరమభాగవతుం డైన వాఁడు కాని, శ్రీహరిపదంబు నందఁ డెందఁ గలఁడె. ౧౫౫.

శా. తా సేవ్యుం డఁట సేవకత్వమున నైశ్యంబు న్నిజస్తోత్రవి
న్యాసం బొప్పు బుధవ్రజంబు దన గేహద్వారపార్శ్వంబునం
దీసంక్రందను దర్శనం బెపుడు చేయించుం బ్రతీహారియం
చాసం జేసి వసింపఁ గోరు నఁట వీఁ డత్యంతగర్వాంధుఁడై. ౧౫౬.

కం. అని యాడు కొనెడుమాటలు, విను నప్పుడు నేను మిగుల విస్మయలజ్జా
వనతాస్యుఁడనై వానికి, వినతాంగుఁడ నగుచు విన్నవించితి నిట్లున్. ౧౫౭.

ఉ. శారికలార! శారికల సారెకుఁ జారుకథార్థముల్ మనో
హారికలారవస్ఫురణ నద్భుతభంగి నెసంగు నట్లు గాఁ
గోరికలారఁ దెల్పుచును గూరిమి గాంచెదు మీర లీజగ
ద్భారికలారహస్యముల పోఁడిమి బుద్ధి నెఱుంగు టబ్రమే. ౧౫౮.

కం. ఏ నెప్పుడు హరిపదని,ధ్యానము గావింతు నొక్కొ యని మదిలో నెం
దే నెప్పుడును దదేక,ధ్యానమున నె యుంట మీహృదయ మెఱుఁగ దొకో.

గీ. శౌరిపదదర్శనవ్యాప్తిఁ గోరి వచ్చి, యింతకాలంబు నిందుంటి మిందఱమును
మాయునంతంబు నొక్కింత మాత్రమైన, స్వామి కెఱిఁగించువారలెవ్వారు లేరు.

గీ. మాకు నర్యోగ్యపదముల కమ్మార్గవుండె, బ్రోవుఁ డనుచు నధికారముల నొసంగె
భక్తి నే మమ్మహాత్ముని యుక్తిఁ జేసి, పాదకొని యుంటి మయ్యయి పదములందు.

క. ఈపదువున నే మెల్లను, శ్రీవల్లభుదివ్యపదము సేవింప మదిన్
భావించి వచ్చి యిచ్చట, నేవిడియుట నచటి చందమే మయ్యో నాకో. ౧౬౨.

చ. అన విని వానిలో నొక విహంగము న న్గని యెంతమాట నీ
మనమునయందు నెవ్వఁడు రమారమణాంఘ్రిసరోజయుగ్మద
ర్శనకుతుకంబె కాని యితరస్పృహలేమియు లేమికి న్నిద
ర్శన మిదె చాలు నింటికడ చందము లందలి చింత యొప్పదే. ౧౬౩.

చ. పదపద నీకుఁ జూడ భగవత్పదదర్శన మేడ బ్రహ్మ ల
ర్బుదములు పంచలం దిరిగి పోవుదు “ఏనుఁగు లేటఁ గ్రుంకుచో
వదలక పాటికే పడుగ వచ్చెను నక్క” యటన్న భంగి ను
న్నది కద నీదు చందము వినందగ వింకిట మాకు నీనుడుల్. ౧౬౪.

చ. అనుచుఁ దృణీకరించి తెగనాడిన రెండవయండజంబు న
న్గని వచియించె నీకిపుడు గల్గదు నీయభిలాషసిద్ధి యె
వ్వనికి లభించె మున్ను భగవత్పదదర్శన భాగ్య మెంతయు న్
ఘన మగు ప్రాజ్యరాజ్యమదగర్వము సర్వము వీడు నంతకున్. ౧౬౫.

గీ. స్వామి సన్నిధిఁ దెలుప నెవ్వారు లేర, టంచుఁ బల్కితి వింతయా సార శౌరి
యనఁగ సర్వజ్ఞుఁ డతఁ డెఱుంగ నివి తెలవె, యింత యజ్ఞాని వేమిర యింద్ర నీవు.

గీ. అతఁడు ప్రాకృతనేతల గతిని మనవి, దెలుపఁ దగువాఁడె భక్తులు దలఁపఁ దోఁచు
నప్పు డిప్పుడు నందిందు నతని కితని, కనక యెవ్వఁడు నందంద నందటికని. ౧౬౭.

ఉ. మంతనమంచుఁ గొన్ని మటుమాయలమాటలఁ జెప్పి పుచ్చు ట
య్యంతిపురంపుటూడిగపుటన్నులమిన్నల నాశ్రయించు ట
త్యంతముఁ గార్యసాధనము లోఁ గలికాలపుఁ బ్రాకృతావనీ
కాంతులపట్ల నట్లనె జగత్పతియౌ హరిపట్ల నెంచితో. ౧౬౮.

చం. ఉపచితిపాత్రుఁ డార్యుఁడు సమున్నతకీర్తి యుదాత్తమూర్తి వా
జ్నిపుణుఁడు ప్రత్యయాస్పదుఁడు నిర్మలచర్యుఁడు ధైర్యధుర్యుఁ డా
త్మపరబలాబలజ్ఞుఁ డసమప్రతిభాంకుఁడు నైన నీగురుం
డెపుడుఁ ద్వదీయకార్యఘటనైకరతిం దగు నీతిచాతురిన్. ౧౬౯.

కం. నిరతంబుఁ దదనుమతికృతి, నిరతం బగుచిత్తవృత్తి॰ నిరహంకృతివై
కరణీయంబుల భృత్యుని,కరణిం గావింతు వేని॰కరుణించు నినున్. ౧౭౦.

కం. అని బుద్ధిఁ గఱపి పొమ్మన, మనపురికిం గురుఁదిగీశ॰మండలితోడం
జనుదెంచి యచటి వార్తలు, వినవిన స్మయ ముడిగె మదిని॰ విస్మయ మొదవెన్.

ఉ. పౌరుల నెల్లఁ రాఁ బిలిచి ॰ వచ్చితి మిచ్చటి కిన్నినాళ్లకే
మీరలు నందఱున్ సుఖులె ॰ యెవ్వఁడు నెవ్వఁగ మానియోగముల్
సారెకు నప్రమాదగతి॰ నల్పుచు నుందురె క్రూరదైత్యులె
వ్వారును దాడి రారు గద॰ వచ్చిన వారల నోర్తురే కదా ! ౧౭౨.

సీ. వైజయంతము పొంత ॰ వర్తింతు రెవ్వార, లెవరు సుధర్మ చెం॰తవసియింతు
రమృత కుండోపాంత॰మం దుందు రెవ్వరు,కామధేనువుదొడ్డిఁ॰గాతు రెవరు
గురుమందిరమున నె॰వ్వరు కావలి గనుంద్రు, చింతామణిని బరీక్షిం॰తు రెవ్వ
రైరావతముఁ బ్రోదిఁ॰ నరయు వారెవ్వార, లుచ్చైశ్శ్రవముఁ ద్రిప్పఁ॰చుందు రెవరు
తే.గీ. నందనవనమ్ముఁ బరికించు॰చుందు రెవ్వ, రెవరు మందాకినీతీర॰సవిధవివిధ
మణిఖచిత వేది సోపాన॰మండపములు, శిథిలములు గాకయుండ వీ॰క్షింతు రిపుడు.

సీ. ఇచ్చోటి కెపుడైన॰ విచ్చేయుచుండునే ॰ స్వైరసంచారుఁ డో॰నారదుండు
మునితపోవిఘ్నార్థ॰ముగ నిల్పఁబడిన యచ్చరలు వర్తింతురే ॰ సఫలగతులఁ
బుణ్యకర్మఫలాను॰భూతి కైరావ్యోమ, యానముల్ సుకృతుల ॰ కనుపఁబడునె
దైత్యనాథులరాజ॰ధానులఁ ద్రిమ్మరు,ప్రణిధులు వత్తురే ॰ వార్తలరసి
తే.గీ. యాశ్వినేయుల భైషజ్య ॰ మమరుచున్నె,పుష్కలావర్తకకులాభ్ర॰ములుధరిత్రి
సమయసముచితభంగివ॰ర్షములు గురియు, చున్న వియోజన్నములఁ బిల్వ॰లాదవుచున్నె

మ. అను నాపల్కుల నాలకించునవు డ॰న్యోన్యంబు వక్త్రంబులం
గనుఁగొంచున్ భయవిస్మయంబులు పెనం॰గన్వారు శోకాకులా
ప్తునఁ జూపట్టఁగఁ జెప్ప నేమిటికి మిం॰మ్ముం జూడ నాడెందమం
దున నొంశోకవితానఁ దోఁచు నన నం॰న్నుం జూచి వారందఱున్. ౧౭౫.

క. దేవా దేవరహృదయం, బీవీఁకనుభ్రాంతిఁ జెంద ॰ నీరలు మాతో
నావైకుంఠమునకుఁజనఁ, గావలె నని పలికి చాలఁ॰ గాలఁ బడ్యున్. ౧౭౬.

క. వేవేలయేండ్లక్రిందట, నీవడువున ననుట మాత్ర•మే గాని యదే
మో వైకుంఠపురంబున,కై విచ్చేయుటయు లేదు•కద యిప్పటికిన్. ౧౪౭.

సీ. మొన్న గదా మీరు • పూజించి ముచ్చటిం,చితిరి నారదముని•శ్రేష్ఠు తోడ
నిన్న గదా మీకు • విన్నవించిరి దైత్య, పురులవార్తలు గూఢ•చరులు వచ్చి
నేఁడే గదా మిమ్ముఁ • జూడఁగా వచ్చి ర, చ్చర లుర్వి మునులని•ష్ఠలను మాన్పి
యిప్పుడే గద మీర • లేతెంచు పుణ్యుల, కంపించితిరి వ్యోమ•యానములను

తే.గీ. ఘుటియు నెల్లి గదయ్య యేఁ•మటుక మేము, మీరు గావింపుఁడని నియ•మించినట్టి
కర్జముల నెల్ల జాగరూ•కతఁ గడంగి, కొలువువేళకు నవరించు•కొనఁగ వలయు.

కం. ఈలో మహి కెన్నిపరుల్, హాళి న్నృపకన్యకాస్వ•యంవరకల్యా
ణాలోకనార్థ మీశం, తేలలిశచి వెంట నరిగి•తిరి సురయుతులై. ౧౪౯.

మ. అనుచుం డంబయినుండి తోఁచు నొకఘం•టారావమాలించి వా
రును నేనుం దలలెత్తి మీఁదుఁ గనుచోఁ• గ్రొమ్మించులన్మించుచున్
స్తనితోదంచితమైనమేఘ మనఁగా • సైన్యంబుచే రాణగాం
చిన చొక్కంబగు వ్యోమయాన మరుదెం•చెన్ శంఖచక్రాంకమై. ౧౫౦.

కం. క్రమశమితవేగమై యా,పమానమసమానమైన•విభవస్ఫురణం
బమరంగ నల్లనల్లన, మము డగ్గఱినిలిచెఁ జూచు•మాత్రములోనన్. ౧౫౧.

కం. అందుండి యిందిరాకృతు,లం దగుగొందఱు వెలందు•లం గూడి శచీ
సుందరి వెలువడిరా మా,యందఱ జేడెందముల యందు • నబ్బుర మొదవన్.

ఉ. ఎక్కడి కెవ్వ డేగితి వి•దేటి విచిత్రము ప్రాణనాయికా
యిక్కడ నిన్ను నిప్పుడు గ•దే కనుఁగొంటి నటంచుఁ బల్కఁగా
నక్కజమంది యేమి యిటు•లానతి యిచ్చెద రిప్పుడే కదా
యిక్కమలావధూసఖులు • నేనును డిగ్గితి మీవిమానమున్. ౧౫౩.

సీ. నాఁడు వైకుంఠంబు•నకు మీర లటు లేఁగు,నపుడె తోడనెవత్తు•ననఁగ నుడుగు
మని యింట నను నిల్పి•యరిగిన మఱునాఁడె, శ్రీలీయుంగర మాన•వా లొసంగి
శ్రీదేవి నినుఁ జూడఁ•గాఁ దోడి తెమ్మన్న, నని యీవిమానంబు • ననుపరేచె
పనిచిన నన్నందు• వసియింపఁ జేసి యీ,యప ద్మావధూసఖుల్• పరమపదము

తే. గీ. నందు నామె వసించుశుద్ధాంతమందు, డింప నామెయుఁ బ్రేమ వాటిల్లఁబిలిచి
యుండు మిచ్చోట నీభర్తయుండునంత, కాల మని యానతిచ్చినఁ గ్గారవించె.

గీ. ఎన్ని నాళ్లందు జరిగనో యెఱుఁగఁగాని, నాఁటిబోటుల నల విమానమునుగూర్చి
యిపుడిపుడె యాయితంబుసేయించిపలికె,నన్ను సానుగ్రహాలోకనముఁజూచి.

కం. అమ్మా నీపతి నిజనగరమ్మునకుం జనియె నిపుడు గ్రక్కున నీవుం
బొమ్మా మేలగుఁ జక్కగ,బొమ్మా యని భద్రవస్తువుల నిడి పనుపన్. ౧౪౬.

కం. వచ్చితిమి యనుపదమున, నిచ్చటికై యిప్పు డిపుడె యింతకు మునుమీ
రిచ్చటఁ గాంచితి మనుమీ, ముచ్చట కెంతయును స్వాంతమున వింతయగున్.

గీ. అనుచుఁ దన వ్రేలి నుండి మున్నాన వాలు,పనిచి నట్టిది యిదియె గైకొనుఁడటంచు
నుంగరమెడల్చినాచేతి కొసఁగు నపుడు,నాకరాంగుళిఁజూడశూన్యముగఁదోఁచె.

కం. దొంతరవింతలచే నిటు, దంతుర మగుభ్రాంతి దోఁగి తల్లడపడునా
స్వాంతంబు చెదర నచ్చటి,కంతట నారదమునీంద్రుఁడరుదెంచె వడిన్. ౧౪౯.

ఉ. వచ్చిన వానిఁగాంచి తగువైఖరి మన్నన చేసి యేమి రా
యిచ్చటి కిప్పు డీయతివిశృంఖలుఁ డైనమహానుభావునిం
దెచ్చితి వీశ్వరా యని మదిం దిగులొందుచునున్న నాతలం
పిచ్చ నెఱింగి యాతపసి యిట్లనె నల్లన సస్మితాస్యుఁడై. ౧౫౦.

శా. ఓహో యేమిది విన్నఁబో టొదవ నేఁదో వింతయో చింతయో
మోహంబో మదిఁ దోఁగినట్టుల యథాపూర్వానన శ్రీసము
త్సాహాకారవిచేష్టితస్థితులచే స్పష్టంబుగా నాత్మలం
దూహింపం దగి యుండె దీసురశచీయుక్తుండవై వాసవా. ౧౫౧.

గీ. అనిన నప్పటివాస్థితి యంతవట్టుఁ, దెలుప నాలించి పలికె నద్దివ్యబోధ
మహితుఁ డిదియెల్ల నల్పసామ్రాజ్యమత్తమతి వయిన నీదుదుర్మోహగతి నె కర్గె.

గీ. ఇంత దుర్మోహమతివిగావేని నన్ను, నతివిశృంఖలుఁడైనమహానుభావుఁ
దని తలంతువె దేవర్షి నగుట నాకుఁ,ద్వద్విచారంబు నడుప రావలసె నిపుడు.

మ. నిగమాంతంబులు నిట్టివాఁడనుచు వర్ణింపంగ లేవన్నచో
జగదీశుం గనుఁగోఁ దరంబగునె దుస్సంసారమోహాంధులై

తగువిభ్రాంతహృదంతరంగులకు యత్నం బెంతేఁ గావించినన్
భగవద్భక్తుల కట్లుగా కతఁడు చూపట్టుం గదా యంతటన్. ౧౯౪.

మ. తనభక్తుండను నేను గానొ నను వాత్సల్యాతిరేకంబునం
గని స్వీయంబగుదివ్యవిగ్రహముసాక్షాత్కారముంజేసి ధ
న్యునిఁ గావింపఁగ రాదొ యంచనెదవేమో నీవు భక్తుండవై
న నతం డిట్టు లుపేక్ష సేయునె సురేంద్రా యేల యీదుర్భ్రమల్. ౧౯౫.

కం. విను భక్తుల తెఱఁగెటిఁగింతుము గోప్యము దృశ్యమగుచుఁ దోఁచిన యది యె
ల్లను వారలు శ్రీహరి భావనఁజూతు రతఁడు జగన్నివాసుం డగుటన్. ౧౯౬.

కం. హరి సర్వత్ర కలం డను,బరమార్థము నెవ్వఁ డెఱుఁగుభక్తుఁడు వాఁడే
హరియు న్వానికి యెల్లెడఁ, గరుణించుం దనదుమూర్తిఁ గనుభాగ్యంబున్.

గీ. తరలి వైకుంఠ పురికి నీవరిగి యందు, నెందు గోవిందుఁ డుండునో యెపుడునన్నుఁ
బిలువ నంపించునో యంచుదలఁచు చుంటి,గాని దృఢభక్తిధ్యానింపఁగడఁగ వైతి

మ. గురుభక్తిన్ గుఱినిల్ప నేర కలవైకుంఠంబుఁ బ్రోలంచు న
వ్విరజన్వాహినియంచు నత్తులసి సుర్వీజాతమంచున్ ఖగే
శ్వరశేషాదుల నిత్యసూరులనుచున్ భావించితే కాని య
ప్పరమేశప్రతిబింబబుద్ధి మదిసంభావింపవై తక్కటా. ౧౯౯.

కం. ఎక్కడి శౌరీ జన్మం, బెక్కడి యితరాంతరంగవృత్తిజ్ఞత్వం
బక్కడిఁది యెఱుక దొరకొను, టక్కడ హరియే చరాచరాకృతినుంటన్. ౨౦౦.

కం. హరిమాయ నెఱుఁగ నెవ్వరి, తరమా పరమాత్ముఁ డెటుల తలఁచిన నటులౌఁ
బెరమాటలేల భ్రమయుట, సురమాన్యరమాధ్యమహిమ చొప్పున నె సుమీ.

కం. నీ వెపుడు సపరివారుఁడవై వైకుంఠమున కఱిఁగి తివ్వాడె యిచటన్
నీవిధమున నొకమాయా,దేవేంద్రుని సపరివారుఁ దివిరి సృజించెన్. ౨౦౨.

ఉ. అంతట నూరకుండక త్వదంగన యైనశచీవధూమణిన్
స్వాంతమునందు భ్రాంతి దొలఁగాడకయుండఁగ శీలరక్షణం
బెంతయుఁ జేమఁ జేయ మదినెంచి రమాపతిచేత నామె శు
ద్ధాంతమునందునుంచుటకునై పిలిపింపఁగఁ జేసె వేల్పుడిన్. ౨౦౩.

గీ. అపుడు శచి కానవాలు నీ కంపి తనివ్రయుంగరము శౌరిమాయా సముద్భవంబె
యిపుడు నీచేత నదితిరోహితవిధంబు, గనుటయును శౌరిమాయాప్రకల్పితంబె.

గీ. నీవు స్వర్గంబునందు శేనితతి నచట, నెగడు కర్జంబు లేరీతి నగునొ యంచు
నీతలను భార మెల్లనుండెనను బుద్ధి, పుట్ట హరి నిన్ను పిలుగులఁ బెట్టఁ దలఁచి.

గీ. కారికాదంభమున నిన్ను శౌరి కాని, మాటల నహంక్రియాగర్వ మదము లణఁచి
కాదు కాలాంతరంబునఁ గాని నేఁడు, హరిపదాలోకనంబు పొమ్మనుచుఁ బంచె.

కం. గెంటనికృప నంటినమతి, వెంటనె శచినింటి కనుపవే యని సిరి వా
ల్గంటి కెఱఁగించి హరి తెఱ, గంటిదొరా పనిచె నామె గ్రక్కున నిటకున్.

గీ. ఈశచీఘటి యిపుడు చూపినయట్టి, మాయయుంగరంబు పోయె నవుడె
నీదు వ్రేలి దైన నిజమైనయుంగరం, బిప్పు డుండుఁ జూడుమీ సురేంద్ర ౨౦౭.

కం. అనవపుడు నాకరాంగుళిఁ, గనుఁగొనుచో నంగుళీయకసమేతంబై
కనుపట్ట నచటి వారల, మనంబు లద్భుతరసైకమగ్నములయ్యెన్. ౨౦౮.

గీ. మఱియు నమ్ముని యిట్లనె మఘవ నీకు, గురుగురూపాయచాతురీగురుతవలనఁ
గలుగు కాలాంతరంబునఁ గమలనాభు, దర్శనము క్షీరవారాశిఁ దప్పకనుచు.

గీ. ఇదియనఁగ నెంతవింత నీమది కొకింత, భ్రాంతిమాత్రంబె కలిగె నిప్పటికిముందు
నాటునస్వప్నవార్త యంతటలభించు, నిష్టసంసిద్ధి యని తెల్పి స్వేచ్ఛ నరిగె.

గీ. ఇన్నివిధముల హరిశక్తి యిట్టి దనుచు, నెఱిఁగి యెఱిఁగియు నల్పసమృద్ధిగర్వ
పరవశుఁడనై చెఁబడరాని పాట్లఁ బడితిఁ, గానియిడుమల విడనాడఁ గలిగెనిపుడు.

కం. ఆ సంయమి పలుకగువను, నానన్నా సంశయంబు లడఁగె న్నుడు లే
లా నన్నము లయ్యె శ్రమము, లాసన్నము లయ్యె రమలు హరికృప నింకన్.

చ. సురవరులార నూరిపరిశుద్ధుఁ డుదారుఁడు దత్తుఁ డైనయా
గురుఁడు గురుండు మంత్రియు సఖుండు నియంతయునై స్వనీతిచా
తురి నను నెల్లకర్మములఁ దోడ్పడి కావఁగ నావగ ల్నిరం
తరముగనుండునే మది ముదంబు పదంపడి కూడకుండునే. ౨౧౪.

ఉ. ఈ మహనీయబుద్ధి బలిమిం గదనంబు కదనైనచో రిపు
స్తోమములన్ జయించు నెఱిఁ జూపును నేర్పును మాపు నోపి స
ర్వామరసామరస్యకలనానైకదశన్ ఘటియించునేఁడు శ్రీ
స్వామికటాక్షముం బడయఁ జాలు నుపాయముఁ దెల్పఁకుండునే. ౨౧౪.

క. అనవుం డాంగిరసుం డిట్లను నను నాత్మీయ నింతయుగ్గించుట యొ
ప్పునె యిది యిట్లగునని సర్వముని వలుకఁడె యతనివ ల్కమోఘము కాదే.

గీ. సాధనీయార్థమున కెందుఁ సాధకుండు, గావలయునంచుఁ గోరుటం గలదు గాని
సిద్ధమగునర్థమునకుఁ గాంక్షించు టెందుఁ గలదు సాధకుఁ డొకఁడు గావలయునంచు.

క. శౌరివ్యపదేశశ్రీ, శౌరీరిత మైనయర్థసందర్భమునే
నారదమునియుం దెలిపెఁ గదా రూఢిగ దాని కన్యథాత్వము గలదే. ౨౧౭.

ఉ. ఇప్పుడె క్షీరవారిధి నహీనశయానుఖగేశయాను బొం
దుప్పటిఁ బూను జానుజిగిందోఁ దగు మేను మెఱుంగు రంగు బా
గొప్పగు గొప్పకప్పు మొయిలో యనఁ బొల్పగు శ్రీరమేను నే
చొప్పునఁ జేరి కొల్చుటకుఁ జొప్పడు నట్లొనరింపఁ గాఁదగున్. ౨౧౮.

క. అన నందఱు నలమందరమున నుండి పయోధితీరమును జేరగడం
గి నితాంతంబు నతాంతం, బు సుదాంతం బయినస్వాంతమున వెడలి రొగిన్.

క. మిహిరకులకలశజలనిధి, మిహికాకిరణానమత్సమీహితకరణా
వహబహుసుగుణాభరణా, మహాంగ స్మద్వంశ పురుషపూజిత చరణా. ౨౨౧

ఉ. కుంచితచిత్రకూటగిరికూటరటత్క్రరటత్ప్రపాటద్వ
ప్రపంచలపాతపాటవస్ఫుటారభటీత్రుటితారికాటవా
పంచవటీతటీఘటితపర్ణకుటీనికటాటవీనట
త్కాంచనకృష్ణసారబలగర్వవిపాటనసద్విపాటనా. ౨౨౨.

తోటక. స్థిరగౌరవ మానసదృష్టజటా, యురభిఖ్య విహంగధృతోరుజటా
భరకృష్ణమృగాజినవల్కవటా, నిరవద్య కృపాకరనిష్కపటా. ౨౨౩.

### గద్యము.

ఇది శ్రీమద్రామనామపారాయణపరాయణాతిధన్య కౌండిన్యగోత్రపవిత్ర దేవుల
పల్లికులపయఃపయోనిధికళానిధిసీతారామశాస్త్రిపౌత్ర వేంకట కృష్ణ
శాస్త్రిపుత్ర తమ్మనాభిధానాంతర వేంకటకృష్ణశాస్త్రిసామాగ్ర
జన్మ త్రిలింగదేశాగ్రజన్మ సుధీవిధేయ సుబ్బరాయశాస్త్రి
నామధేయ ప్రణీతంబైనమహేంద్రవిజయం బను
ప్రబంధంబునందుఁ దృతీయాశ్వాసము.

శ్రీసీతారామార్పణమస్తు.

---

శ్రీ ర స్తు.

# శ్రీమహేంద్రవిజయము.

## చతుర్థాశ్వాసము.



హనుమత్కృతపదసం
వాహన సౌందర్యరచితవాచంయమిన
మ్మోహన రుచివిజితహరి
ద్వాహన రఘురామ సార్వభౌమలలామా. ౧.

గీ. అవధరింపుము శౌనకాద్యఖిలమౌని, మణుల కిట్లని రౌమహర్షణి వచించె
సుచిరపరిలబ్ధపుమవత్యనురుచిరకల, మంజుసంజల్పమాధురీమహితఫణితి. ౨.

మ. కని రాచార్యపురస్సరంబుగ సురల్ గ్రావారితోఁ గూడి యిం
పునఁ బెంపా శరధిం బురారిశరధిం భూదేవికిం గట్టి వి
ష్వనిపుట్టంబును శేషశాయి కి లసద్వారాభిరూప్యంబుచే
ఘనమై చొక్కఁగఁ జొక్కమైనశయనాగారం బదూరంబునన్. 3.

మ. కనదుత్తుంగతరంగహస్తముల సైఁగం జేసి యాత్మీయ ని
స్వనసంరంభమునన్ ముకుందుఁ డిదె యస్మన్మధ్యమం దున్నవాఁ
డని యాహ్వాన మొనర్చుచుం బృషతపాద్యం బిచ్చి తమ్మాదరిం
చునదీశుం గని కార్యసిద్ధియగు నంచుం జాల సంతుష్టులై. ౪.

కం. గురు ననమయోగవిద్యా,గురుఁ గని యుపయోగమై తం గురుచిరతరవా
గురుఫణితి నచట నవ్రు డజ,గురుఁ గనుయోగంబును నెఱుఁగు గురుచిన్ వేఁడన్.

కం. శ్రీకారుణికు సదవనాం,గీకారుని నిత్యవిహితకిల్బిషచయభం
దీకారుని హరి నిచ్చట, సాకారునిగాఁ గనంగ నగు భక్తులకున్. ౬

ఉ. క్షీరపయోధినుండి దరిఁ జేరఁ గజేంద్రుని పట్లఁ దండ్రి ని
ష్కారణదోషముల్ పలికెఁ గాన మముం దదపత్యతాదరా
కారులఁ బ్రోవవే యనుచుఁ గాళ్లఁ బెనంగెడు నక్రపోతముల్
నా రహి మించు నవ్యనజనాభుని జంఘలఁ గాంచె నంతటన్. ౧౪.

గీ. ఊర్వశి కరిష్ట మనుమాట యుండెఁ గాన, రంభ కేలయరిష్టమై క్రాలకుండు.
ననగఁ దగుశౌరి యూరుద్వయంబునందుఁ, గొంతసేపు వసించె నంగస్సురుని చూపు.

క. పొందుపడిరా కె బిగిం,బొందుప్పతిలంగ నెల్లవుడు సజ్జనతా
నందకమై యొప్పెడు నల,నందకమునఁ దనరు కటి గనం దగె నంతన్. ౧౬.

గీ. అఖిలమునకుఁ బితామహుఁ డా విరించి,యిది యతని కన్న మాతామహి యగుఁ గానఁ
దన్నొకించుకయందు బాంధవము గలదటంచు హరినాభి సరసి సేవించె గురుఁడు.

సీ. ముగ్ధలీలావలీస్నిగ్ధనీలావలీ, సరళసోపానాగ్రసరణిఁ బోవఁ
గ్రేవ శ్రీవత్సమన్ క్రీనీడపై జాడ, హరియురస్సీమ గేహాజిరమున
కుంభద్విజోన్నత స్తంభసంభృతవైజ,యంతికాగారుత్మతాశ్మశృంఖ
లామధ్యభాగ ప్రలంబమానానూన, కౌస్తుభమణిదీపకళికదీప్తి

తే.గీ. యిదిగోఁ గనుఁడీ మనోరథాభ్యుదయరేఖ, యనుచుఁ జూపింప నగ్గురుఁ డరసి మరిసె
సరసిజాననముఖసురైశ్వర్యదాత్రి, భువనజనయిత్రి నందు నంభోధిపుత్రి. ౧౭.

క. తిలకించి యతించనుఁ డి,మ్ముల మించిన పెన్నిధానమును గాంచిన య
ట్టుల సంతసించి గీష్పతి, పులకించిన మేనితో సమత్సుకుఁ డగుచున్. ౧౮.

క. తల్లి యోషిల్లోకము, తల్లి త్వల్లీలచేఁ గదా యవ్వాణీ
వల్లభముఖులెల్లను నం, వల్లాభోల్లసితులై ప్రవర్తిల్లు టొగిన్. ౨౦.

క. ముక్తాహారులు నవిరళ, ముక్తాహారులును సుహితభూరిరసోద్య
ద్భుక్తులు నగుదురు గద త్వద్భక్తులుగా గణుతిఁ గనినవారలు తల్లి. ౨౧.

సీ. కడుపేదలై దప్పి కడుపేద నిల్లిల్లు, దిరుగువారైన నీకరుణఁ గాంచి
వలువంతయును లేక వలవంత దైన్యంబుఁ, జూపువారైన నీ ప్రాపుఁ గాంచి
నిలువనీడగఁ గాదు నిలువ నిష్ఠలియరై, యొనరువారైన నీ సెనరుఁ గాంచి
మాటుమానికి నేమాటు మానసముఁ జెం, దుడుగువారైన నీ దయఁ గాంచి

యసమశాల్యన్నములయుఁ జీనాంబరంబు, లయునమత్సేధసౌధంబులయుఁ గుటుంబ
పరిజనంబులయును బెంపుపరిఢవిల్ల, భూరిసామ్రాజ్యుఁడగుఁగదే భువనజనని ?

క. అని యెన్నేనివిధంబుల, ననిమిషగురుఁ డిందిరామహాదేవిని బే
ర్కొని యామెను ప్రసాదం, బునఁ దిరమగుసిరి నొసంగు పొంౘిమిఁ జూపన్.

క. మన కిఁక శాశ్వతసంపద, లొనగూడె నటంచు మోదమందుచు మఱియా
ఘనమూర్తి యితరలసదవ, ఘనసందర్శన మొనర్పఁగాఁ గడఁగుటయున్. ౨౪

గీ. పొందుగా నంతఁ గటినద్ధనందకేత, రాయుధచతుష్క మైనశ్రీహరిభుజాచ
తుష్టయమునందు నిలిచి సంతుష్ట మయ్యె, ననిమిషస్వామిగురువిలోకనచయంబు.

చ. కమలజసూతి ఫాలఫలకంబులఁ బుట్టువుచంద మేకకా
లమున లిఖింప దాసవటలంబున కొక్కటఁ జక్కఁగాఁ బుమ
ర్థముల నొసంగ నాలు గిటిఁ దాల్చెనొకో యన నొప్పు శౌరిహ
స్తములకు మస్తకంబు వినతం బొనరించె గురుండు భక్తితోన్. ౨౬.

గీ. కంధరాభిఖ్యభువనవిఖ్యాతి గాంచి, గర్జితనూఫర్జితధ్వని గణుతిచేఁ ద
నర్చువైకుంఠకంఠంబున కుపకంఠ, మున సముత్కంఠ గురుఁడు చూపులఁ గదించె.

క. మానసమున గురుఁ డాహరి, యాననరుచి వలువ గన్న యాననరుచిర
శ్రీనలరు దానిఁ గని యన, మానసముల్లాసభాసమానుండయ్యెన్. ౨౭.

మ. దివిజామాత్యుఁడు స్వామికార్యఘటనాదీక్షైకదక్షుండు శ్లా
ఘ్యవివేకుండు పదాదిగాఁగ ముఖపర్యంతంబు నత్యంత భ
క్తివిశేషంబున నంబుజోదరునిమూర్తిం గాంచి సాక్షాత్కరిం
చె విరించాదికదుర్లభుం డనుచు సంతుష్టిప్రమోదంబునన్. ౨౯.

క. బడి బడి సాష్టాంగముగాఁ, బడి వడి మ్రొక్కి లిడి లేచి పలుమడువులఁ బ్రా
మడువుల మడియడిదవుదొర, నుడుగక కడుభక్తిఁ బొగడుచుండఁగ హరియున్.

గీ. గీష్పతినిఁ గాంచి నీవు వాస్తోష్పతియును, సురలననుఁ జూడ నిటకు వచ్చుటయెఱింగి
ధ్యానగమ్యుఁడఁ గానఁ బ్రత్యక్షమైతి, నీకు మాత్రంబె సురపాలనైకలోల.

క. మెచ్చితి నీవచ్చరితకు, వచ్చినపని ముచ్చటించి వర మడుగుము వై
యచ్చరకులదేశిక యన, నచ్చతురుఁడు విన్నవించె హరి కిప్పగిదిన్. ౩౧.

గీ. ఏను వాస్తోష్పతియు సురలిటకు నిపుడ, వచ్చుట యెఱింగినట్టి సర్వజ్ఞమతికి
దేవరకు విన్నపము సేయఁగావలెనె మదీయవిజ్ఞాపనం బాదిఁ దేయవరద. ౩౩.

ఉ. శ్రీవర దేవరం గనుటఁ జేతను జేతనులాజవంజవ
ప్రావరణంబువాసి సతతైనభవత్పదసేవనంబునం
బావను లౌచు నిత్యవిభవంబును గాంచి సమంచితానుమో
దావహులై సదాసుఖితులౌదు రటంచు వచింత్రు కోవిదుల్. ౩౪.

గీ. అట్టిదేవరదర్శనం బైనపిదప, వెట్టివాఁడైనఁ గోరునే వేఱె వరము
నమృతవారాశిలో నోలలాడఁ గాంచి, గంజికై యాసపడెడి మూర్ఖుని కరణి.

కం. దేవర పాదసూపుట కా, దే వర మన వేఱె యున్న దే వరపరటా
దేవరథ సంయమీశ్వర, దేవరచితవినుతిపాత్ర దేవ రమేశా. ౩౬.

కం. నీ వొనరించినజగములు, భావింపఁగ స్వర్గమర్త్యపాతాళంబుల్
దేవమనుష్యాసురులకుఁ, దావలములు తత్క్రమంబు దప్పనె యెపుడున్. ౩౭.

గీ. సంజ్ఞ త్రిదశాలయం బని స్వర్గమునకుఁ, దనరు బలిసద్మ మనుచుఁ బాతాళమునకు
నమరు నది యిప్పు డేల వ్యత్యాస మొందు, సత్యనిర్మాణ నీకటాక్షంబు గలుగ.

గీ. మాది మాకిచ్చుటయె మడిమాన్య మిడుట, యనుచుఁ బ్రాకృతుఁ గోరిన యటులమిమ్ముఁ
గోర నేటికి మున్నెయొవ్వారి కిద్ది, యుచితమగు దాని నటు చేసియుంటఁ జేసి.

కం. బలి శుక్రుని ప్రేరణమున, బలభేదిని స్వర్గపురముఁ బాయఁగఁ జేయం
బలమఱి మీచరణంబులఁ, గొలువం జనుదెంచె నిటకు గోవింద హరీ. ౪౦.

సీ. దితితనూభవపండితాతులకు దశశతాంబకు వీఁపునఁ బ్లులమంచ మయ్యెఁ
బలలాశికుట్టాకములకు వేఁడివెలుంగు, కొమరుని తల సంతకుండ యయ్యె
దైత్యకరాసితాడితముల కంబుధినాథు, మేనూరిదరిబొద్దుమేడి యయ్యె
దనుజాంగుళీప్రపీడనముల కర్థేశు, చెవిదోయి కెన్నెరచీల లయ్యెఁ

తే.గీ. గొమ్ము లేనుంగులే ధావన మ్మొనర్ప, నేమి చెప్పఁగవలయును దోమలగతి
నవినగతిఁ గోణపులఁ బేరుకొనఁగ నేల, చెదరియొక్కొక్క మూలవాఁ డొదిగిరపుడు.

గీ. దీనజనతార్తిసంహారి దానవారి, శౌరి యనుఖ్యాతి నిల్పుకో సమయ మిదియె
శిష్టరక్షణ దుష్టసంశిక్షణములు, నీవు పూనిన పూన్కలు గావె దేవ. ౪౧.

మ. అనిసాష్టాంగముగా వడిం బ్రణతుఁడై యాదేవదేవాంఘ్రులం
దనమూర్ధంబున సోఁకుచుం గరము దైత్యవ్రాతగర్వాపహా
దనదీక్షాపర ప్రోవవే మము సురేంద్రత్రాణనిర్వాహణా
యనుచుం గేవక యున్న శౌరి కరుణాయత్తైకచిత్తంబునన్. ౪౩.

గీ. అఖిలసజ్జనలోకాభయప్రదంబు, లైన నాల్గుభుజంబులఁ బతనిఁ బొదివి
లేవఁగా నెత్తి యిట్లను దేవమంత్రి, యీయుపేక్షకుఁ గారణం బెల్ల వినుము.

చ. కులబలసంపదాదులు దగుల్కొనహాత్తినమత్తవృత్తి రౌ
ట్టులు దొలఁగుం దదున్నతి కడుం దగుచుండినయంతనట్టుఁ ద
ద్బల ముడిపోయి నవ్వడు గదా యిది యిట్టి దటంచు నాత్మలం
దలిచి వినీతి నీతియు విధేయతయుం సమకూరు నేరికిన్. ౪౫.

కం. బుధవిభుఁ డితఁడు త్రిలోకీ, ప్రభుతాప్రభవప్రభూతమగు వైభవగ
ర్వభరంబునఁ దజ్ఞత దృష్టి భవాన్ప్రసాద మభిభవించెం దెలుచన్. ౪౬.

చ. ఒరుఁ గని యాదరింపమిదె యొప్పదు తప్పగు విప్రుఁ జూచి స
త్కరణ మొనర్ప కున్కి కొఱగాదు తపస్వుల నెందుఁ జుల్కఁగా
నరయుట శైవులందు వినయంబె నయింపమి కాని మాట వా
విరి మనయత్రినందను నుపేక్ష యొనర్చినఁ జెప్ప నేటికిన్. ౪౭.

శా. శర్వాణీకరుణానులబ్ధమనియా సన్మాలికావృత్తము
న్గీర్వాణేశుఁ డొయింగఁజాలఁ డట పోనీ దాని కేమయ్యె నా
సర్వేశాంశమునన్ జనించినమహాశైవుండు దుర్వాసుఁ డీ
దుర్వాసుండని మున్నెఱుంగఁడొ ప్రశంసింపం దయ్యె వ్యర్థంబుగాన్. ౪౮.

కం. అవరము విశాపచ్యుతి, గోవిందుఁడె కలఁ డటంచుఁ గొనకొని సదయుం
డై శాత్రవుల యూరక, యే వదలినఁ గ్రమ్మతింప నెవ్వరి తరమా. ౪౯.

కం. ఐశ్వర్యదాత యవ్వర, మీశ్వరుఁ డని మోక్షదాత యీవని శాస్త్ర
ద్విశ్వప్రఖ్యాతోక్తుల, విశ్వాసంబునను సంధరించు నె యిడుమల్. ౫౦.

కం. ఏ నన మీశ్వరుఁ దన నిం, తైనను భేదంబు కలదె యదిరెఱుంగక దు
ర్జ్ఞానులు గొందఱు భేదము, గా నెంతురు వారి కెట్టుఁ గలుగును సుగతుల్. ౫౧.

కం. నేనజుఁడనై సృజించెద, నే నేరై పెంచెద నన్య॰ హీశానుఁడనై
పోనడఁచెద వారలు ని, న్లోనరపెద రేది భేద॰ మీమువ్వురకున్. ౫౨.

ఉ. మామకభక్తుఁ డెవ్వఁడో సమస్తము నాతడు మన్మయంబుగా
నేమదిలోఁ దలంచు నతఁ॰ డెద్దియు భేదముగాఁ దలంపఁడే
మేమె మదన్య మున్నదని॰ యెంచినచో నిఖిలాత్మభావము
న్లేమి ఘటించు నాకపుడు॰ లేదుకదా తగుదారి వానికిన్. ౫౩.

కం. ఈశ్వరభావనచే న,న్నైశ్వర్యంబునకుఁ గొలిచి॰ యావ్వలి నిత్యై
శ్వర్యసుఖమునకై గరు, డాశ్వునిఁగఁ దలంచి కొలువ॰ నగు వాంఛాప్తుల్. ౫౪.

గీ. ఈశ్వరానుగ్రహము లేని॰ యొడనొకండు, శాశ్వతైశ్వర్యముల నొందఁ॰ జాలఁ డెపుడు
నాయనుగ్రహమును గోరె॰నా తదీయ, విత్తము హరింతు నిది లోక॰ విశ్రుతోక్తి.

మ. సిరి సంప్రాప్తిగ నున్నవేళ మదవ॰ చ్చేతోభిమానంబునం
బరమార్థమ్మొక యింతయైన మదిలో॰ భావింపఁగా లేక ము
ష్కరులై కొందఱు కన్నుఁగాన రదిపోఁ॰ గాంక్షింతు రింకెవ్వడె
వ్వరిమూలంబున నెండియుం గలుగు సం॰ పల్లాభమంచార్తులై. ౫౬.

కం. ఇంకేల పెక్కునుడువులు, శంక యొకింతయును లేక॰ చనుఁ డిపుడు నిరా
తంకముగఁ బంపెదను మీ,సంకటములు దీఱ బలి ర॰ సాతలమునకున్. ౫౭.

కం. నావుడు గురుఁ డిట్లను నో, దేవా దేవాధిపాది॰ దివిజావళికిన్
భావత్కపాదదర్శన, భావుకము నొసంగవలయు॰ భక్తార్తిహరా. ౫౮.

కం. ఓదేవ వారికిని మీ, పాదాంబుజరవముఁ గ్రోలు॰ భాగ్యము దొరకం
గాఁ దలఁతు నిపుడ యేక, స్వాదునఖుంజిత యనెడు॰ వాక్యము వినుటన్. ౫౯.

కం. పలుమఱు శ్రీహరిగురునిం, దలఁపు తెలుపు మనిన నింద్రుఁ॰ డాకమువంచు
న్నిలువు మని కోరె స్వార్థముఁ, దలఁపరు కద స్వామికార్య॰ తత్పరు లెందున్.

కం. అన నవ్వుచు వటుశౌరి, మ్మని హరియు ననుగ్రహించి॰ నాంగిరసుండుం
దన పిఱిఁది సురల కరిదిగఁ, గనుఁగొనుఁడని చూపి చెప్పఁ॰ గాఁ గట్టెదుటన్. ౬౧.

మ. కని రింద్రాదిసురల్ ముకుందుని॰ జయ॰ కల్లోలమాలావృష
త్సమశ్రాఘలచారుకో॰ రణాలస॰ శ్యా..దంబినీకాయమా

వనితాంతాంచదనంతమంటవగతాంనంతస్ఫుటానంతశో
భనశయ్యాంతరశాయి భక్తగణసంపద్దాయి సొక్కొమ్మడిన్. ౬౨.

కం. కని సాష్టాంగప్రణమిత్యతనులై భక్తిప్రసక్త్యంతనులై గరయా
తనులై సఫలచిరప్రయత్నతనులై వినుతించి రివ్విధంబున వరుసన్. ౬౩.

కం. నలువకు నిది యీదృశమని, పలికి నిరూపింప వలనుపడ దద్దిరయో యా
వెలుఁగుంగనుఁగొంటిమియిక, గలుగదుకదదొవఁగుటిర్ణుఁగడలుకొనంగన్. ౬౪.

గీ. జలధిపాత్రపయస్స్నిహాసర్పరాజ, వర్తిఫణమణిదీపాగ్రవర్తికజ్జ
లప్రభునజాండభాండజాలప్రభునినుఁ, గంటిమోహాంధవృత్తిఁబోఁగంటినధిప.

గీ. కృష్ణవర్త్మాహ్వయంబు నాకింతవట్టు, మలినమార్గుండ నగుటచేఁగలిగెఁ గాని
కృష్ణ నినుఁ గాంచుదాకి నేనిపుడు కనుట, వలరె నిర్దుష్టసాధ్వర్థనామముకుంద.

గీ. దితిజగణభయరోగాధమత వహించ్చటను గదా నే గదాధరుండ ననుపేర
నుంటినింతకుమును గదాయుధవహింతు, నిఁక గదాయుధధారినామక యశంబు.

కం. అజ "నేతిబీర" వలెఁ బున్న్యాజనుం డని నాదు పేరువ్యర్థము సుమ్మీ
ప్రజ లెఱుఁగ నింతదనుక, న్నిజమవినంవాది యయ్యెనేఁ డది నాకున్. ౬౮.

ఉ. కట్టడిఁ దొట్టి దానవనికాయము కాయమునందు హస్తము
ల్గట్టిగఁ బట్టి పాశములఁగట్టుటఁ బట్టి జగం బెఱుంగనే
బెట్టుగఁ బాశహస్తసమభిఖ్యవహించితి నిన్నినాళ్లునా
కట్టి సడి న్మడి న్విడువ నయ్యెఁ గదయ్య ముకుంద యిద్యెడన్. ౬౯.

ఉ. నాదు మహాబలుం డనెడునామము మిక్కిలి సత్త్వహీనుఁడ
న్వాదు ఘటించె దైత్యబలవర్గబలార్భటికాఁగ కేడటం
బేది పలాయనప్రవణవృత్తిభజించుట నింతకాలమో
శ్రీదయితా భవత్కరుణచే నిపు డొందె బలాధికార్థమున్. ౭౦.

చం. దనుజాలు బల్మిఁ గల్మిఁ గొనిదర్పమునం బురమాక్రమింపఁగాఁ
గనుకని భీతిఁ బర్వ వలకావిభుఁడం చొరు లింత కాలము
న్ననుఁ వల కుత్సితప్రభుఁ డనం దగు నర్థముఁ దోఁచుఁ బిల్వనుం
టిని గద యింక నీకరుణచే నలకేశ్వరసంజ్ఞ సొంపదన్. ౭౧.

కం. కరికృత్తివసానతచేఁ, బరఁగితి మున్నేనుఁ గృత్తివసనుఁడనన్నే
డరిహృతసర్వస్వతచే, ధరియించిన యక్కొఱంతం దప్పెఁగద హరీ. ౭౨.

కం. అని యింద్రాదిదిగీశులు, తన తన పడినట్టి కష్టందశ లిట్లెఱిఁగిం
చి నుతించి రేకముఖముగ, నెనసి పురస్థాయిఫణధరేశ్వరశాయిన్. ౭౩.

దండకము—శ్రీ మన్మహానర్ఘరత్నచ్ఛటోదారకోటీరకోటీరవిజ్యోతిరాటీకనోద్గ్రీవ
పశ్యద్ఘనధ్వాంత విభ్రాంతికృత్కుంతలాత్యంత కాంతాళికాంతాభి రామాననా
యిందిరామాననాథీన నానాజగద్వల్లభా గల్లభాస్వన్మణీమండలాఖండలాలిత్య
భాక్కుండలా కుండలీశానతల్పా యురస్థాయితల్పా సదానిర్వికల్పా కనత్కౌస్తు
భాకల్పకా సత్యసంకల్పకా భక్తబృందాలయాళిందకల్పా యనల్పానుకంపా
మతీ భూరిశంపాతతిద్యోతమానాంబుదాడంబర శ్రీసమాలంబిజాంబూనదా
చ్ఛాంబరాంగప్రభా సుప్రభావా శుభావాస వాసంతవేళాప్రఫుల్లప్రసూనప్రతా
నోల్లసన్మల్లికావల్లికాకారరేఖానఖాలీమయూఖా ప్రవాహాభంగగంగానుషంగాం
ఘ్రిపద్మద్వయా యద్వయా చిద్విలాసా కలాసాదరా ఖేదరాహిత్యకృత్ఖ్యాతి
పాండిత్యనిత్యాదరా మేదురామోదదామోదరా పాదసేవైకహేవాకభావాకలంక
స్థితింబొల్చులోకంబులోకంబుహస్తా నిరస్తాఖిలాంహస్తమస్తోమవృత్తిన్సమస్తప్ర
శస్తప్రకర్షోపపత్తిం బ్రవర్తించి యంచద్వివేకాతిరేకంబులై యంబుజప్రోద్భ
వాదుల్నిరూపింపఁగా లేనివిజ్ఞానసంపత్తికిం బాత్రభూతంబులై సర్వభూతప్రకృ
ష్టానుభావంబుచే విశ్వభూతప్రభూ! తత్క్షణంబే నమద్రక్షణాక్షీణవైచక్షణీ లక్షి
తాక్షుద్రదాక్షిణ్య మా నీకటాక్షప్రసారంబునుం జెంది యానందమునుం బొందుచు
న్ఘోరదుర్వారనిస్సార సంసారకూపారపారంబునుం జేరి నీదౌ పరత్వస్వరూపంబుఁ
బ్రాపింపఁగా నోపు నోపుండరీకాక్ష యీయక్షయాజాండభాండంబులం గుక్షి
నిక్షిప్త విక్షిప్తముల్సేసి రక్షించుదీక్ష న్నిరీక్షించు నీ వేల నీవేల నీవేల నుద్వేల
దుర్విక్రమాభీల విద్విట్కృతోద్వేగయోగార్తి ఘోషించుమమ్మేల రాకుండు
వంచుం గడు న్నమ్మి యుండం గృపాయత్తచిత్తంబునం దత్తఱం బంద నీకుండ
నీవ్యూహలీలాసముత్సాహ మాదివ్యదేహంబు దర్శించు భాగ్యంబు మాకుం బ్రసా
దించితో నింతకు న్మున్నుగా నెన్నియో వైభవోదాత్తలీలావతారంబులం బూర్ణ
తిర్యక్స్వరూపంబుగా నర్ధతిర్యక్స్వరూపంబుగాఁ జూపి పాపిష్ఠరక్షఃకృతోప

ప్లవంబు న్నివారించి తీ ఖింక మాయుంకిలిం దీర్పఁగా నివ్వ డొక్కింత యేదేని యుం బిన్నసైయున్ననుం బన్నుగాఁ జెన్నుగా వన్నెఁ గాన్పించి వర్ణింపఁగా వర్ణియానట్టిరూపంబుచే నేవు దీపింపఁగా నోపరంధామ యుద్దామసామర్థ్యమును జూపవే పాపము ల్బాపవే యాపదుద్ధారకా కోపకాపట్యనిస్తారకా సచ్చిదానందకందా సదాస్పంద గోవింద మమ్ముం దరిం జేర్చి కాపాడవే దేవదేవా నమస్తే నమస్తే నమః. ౮౪.

మం. అని యాసర్వసువర్వు లాత్మదళ లాత్మాభీష్టము ల్విన్నవిం
చిన భక్తాభయదానదక్షుఁ డగులత్మీపక్షుఁ డబ్జాక్షుఁ డి
ట్లనియె న్వారలఁ జూచి మీచిరతరాయాసంబు లిం కుండునే
చనుఁడీ మీరలు మీయథాగతముగా నంత్యక్తసంత్రాసులై. ౮౫.

కం. అన విని యాగీష్పతి యి, ట్లనియె న్నీ వానతిచ్చినది వరమే నైయె
నను సైరింపఁగవలె నొక, మనవి నొనర్చెద మరుత్సమాజశరణ్యా. ౮౬.

కం. దేవరసంకల్పంబ క, దే విశ్వోత్పత్తిసంస్థితిలయంబులనం
గేవల ఘటనఘటనా, ప్రావీణ్యాత్మున కొకింత పనియే యిదియున్. ౮౭.

కం. చనుఁడీక క్రమముండునె మీ, కనినంతనె వెలివు దొలఁగు నట వే యన్నం
బనినం దీరునె యాఁకలి, తిని తనియక యున్నచో క్షుధితునకు నెందున్. ౮౮.

ఉ. నేరము నేరు పెంచకుము నేరము నీకడఁ గోర్కెఁ దెల్ప నీ
వారముగాన నిట్లు బహువారము దెల్పఁగఁ జెల్లె మాకు నీ
సారముఁ దొల్లి చూపితి వి సారముఖోత్తమదివ్యమంగళా
కారము లాని యిప్పు డుపకారము నే తను వూని సేసెదో. ౮౯.

కం. ఎప్పటి కెవ్వగిదిని మ, మ్మెప్పటి వలెఁ జాదు కొల్పెం దెలిఁగింపుము మా
యప్పా దాగ్ధస్థితికై, యిప్పాటనభీతమతుల కెలుఁగఁగ వలసెన్. ౯౦.

గీ. ఏను జీవుఁడ ననియు నీవీశ్వరుండ, వనియు రూఢార్థసంజ్ఞవిఖ్యాత మగుట
వృద్ధఘటన్వర్ణభూషోపమేయ మగుచు, మనకుఁ దనరారుఁ గాదె సంబంధ మీశ.

చం. అన విని జీవుఁ గాంచి పరమాత్ముఁడు వల్కె దయాత్ముఁడై స్మితా
ననముస సంజ్ఞ రూఢమయిన న్మతి యౌగిక మైన నేమి వ

గ్గనుఁ గద వాఁడంభేద మని•కాని యభేద మటంచుఁ గాని యీ
వ్వనిమతి జీవుఁ డీశ్వరుని• భాస మటంచు దృఢత్వ మందునో. ౧౨.

గీ. ఏలకామ్యార్థులైనమీ•కిపుడు మోక్ష, సరణి యిట్టిది యనితెల్పఁ•జాలదొక్క
యింతమాత్రంబెయీతెల్వి•దృఢముగాఁగ, మదిఁగుదురుకొన్నసోబుధ•మాన్యచరిత

గీ. క్షణికమదమాత్రమున నిట్లు•సంభవించె, నధిగతమధర్మఁ డైనబు•ధాధిపతికి
నిత్యమదమత్తులకు నెట్లు•నిల్చి యుండు, ననిశముగ స్వర్గభోగమ•య్యసురులకును.

క. అని యింద్రువంక మొగమై, వనజాక్షుం డాన తిచ్చె•వాంఛాలాభం
బొనగూడును తపమునఁ గా, కనఘం బది సకలవాంఛి•తార్థము లొసఁగున్.

మ. స్థిరపై సొప్పుకళింగమండలమునన్•దివ్యస్థలం బస్మదా
దరణీయం బఖిలేష్టదాయకము సిం•ద్ధక్షేత్రమై తార్క్ష్యభూ
ధర మష్టాక్షరిమంత్రరాజము సము•ద్యన్నిష్ఠ నచ్చోఁబురం
దరభక్తిన్ జపియించు నాతనికిఁ జే•తం జిక్కు నష్టార్థముల్. ౧౬.

కం. నీవచ్చో మితకాలం, బావిర్భూతప్రపత్తి•నమ్మంత్రజపం
బావర్తించిన మదిలో, భావించినవాంఛితార్థ•ఫలము లభించున్. ౧౭

గీ. అని యనుజ్ఞ నొసఁగి•యాంగిరసుని గాంచి, వనజనాభుఁ డిట్టు•లనుచు నాన
తిచ్చె నేము నిశ్చ•యించినకర్జంబు, లెల్ల నొకట నిర్వ•హింపవలయు. ౧౮.

సీ. వచ్చినదారిగా•వరుసదైత్యుల నెల్లఁ, బాతాళమును జొరఁ•బనుచు టొకటి
మీమీపదంబుల•మిమ్ము యథాపూర్వ, ముగ సంప్రతిష్ఠించు•పూన్కి యొకటి
నను సుతుఁగనఁదపం•బును బూనచ్చెదునయ్య, దితి కశ్యపులకోర్కి•దీర్చు టొకటి
తార్క్ష్యశైలాఖ్యసింధ్ధక్షేత్రమహిమంబు, స్థిరముగా వెల్లడి•చేయు టొకటి.

తే.గీ. యిన్నియును మాదువైదగ్ధ్య•మెఱుకపడఁగ, నొక్కటరచింపనవతార•మొందువార
మేముమీకోరినట్టుల•యిపుడ పిన్న, యనఁగ వర్ణియనంగ మీ•రరుగుఁడనిన. ౧౯.

ఉ. దేవ మహాప్రసాద మని•ధీరమతిం దగ సాఁగిమ్రొక్కుచో
నావనమాలి కన్నులఁ•గొనంత సురల్ దలిదండ్రులందఱుం
గావర యంచు నయ్యదితి•కశ్యపులం గని తెల్ప గారుడ
గ్రావముఁ జేరి బంధురన•రస్తుటసీమ వసించి రందఱున్. ౨౦.

ఉ. అచ్చట నొక్కకూటతట మం దుటజంబున నంబుజోదరుం
బొచ్చెము లేనిముచ్చటల ముద్దులపట్టిఁ గాంచు నిచ్చల
న్నిచ్చలు నిచ్చలంబయిన నిష్ఠఁ దపం బదితిద్వితీయుఁడై
యచ్ఛపుఁబూనికం గశ్యప మహర్షి యొనర్ప వసించి హర్షియై. ౯౧.

కం. అరుణోదయంబునకు మున్నరుణోపముఁ డతఁడు లేచి హరిఁ బొగడుచు బం
ధురగతిఁ సతితోరా బంధురసరసిఁ గృతావగాహనుండై యంతన్. ౯౨.

గీ. వాన రారంభవిధు లెల్ల వరుస నందు, నెరపికొని లేచి ధర్మపత్నియును దానుఁ
బర్ణశాలకు నరిగి తత్ప్రాంతసీమ, వెలయు నశ్వత్థతరుమూల వేదిఁ దరిసి. ౯౩.

సీ. అనతిదూరమున దర్భాసనంబునకుఁ బార్శ్వమునందు నలఁతి పావలను విడచి
సప్తకచ్ఛములతో సరిమడమలుదాఁక, ననుఁబట్టుపరిధానమును ధరించి
దళముగా ముఖసుఖస్థలముల గోపిచం, దనమున నూర్ధ్వపుండ్రములు వెట్టి
పద్మాసనస్థుఁడై పైనిండ ముసుఁగుగా, నావికప్రావారమలవరించి

తే.గీ. మ్రోలఁ దామ్రమయామలస్థాలికయును, గేలఁ జిలుతప్రవాళాక్షమాలికయును
గ్రాలఁ బ్రాఙ్ముఖుఁడై యర్ధమీలితాక్షుఁ, డగుచు ముని ద్వాదశాక్షరిఁ దగ జపించు.

ఉ. ప్రొద్దున లేచి బంధురసరోవరమందునఁ దీర్థమాడి పే
రొద్దికతో సమిత్కుశఫలోదకపుష్పము లంది యిచ్చుచుం
దద్దయు భక్తిమీఱ నిజనాథుఁడు చూడఁగ నీడగా సదా
యొద్ద మెలంగు నయ్యదితి యొక్కక్షణమైనను బాయు కర్మిలిన్, ౯౪.

సీ. వెలిపట్టురైక పైపీఁపు నిండఁగఁ బైఁటు, మలఁచినమడికచ్చవలువతోడఁ
దడిపి దళంబుగాఁ దగవలందినచాయ, పసుపునిగ్గుల వక్త్రపదము తోడ
నలికభాగమునందు నడ్డుగాఁ బెట్టిన, పాడికుంకుమపుబొట్టు పొందు తోడ
జెప్పలపైపాటి కప్పుదేరఁగ నిడ్డ, గాటంపుఁగాటుకకనులతోడ

తే.గీ. పామిపలితసమాయతా శ్యానమృద్వ
రాళపశ్చాద్ఘటితకచ గ్రంథితోడ
నెదుట నర్ఘ్యంబుఁ గూర్చి య య్యదితి సేవ
సేయుచుండును బతితపస్సిద్ధి ప్రోలె. ౯౫.

కం. మునిపతి యీగతిఁ దపం, బొనరిచి దీక్షావసానమున నొక్కఫలం
బును మ్రోలఁ బడసి తా నగ్రమును గొని సాఁబాల్కశ్రమునకు నొసంగన్.

ఉ. ఆమె మహాప్రసాద మని యంజలిపట్టి గ్రహించి భక్తితో
వేమఱుఁ గంటనద్దికొని వేడ్కభుజించె మహాపతివ్రతల్
సామి భుజించు వెన్క విఘసం బమృతాధిక మంచు నెంతు స
ద్భామల కంతకంటెను సుధాక్రతుశేషములా విశేషముల్. ౯౮.

కం. పతిభుక్తశేషభక్షణ, మతివల కిష్టార్థసిద్ధి నాయుష్యంబున్
సతతము సౌభాగ్యము సం,తతివృద్ధి శుభంబు సిరి ముదంబు నొసంగున్. ౯౯.

గీ. ఏరికేవియు ధర నొకు లిడక యుండఁ
గా నయాచితముగఁ బ్రాప్త మైనఫలము
భావినిజవాంఛితార్థలా భంబుఁ దెలుపు
గాన నది తెల్పె వారసంకల్పసిద్ధి. ౧౦౦.

కం. సంపూర్ణసమాప్తతప, స్సంపత్ఫలతత్ఫలైకచర్వణమహిమం
బెంపగుసొంపున నమ్ముని, జంపతులకుఁ బొడమె నిండుజవ్వన మంతన్. ౧౦౧.

సీ. ఉలుపొగ లావణ్యమలవరించిన భస్త్రిక యనంగఁ దనువు బింకము వహించె
నవలఁ గా లిడఁ బ్రాయమరవ్రాల్చి క్రమ్మఱ, నిల్పుదల్పు లనఁగఁగ నెప్పలెగసె
విడిచి నజర వీడ వృక్షపక్షిన్యాయ, గతి నంగకంబులకంప ముడిగె
మునుముట్టడించిన ముదిమిసైన్యం బునాఁ, బలిత మెల్లను బటాపంచలయ్యె
తే.గీ. వార్ధకపుదాడిఁ గాంచి యౌవనవిభుండు
పలసఁ బోసెంచి శృంగార వాహినీశు
తోడుఁ గని దంపతీదేహ దుర్గసీమఁ
జలన మొందక పురికొని నిలిచె నపుడు. ౧౦౨.

కం. అపుడా దంపతులకె కా, దుపత్యకాధిత్యకాంత రుర్వీధరభా
గ్విపినమ్ములకును మాధవు, కృపయావన మంకురించి యిగురొత్తె రహిన్. ౧౦౩.

ఉ. అట్టివసంతవేళ కపినాంతర మందు మునీంద్రుఁ డింతితో
నట్టిటు సంచరించుచు వియచ్చరమంత్రినియుక్తిఁ గేలుగే
ల్వట్టి నికుంజగర్భములఁ బల్లవయుక్తిగ నంత నంతఁ జూ
పట్టినయప్సరస్సతుల వైఖరు లారసి కామవిద్ధుఁడై. ౧౦౪.

శా. ఆయాపుష్పనికుంజపుంజముల నాయాయాకుటీరంబులన్
దాయానిర్ఝరవారిపూరముల నాయాకూటఝూటంబులం

దాశాకందరమందిరావళుల నా•యాసానుదేశంబులం
దాయావింతలఁ గాంచుచుం దిరి గిర•త్యంతంబుఁ దద్దంపతుల్. ౧౦౫.

చం. అటులు వవ ల్సుగి ప్రవరుఁ•డాత్మసతీసముపేతుఁడై కుభృ
త్కటకదరీఝరీవిపిన•కౌతుకము ల్గనుఁగొంచు నేల న
య్యుటజముఁ జొచ్చి యచ్చట న•ముత్సుకలీలల నోలిఁ గేలి లం
పటమతియై సుఖానుభవ• భవ్యతనుండఁగఁ గొన్ని నాళ్లకున్. ౧౦౬.

కం. అప్పుడుఁ తులమిన్నకు నెల, దప్పెం దోడ్తో సురద్రవ•తానముముప్పల్
దప్పెం గైత్యలయొప్పుం, దప్పె న్మనిరొడ మనోజు•దర్పముఁ దప్పెన్. ౧౦౭.

సీ. పాదము దట్టపుఁజిట్టు•ముల కుమియఁగ నెంచ, కోకిలింతల కంఠ•కొల్లఁ బోక
నడల మాంద్యము గ్రమ్మ•నడియాడుటుడుగక, నిద్దుర గదురఁగ•నెప్పప్రాల్ప
కాపురింతల కౌశిం•తైవఁ గ్లాంతి వహింప, కరుచి పెల్లైన భో•జ్యముల విడక
బడలిక ల్దఱుచైనఁ • బనిపాట లేమఱి, కూర్పులు మెండైన•నున్న రనక

తే.గీ. పెక్కుగాన్పులు గాంచి పెం•పెక్కినట్టి
యదితి యవ్వేళ నొదవుచూ•లాలితనము
నందుఁ దొలుతటి నవదౌహృ•దాభ్యుదయము
నాఁటివలెఁగాక దృఢపరి•పాటి నుండె. ౧౦౮.

చం. నడు మిది పేన చంద్రకల•నం బచ లోన్నతి మావిధంబునం
బడసెనె యంచుఁ దన్ను నగు•వక్త్రముఁ జన్గవ వెల్లబాఱి న
ల్పడరెడుమోములం దవర•నయ్యెడ నందఱు వేడ్కఁజూడఁ జా
లెడువభివృద్ధిఁ గాంచె నిల•లేములు కాఁపురము ల్ఘటించునే. ౧౦౯.

శా. మింటం ద్రిమ్మరువారిఁ బ్రోచుటకు లం•క్ష్మీజాని గర్భస్థుఁడై
యుంటం బంటవెలందిగోడ భవదీ•యుల్గాడ రక్షార్థ్హ లీ
దంటం గావఁగ వేఁడుకొ మ్మనుచు నాం•త్య్రోదముం జేర్చె నా
మంటిం డింటుక్కునై కడంగె మునిభా•మారత్న మవ్వేఁకటిన్. ౧౧౦.

ఉ. ఆదరి నున్న తాపసకు•లాశ్రమసీమల నుండి పెద్దము
త్తైదువరాండ్రు కొండ ఱవు• డామెను జూడఁగ వేగుదెంచి న

మ్మోదపుగోష్ఠిచే నెఱుసుపుత్తురు వింత తెలుంగు కందమూ
లాదుల సంతరించుకొని యర్మిలి నూడిదఁ దెచ్చి యిచ్చుచున్. ౧౧౧.

సీ. నివరిఁ బ్రాల్పోసి వండినబువ్వయిణిపాల, పరమాన్న మొకదాని పత్ని యిచ్చెఁ
దనప్రోపుఁ గాంచి క్రొత్తగ ఫలించిన వింత, చెట్లపండ్లొకముని స్త్రీ యొసంగె
నిజగృహారామమంత్రితసిద్ధమహిమాతు, తల నొక్కమునివధూతిలకము నిచె
యవమయష్టికపిష్టనవఘృతపక్వఖాద్యము లొక్కతలబిసియిల్లాలు దెచ్చెఁ

తే.గీ. దాను బూజించు దేవిపాదముల మీఁది, గొనలు నిర్మాల్య మొకతపోధనపురంధ్రి
యిడియె సీమంతశుభశోభ నెసఁగుతళ్య, సమునిసామంతసీమంతవతికి నచట.

సీ. చరణము ల్నిడుపుగా సాఁచి కేలొక్కటి, పుడమిపై నూఁతగా నిడి వసించుఁ
గూర్చున్నతటి నాయతుండు రాఁ దవుదవ్వ, నసఁ గాంచి కడుఁ బ్రయత్నమున లేచు
ద్విత్రాంఘ్రివిన్యాసమాత్రన దరితరు, స్కంధాదులవలంబకముగ నడచు
నొకకొంత లేనిరోపికఁ దెచ్చికొని భర్త, కుపచార మొనరింప నుద్యమించు.

తే.గీ. వలసదృష్టులవలయావస్థలను దెలుపు, నలఁతియొలుఁగునఁ బరిమితోక్తులను బలుకుఁ
గలికి నీర్కావివలిపెంపు వలువఁ దాల్చు, నెలలు నిండినకొలఁది నవ్వెలఁదిమిన్న.

కం. ప్రొద్దులు కడచినకొలఁది, న్మద్దియ కచ్చోటవేలుపుంజేడెలు తా
రొద్దఁ జరింపుచుఁ దద్దయు, నొద్దిక నొనరింపుచుండి రుపచారములన్. ౧౧౪.

కం. వైజనన మిదియె యని బర్వ, వై జననము నొంద నున్న యాగర్భవుసా
రాజవనిబడలికలతి, రాజననిచయమున కెఱుఁగున ట్లొనరించెన్. ౧౧౫.

సీ. శ్రవణగమ్యముగ వారణ్యకోపనిషత్తుఁ, బారాయణముఁ జేయ వలయు నేమొ
బలమెలర్పఁగ మహేశ్వరునిముంగిటి నంది, బట్టియిట్టటుఁ ద్రిప్ప వలయు నేమొ
గుక్కలొక్కటి రెండుఁ గ్రోలఁగా స్వధితిచే, జలము మంత్రించి యీ వలయు నేమొ
కచమునం దిడుకొనంగాఁ బత్రపుటముపై, విలిఖించి యంత్రమీ వలయు నేమొ

తే.గీ. యనుచు శీఘ్రప్రసూత్యుపాయజ్ఞులెల్ల, నుటజబహిరంగణంబున నుండి రపుడు
జరఠమానికుటుంబినీజనని యుక్తి, నొక్కటఁ దదీయబాలకాహూతు లగుచు.

గీ. అపుడు పురిటింటిదరి నున్న యాంధ్రలోవ, నొకతె శీఘ్రోదయము నునర్థోక్తితోన
పలికె మగవాఁడె యనుచు సంభ్రమ మెలర్ప, నీవలను వేళ బరికించు బుషులు వినఁగ.

ఉ. అంత నభస్యమాసమున • నాదిమపక్షమునందు యామినీ
కాంతుఁడు శ్రోణయందు రవి • కన్యకయందున నుండ ద్వాదశిం
గంతుగురుండు లోకములఁ • గాచుటకై యుదయించె వాసరా
భ్యంతరవేళ నయ్యభిజి • దాహ్వయలగ్నమునం గృపామతిన్. ౧౧౮.

ఉ. అప్పుడు విప్పుఁగంటిదొర • లందఱు నం దరుణాబ్జనేత్రముల్
కప్పు మెఱుంగుగాత్రమును • గల్గినయమ్మునిపట్టి పొట్టిరూ
పొప్పఁగఁ బుట్టినట్టి పురు • షోత్తముఁ గాఁగఁ దలంచి సన్నుతుల్
చొప్పడఁ దొంటి దెవ్వరవుఁ • జొప్పడగెం దమకంచుఁ బ్రీతులై. ౧౧౯.

కం. ఆనతి యొసఁగిన గతి మన, పై నతికృప నవతరించె • భగవంతుఁ డటం
చానతిపూర్వకముగఁ బెం, పైనతిరోధానశక్తి • నరసిరి భక్తిన్. ౧౨౦.

కం. సుమనఃకాండంబుగ నల, సుమనఃకాండగురుఁ డదితి • సూనుం డగుటన్
సుమనఃకాండంబులు మహి, సుమనఃకాండములవృష్టి • శోభిలఁజేసెన్. ౧౨౧.

గీ. జాతకర్మాఖ్యసంస్కార • జాతశర్మ, శాలిఁ గావించె సుతు ముని • శాలిమాలి
వీత విచికిత్స యజ్ఞోప • వీత మొసఁగి, నాభికృంతనవిధివిధా • నాభికాంక్ష.

గీ. అధిగతమనోరథుం డా, బుధమాన్యుఁడు శిశువుకుశల • మునకై రక్షో
వ్యథఁ దొలఁగఁగఁ బదిప్రొద్దులు, విధిగ ఫలీకరణహోమ • విధి యొనరించెన్. ౧౨౨.

సీ. ఉల్లిపాట్లావాలు • నుముక రాఁజెడుపాగ, ల్గడపల పొదిగిళ్లఁ • గ్రమ్ముకొనఁగ
గుమ్మంపుఁ బైవంకఁ • గ్రుచ్చినపచ్చిభూ తులసి మాబీరతోఁ • గలసి వ్రేలఁ
బార్శ్వద్వయమునందు • వ్రాసినగోమయ, ప్రతిమల స్పష్టాంగ • భంగిఁ దోఁప
నింగువ పొంగింపు • లెసఁగింపఁ బొసఁగిన, కటుగంధ మెల్లెడఁ • గడలు కొనఁగఁ
జమురు ముంచివెలింగించి • సంజనిడిన, దృష్టిదీపాల వెలిమిడి • తెట్టె లలరఁ
గాఁపు గూర్చినతత్సూతి • కాగృహంబు, నాగ్రహంబున నేగ్రహం • బావహించు.

మ. పదిరేలం బదిలంబుగాఁ గడపి యా • బ్రహ్మణ్యుఁ డా బ్రహ్మఁగ
న్నదొరం బుత్రునిగాఁగఁ గంటి నను నా • నందంబు డెందంబునం
బొదల న్వామన సంజ్ఞ నామకరణం • బుం జేసి యచ్చో సభా
సదు లాశీర్వచనంబు లొక్కట సమం • చద్ప్రీతిఁ గావింపఁగన్. ౧౨౪.

ఉ. ఆసతిమౌళియందుఁ బసు•పద్దినయక్షత లీక్షితంబులై
భాసిలె భాసమానగతి • వార్షికవారిదమండలాంతరా
వాసములై కరం బచిర•భావినవాంకురరేఖఁ దాల్చి యెం
తే సొబ గొందు నమ్మెఱుఁగుఁ• దీఁగెలకుంపలనంగ నయ్యెడన్. ౧౨౬.

సీ. నడికట్టు బిగియించి•న చెఱంగు పరిక్రొత్త, చీరలో పండిట•శిశువుఁ బొదివి
యాపాదమస్తకం• బైనక్రొంబసుపుని, గ్గుల పచ్చిమేను సం•కోచ పఱచి
యలసాంఘ్రి విన్యాస•ముల పెద్దలున్నచ, క్కటి కెల్లనల్ల న•గడచినడచి
మను మని మీచిన్ని•మనుమని దీవింపుఁ, డని వారలకు నాత్మ•తనయుఁ జూపి

తే.గీ. భర్తయనుపదమా సాధ్వి • బాలసారెఁ, బండిటఁ జరింప మునులు దే•వతల తతులు
వెతలడఁగనింకననుచున•మ్మతుల నతుల, గతుల మన్నించి రామెస•న్నుతులనుతుల.

కం. అందలి విప్రుల మునిపం,క్రందనుఁ డంపఱను విందు•కై పిలిచి తగన్
మందిరమున న్నాప్రొద్దిల,మిం దనియఁగఁ జేసె నిష్ట•మృష్టాన్నములన్. ౧౨౮.

మ. నెలలో నొక్కనువాసరంబునఁ బురం•ధ్రీశ్రేణి సంప్రీతి పా
టిలఁ బిల్పించి కడంకమై నడితిపం•ట్టం దొట్లలోఁ బెట్టి జో
లలఁ బాడించి యుదంచద్గ్రహాణలీ•లాకౌతుకాచారము
ల్వెలయం గప్పక్రుమొక్కి వాయసము లిం•ప్పించె న్సమంచద్గతిన్ ౧౨౯.

కం. విప్రమణి నందనున క,న్నప్రాశన కేశఖండ•నముఖుసుసంస్కా
రప్రక్రియలను గ్రమముగ, న్నప్రతిహతవిధి నొనర్చి•యలరుచు నుండెన్. ౧౩౦.

చం. ఉపనయనక్రియోచితవ•యోయుతుఁడై సుతుఁ డొప్పుటన్ ద్విజ
త్వపుసిరి సంఘటింపఁ దన•పట్టి కిదే తగుప్రాయమంచుఁ గ
శ్యపుఁ డవు డాత్మ నెంచి ప్రణ•యావహయా సహధర్మచారిణిం
దపసులనుం గనుంగొని మ•నంబునఁ గల్గుతలంపుఁ దెల్పినన్. ౧౩౧.

కం. వారందఱుఁ దనతో నను,వారం దఱచుగ మనఃప్రి•యం బని యంగీ
కారము నెఱిఁగించిన నధి,కారమున ముహూర్తనిశ్చ•యం భావించెన్. ౧౩౨.

సీ. ద్రాక్షాఖాతోత్తంభి•తస్నిగ్ధసరళపూ,గప్రకాండోచ్ఛ్రప•కాండజాల
మాకుతంతన్యమా•నాయతలాంగలీ, పత్రపరిచ్ఛదో•పరితలంబు

సహస్రగ్రథితచూతసాలజాతాచ్ఛిద్ర, చారుపల్లవజాతతోరణంబు
లుడిదిసంఘటితచంచద్దలాంచత్ఫల, స్తబకరంభాప్రతిస్తంభమాల

తే.గీ. మగుచు సజ్జన్నిఁగట్టుచున్నయట్టి నట్టు, నట్టుదట్టంబుగాఁ గనుపట్టె వేగ
మౌనిమాణవకాకల్ప్యమానమైన, కాయమానంబు శుభసూచకముగ నపుడు.

సీ. తత్రత్యఘనతపోధనజనాకారణా, కారణవ్యగ్రసంచారపరులు
జలసమిత్కుశఫలాక్షతవేదిపీఠాది, కద్రవ్యసంధానకరణపరులు
శాకాజ్యదధిపయశ్శర్కరాముఖమహా, నసయోగ్యవస్తుసన్నహనపరులు
ప్రాంతాశ్రమాగతబ్రాహ్మణౌఘస్వాగ, తప్రశ్నముఖ్యసత్కారణపరులు

తే.గీ. నగుచు నమ్ముని రాజశిష్యప్రశిష్య, లఖిలనిర్వాహకులుఁ దారలై చరించి
రపుడు గురుకుల మరయ విద్యార్థికోటి, కాత్మగృహనిర్విశేషభావ్యంబు గాదె.

సీ. శిరసంటె నొకసువాసిని నెన్నుదుట శోభ, నంపుబొట్టిడి దీవనల నొసంగి
నలుఁగిడె నొకవధూతిలకంబు గంధామ, లకముతోఁ బసుపు మేళన మొనర్చి
చిక్కువాలిక యుండ నొక్కసీమంతిని, యటకలివెట్టెఁ బాయలుగ దువ్వి
జలకంబు లాడించెఁ గలశంబులను ముంచి, యొక్కపురంధ్రిక వ్యోష్ణవారి

తే.గీ. నొకకుటుంబిని ప్రాంశుపీఠికను నిల్పి, వలిపె నీర్కావి మడుఁగు దోవతి చెఱంగు
చమిరి మైతడి యొత్తి కైశ్యంబుఁ దుడిచి, కొనముడిఘటించె నమ్మౌనితనయమణికి

చం. తిలకముఁ దిద్దె నెన్నుదుటఁ దీరిచెఁ గాటుక లోచనంబులన్
లలి నిడెఁ జుక్కఁ జెక్కుటను లాక్షఁ బదంబులయందుఁ బూసె మైఁ
గలప మలందెఁ బూపరులఁ గంధర వైచెను బచ్చగోఁచియున్
మొలఁ గదియించె నొక్కసతి పొందుగ నమ్మునిపట్టి కంతటన్. ౧౩౬.

ఉ. ఆమునిదంపతుల్దగ సహర్మ్యముఖమందుఁ గృతాభిషేకులై
క్షౌమవసానులై ప్రవిలసత్తిలకాళికులై సుగంధచ
ర్చామహితాంగులై సుతుక రమ్ములఁ దమ్ములమున్ఫలంబులు
న్నేమ మెలర్పఁగా నునిచి నిల్పిరి పందిట వేది ముందటన్. ౧౩౭.

సీ. సఫలతాంబూలహస్తద్వయంబుగ సభా, సదులైన మయంచు నభ్యాసుమతిని
ప్రార్థింపఁగా వారయంముహూర్తస్సుము, హూర్తోస్తటంచుఁ బీఠోపవేశ

మున కియ్యకొనఁగఁ దాంబూలఫలములు బురోధచే నుంచి పుత్రుఁడును బత్ని
వరుస సవ్యంబుగా వసియింపఁ గూర్చుండి, యాచమనత్రయం బాచరించి

తే.గీ. యతఁడువిఘ్నేశపూజపుణ్యాహవాచ, నములఁ గావించియుపనయనక్రియార్థ
మంతసంకల్ప మొనరించి యాత్మజునకుఁ, బసుపుఁ బ్రాల్నించియుంపించెఁ బంచశిఖలు

గీ. ఆతఁడు పునశ్శుభోదకస్నాతుఁ డైన, సుతుని దగ సంభృతబ్రహ్మసూత్రుఁ జేసి
యంకురార్పణ మొనరించి యటుల సకల, నాందిముఖకృత్యసంవిధానములఁ దీర్చి

గీ. బ్రహ్మచారులఁ బూజించి స్వసుతువారి, పంక్తిఁ గూర్చుండఁ బెట్టి యవ్వరతపస్వి
యర్థ నిర్వర్తితాభ్యవహారుఁ డైన, వాని లేవంగ నెత్తె సత్వరముగాఁగ. ౧౪౭.

మ. ఉచితాచారముగాఁ బురోధయును దానుచ్చావచాశీర్వచో
రచనాసంభ్రములై సదస్యులగు సర్వబ్రాహ్మణగ్రామణుల్
ప్రచురప్రక్రియ నానతీసుతునకుం బ్రహ్మోపదేశంబు మా
నిచయాధీశుఁ డొనర్చెఁ దజ్జ్ఞ సుమనోనిర్ణీతలగ్నంబునన్. ౧౪౮.

గీ. అంత నాతఁడు మౌంజికృష్ణాజినంబు, పసుపుగోఁచియు దండంబుఁ బంచశిఖలుఁ
దనర జనయిత్రియొద్దఁ బ్రాథమికభిక్ష, గొని పిదపఁ గైకొనియె భిక్ష జనకునొద్ద.

కం. మహదాశీర్వచనధ్వని, ముహురుక్తతథాస్తు వాదముగ ముగియ మహా
మహులగునార్యులకు ద్విజో, ద్వహుఁ డతఁ డప్పుడు ఫలప్రదానములొసఁగెన్.

ఉ. మున్నుగఁ దామె కైకొన సముత్సుకులయ్యును వారిలోన వా
ర్మున్నుగ మీరు కొందు మటె మున్నుగ మీరలె కైకొనుండటం
చున్నిజము న్వలెం బ్రియముఁ జూపుచు సభ్యులొకింతవంతు పో
తున్న నొసంగి రన్యమునిఁ గొక్కని కగ్రఫలప్రదానమున్. ౧౪౯.

సీ. స్నాతాగతోప విష్టస్వస్తి వాచనో, త్సుకబుభుక్షుద్విజస్తోమపంక్తి
యాస్తీర్యమాణాతివిస్తీర్ణ సాగ్రాంశు, మత్ఫలాతరు దళామత్ర వటువు
పాత్రాభిఘారాది పరివేషణనియుక్త, సాత్త్వికాచార విచ్ఛాత్రగణము
తారతమ్యగృహీతతాంబూల దక్షిణా, ప్రతినివృత్తోత్తమబ్రాహ్మణంబు

తే.గీ. నగుచుఁ గనుపట్టె మధ్యాహ్నమందు మాని, భోజనా[illegible]నకాయమానాజిరంబు
బాంధవాతిథివిప్రసంబాధకలన, వలన మిక్కిలి గన్నులపండు వగుచు. ౧౫౦.

సీ. పుచ్చు కొన్నవి తోడిబుడుతల కిడి వెండి, యును దమ కంచుఁగై కొనెడువారు
బాల్యంబునుండి యభ్యాసంబు లేదంచుఁ, గొని వేఁడికొనిచేత నునుచు వారుఁ
గడు లేఁత వివి యంచు విడిచి వల్లరమందు, ముదురు ప్రక్కలకునై వెదకువారుఁ
గనటు పోవంగఁ బోఁకలు సున్న మడిఁకింప, నెనటఁ బోసి రటంచు నెంచు వారు

తే.గీ. నై యనాహూతజానపదాతిపూత, నైష్ఠికశ్రోత్రియబ్రాహ్మణప్రవరులు
వీటికాదాతల కొకింత వినువుఁ జేసి, రంత నొకకొంతవడిఁ జత్వరాంతరమున.

కం. తదవసరాంతమున న, వ్విద్వత్కులశేఖరుండు విశ్రుత శాస్త్రో
ద్యద్విధిసంధ్యావందన, సద్విధము నుపక్రమించె స్వతనూజునకున్. ౧౪౭.

చం. ఘనమతి నాతఁ డాభ్యుదయికంబుగ మూఁడవనాఁడు కూర్మినం
దనునకుఁ గల్మిమీఱఁగ సదస్యులనెల్లర గారవించి దీ
వన లొనరింపఁజేసి మణివస్త్రసువర్ణవిభూషణాదులం
దనిపెఁ దపోధనుల్ దలఁచినం గొదయే వివిధార్థసిద్ధికిన్. ౧౪౮.

కం. ఘనమతి నాలవనాఁ డమ్మునిపతి తనతనయునకును మునుకొని మేధా
జననం బొనరిచి బంధుల, ననిపెఁ దగ బహూకరించి యనుపమ గరిమన్ ౧౪౯.

కం. ఈవడువున నమ్మునిపతి, యావడుగు ద్విజత్వ మొంది యభివృద్ధిఁ గనం
గా విధిగ నుపాకర్మము, గావించెం గోవిదప్రకాండ యుతుండై. ౧౫౦.

కం. ఆ వెంట వటువు మదిసం, భావించి గురూపదేశమాత్రసవినయుం
డై వేదశాస్త్రముఖనా, నావిద్యాగ్రహణధారణప్రౌఢిఁ గనెన్. ౧౫౧.

సీ. గురుజనంబులకంటె [illegible]గాఁగఁ బూర్వప్రబోధుఁడై తత్పదంబులకు మ్రొక్కి
కల్యకాలోచితకరణీయములఁ దీర్చుకొని పూర్వపాఠచింతన మొనర్చి
పఠనీయపాఠార్థపద్ధతి యోజించుకొని సహాధ్యాయులఁ గూడి యేగి
ఫలసమిత్కుశజలంబులు దెచ్చి యర్పించి, జపదేవపూజావసరములందుఁ

తే.గీ దతి నిరీక్షించి యుండి తత్పరిసమాప్తిఁ, గ్రమము మీఱంగఁ బూర్వపాఠములఁ జదివి
నియతి భుజియించి తగుగోష్ఠి నెఱపి పవలు, రేయి గురువులపిదప నిద్రించు నతఁడు.

కం. కలశభవప్రతిపా[illegible]లంబకార్ముకనిషంగకరవాలకరా
ఖలదూషణ ఖర[illegible], స్ఖలితగుణాకరనిశాచరప్రశమకరా. ౧౫౩.

శా. ఛత్రగ్రాహిక దూర్మి శారమణ చం•చచ్చామరగ్రాహిక
చ్ఛత్రుధ్వంసక కైకయీతనుభవా•ద్వాస్సావిదద్వత్రజి
త్స్వత్రా సభ్యదగాటభల్లుకమణీ•పౌరాణికత్సావనీ
మిత్రద్దాశకులేశ రాజ్యవదల•క్ష్మీధూర్వహాత్మాదుశా. ౧౫౪.

స్రగ్విణి. శ్రీవిదేహాత్మజా•భృత్కుమారీధవా
పావమానిప్రక్ష్య•త్తస్వనామ స్తవా
రావ ణైశ్వర్యని•ర్వాపణప్రాభవా
భావనాతీతది•వ్యప్రభా గౌరవా. ౧౫౫.

## గ ద్య ము.

ఇది శ్రీమద్రామనామపారాయణపరాయణాతిధన్య కౌండిన్యగోత్రపవిత్ర
దేవులపల్లికులపయఃపయోనిధికళానిధిసీతారామశాస్త్రిపౌత్ర వేంకట
కృష్ణశాస్త్రిపుత్ర తమ్మనాభిధానాంతర వేంకటకృష్ణశాస్త్రి
నామాగ్రజన్మ త్రిలింగదేశాగ్రజన్మ సుధీవిధేయ సుబ్బ
రాయ శాస్త్రి నామధేయ ప్రణీతం బైనమహేంద్ర
విజయం బను ప్రబంధంబునందుఁ

చతుర్థాశ్వాసము.

శ్రీసీతారామార్పణమస్తు.



శ్రీరామ.

# శ్రీమహేంద్రవిజయము.

## పంచమాశ్వాసము.



రమ్యవిక్రమక్రమ
కారుణ్యాగభీరతాది♦కల్యాణగుణా
ధార సుధారసధారా
దారవ్యాహార దశర♦థాంగకుమారా. ౧.

గీ. అవధరింపుము శౌనకా♦ద్యఖిలమౌని, మణులఁ దిలకించి రోమహ♦ర్షణసుతుండు
రహివచింపఁ దొడంగెను ♦ రాజభవన,చత్వరస్వనదానక♦స్వానపటిమ. ౨.

కం. అత్తఱి బలి పలభుక్కుల,సత్తముఁ డుత్తమయశుండు ♦ స్వారాజ్యశ్రీ
మత్త తన కడయకుండ న,మత్తత నొకక్రతువుఁ జేయ♦మతి నతినియతిన్. ౩.

మ. ధరణీమండలి కేగుదెంచి ఖగనా♦థత్మాధరప్రాంతమం
దగయ న్యోజనయుగ్మదూరమున విం♦ధ్యాద్రిప్రవర్తోత్కటరా
ట్సరిదభ్యర్ణమున న్జగత్త్రితయపూ♦జ్యం బైనబ్రహ్మేశ్వర
స్ఫురితక్షేత్రము చెంత సంతతసువ♦స్తుశ్లాఘ్యదేశంబునన్. ౪.

కం. వాటముగా నాతఁడు క్రతు,వాటముఁ గావింపఁ జేసెఁ ♦ బ్రాగ్వంశగయూ
పాటీకనవేదిపరి,పాటీకనదనఘగర్భ♦పదశాలము గాన్. ౫.

కం. ఆతఁడు క్రతువం దీక్ష,ప్రీతిగ భువనైకవినుత♦రీతిగ విలస
ద్భూతిగ సకలేష్టదవి,ఖ్యాతిగఁ జేయంగఁ బూని ♦ యారంభమునన్. ౬.

గీ. సన్నిధికిఁ బిల్చి సేవితో♦శనుల సర్వ,మునిసముత్కరదుర్దశా♦శనుల విప్ర
సాధుసజ్జనతాశికో♦శనుల బంధు.సచివభటముఖ్య మానుషా♦శనులఁ జూచి. ౭.

గీ. సాత్వికత మీఱ లోకైక♦సమ్మతముగఁ, జేయుజన్నంబునకు ఫల♦సిద్ధి గలుగుఁ
గాన మీ రెల్లరును సహా♦కారులగుట, వలయుఁ గావున నాపల్కు♦పల్కు వినుఁడు.

కం. దనుజులు మీ రయ్యును భవ,దనుజులు మనుజు లని సత్ప్రి♦యంబునఁ జూడుం
డనిశముఁ దాలిమి గూడుం, డనిశముదాలిమిలితాత్ము♦లగుచున్మతియున్. ౯.

చం. మనుజుల గారవింపుఁడు స♦మర్చ లొనర్పుఁడు విప్రకోటికిన్
మునులకు భక్తియుక్తిఁ దగు♦పూజలుఁ జేయుఁ డభీష్టవస్తువు
ల్దనియఁగ యాచకావళి కు♦దారతమీఱఁగ నిండు నిండుమ
న్నన లొనరింపుఁ డింపు మది♦ నాటఁగ నాటగఁ జూడ కర్మిలిన్. ౧౦.

చం. అని నియమించి మించిన ప్ర♦యత్నమునం గ్రతుయోగ్యవస్తువుల్
ఘనముగఁ గూర్చి ఋత్విజులఁ ♦గావ్యనియుక్తుల భక్తియుక్తిచే
ననుమతుఁడై వరించి యొక♦ యగ్రముహూర్తమునందు దీక్షఁ బూ
ని నియతి మీఱఁగాఁ గడఁగి♦ నిశ్చలనిష్ఠఁ, బ్రవిష్టశాలుఁడై. ౧౧.

గీ. నిలిపెఁ బూర్వోత్తరారణు♦లలవరించి, నిర్మథితవహ్నియగుచుస♦న్నియతియుక్తిఁ
గని పరిస్తీర్ణ మగువేది ♦ గార్హపత్య, దక్షిణాహవనీయము♦ల్దగ నతండు. ౧౨.

సీ. బ్రహ్మసమ్యగ్గీతి ♦ వహ్నులఁ బ్రణవింపఁ,జేసి క్రియ ల్పరీ♦క్షించుచుండ
నధ్వర్యుఁ డొక్కట ♦ నర్హత మ్మంత్రప్రయోగ సామీచీన్య♦యుక్తిఁ దనర
నుద్గాత సామగా♦నోద్యత్ప్రగల్భతా,విస్ఫూర్తి నీశ్వర♦ప్రీతిఁ జేయ
హోత సద్వ్యాహృతి♦ఖ్యాతవైశారద్య,లీలఁ దత్తత్క్రియ♦ల్దెలుపుచుండ
తే.గీ. మఱియుఁదక్కినవార లే♦మఱక తాము, నెఱపుకృత్యంబులత్యంత♦నియతిసలుప
సొరిది వింధ్యావళీదేవి♦సోమిదమ్మ, గొలువ బలి యజ్ఞదీక్షఁ గై♦కొని చెలంగె.

ఉ. అప్పుడు సర్వదేశసము♦పాగతులైన మును ల్సదస్యులై
యొప్పుగ నెప్పుడేక్రియ ప్ర♦యోగ మొనర్పఁగ నర్హ మప్పుడా
చొప్పున నవ్విధు ల్నడపు♦చు న్యజమానుని బ్రత్యవాయము
ల్చొప్పడకుండఁగా నరయు♦చు న్నెఱవేర్చిరి జన్న మెంతయున్. ౧౩.

ఉ. వచ్చినవారి నెల్లను గృ♦పం దనివారఁగఁ దా నవారిగా
నిచ్చును దానవారి కడు♦హెచ్చుఁగ నిచ్చలు మెచ్చి యిచ్చు న
మ్ముచ్చట లచ్చ టచ్చట గు♦ంబుల్కొన బల్కనియాటమీఱఁగా
దచ్చికడ ల్గడల్కనియె ♦ దాతలచేఁతలు ఖ్యాతము ల్గదా. ౧౪.

కం. ఆవార్త కశ్యపస్థిత,పావనవేదిష్ఠదేశ♦మున వ్యాపింపం
గా విని యామునితనయుం,డా వామనమూర్తి యిట్టు♦ లాత్మఁ దలంచెన్. ౧౬.

## వామనమూర్తి బలియజ్ఞశాలకుఁ బోవుట

గీ. దానవారి కడు స్వేచ్ఛఁ♦దా నవారి, గాఁగ మెచ్చుచు నిచ్చువ♦న్గణనగన్న
క్షితిజనశ్రుతి నా కుప♦శ్రుతిగఁ దోఁచెఁ, గాన నిపుడేనచటి కేగ♦నౌనటంచు. ౧౭.

ఉ. అచ్ఛపుబూదిరేకలు మృ♦గాజిన మక్షసరంబు మౌంజియుం
బచ్చనిగోఁచియుం గొడుగుఁ♦బావలు జందెము గిండి దండము
న్మచ్చికచూపులుం జనువు♦మాటలు గాటపుఁ దేజ మొప్పఁగా
నచ్చట యజ్ఞవాట మట♦ కేగె జను ల్గడువింతఁ జూడఁగన్. ౧౮.

కం. ద్వాదశ్వుల నాతనిఁ గని, యాదిత్యుండ యగు నీతఁ♦డని తత్రత్యుల్
సాదరమేదురమోదర,సోదయహృదయులయి చూచు♦చుండఁగ నటకున్. ౧౯.

గీ. అరిగి యెఱఁగినవారి నె♦ట్టట్టులచటి, వారి నందఱ నందంద♦ వావివరుస
లొనర నొగిఁ బల్కరించుచుఁ♦ గునుకు నడలు, గుజ్జుతనపునొడల్ముద్దు♦గులుకనతఁడు

కం. తగ బ్రహ్మఁ గాంచెఁ దొలుతొల్తు,తఁ గనుంగొనె నంత సముచి♦తగతిగ నుద్గా
తఁ గడున్భక్తి నరసె హో,తఁ గనియె సంతసవిధేయ♦తగ నధ్వర్యున్. ౨౧

సీ. చతురత బ్రాహ్మణా♦చ్ఛంసిఁ బ్రశంసించి, ప్రస్తోతఁ బ్రస్తుతిఁ♦ గుస్తరించి
మైత్రావరుణుని సం♦స్మైత్రిఁ బేర్కొని ప్రతి,ప్రస్థాతను వినుతించి♦పోతఁ బొగడి
ప్రతిహర్తఁ గీర్తించి♦ ప్రౌఢి నచ్ఛావాకు, గణుతించి నేష్టను♦ గారవించి
యాగ్నీధ్రుఁ జెల్మిఁగొం♦డాడి సుబ్రహ్మణ్యు, మెచ్చి గ్రావస్తుత్తు♦ హెచ్చరించి

తే.గీ. రొలమిను న్నేతమన్నించి♦యింపుసొంపుఁ, జనువునను వునుదగసభా♦సదులఁ గలసి
తనదుదర్శన మెపుడెప్పు♦డని మనంబు,నందు యజమానుఁ డభిలాష♦ మొంద మెలఁగె.

కం. శ్రౌతవిధి సాంప్రదాయము, నీతనికడఁ దెలియవలయు♦ నెల్లర మనుచున్
బ్రీతిగ నచటిసభాస,ద్వ్రాతము వీక్షింప నతఁడు♦ వర్తించునెడన్. ౨౩.

కం. చనవరులు పుణ్యజనవరుఁ, గని యిట్లని తెలిపి రటకు♦ ఘనుఁ డొకఁ డేతెం
చెను వానిఁ జూడఁగాఁ దగు,ననఘా యబ్బురము లౌర♦యాతని చెయ్వుల్. ౨౪.

గీ. వామన యనఁజూచు • వామనయనఁ జూడఁ, డేమినియతిరెుక్కొ • యామిటారి
వడుగుకడుఁగుయుక్తి • నడుగుయుక్తులసభ, జూడుగుజూడుగునడుచు • నుడుగుననుడు.

ఉ. యాగము బాగుగా నెఱపి • యాజకరాజి కతండు దక్షిణా
భాగములన్ యథార్హముగఁ • బంచి యొసంగి యొసంగుపేర్మి న
భ్యాగతసభ్యరాజుల నుఁ • దారతఁ దన్పఁ గడంగి మున్నుగా
నీగి కితండె పాత్ర మని • యెంచి వటుం దిలకించు వేడుకన్. ౨౬.

కం. అబ్బలి యబ్బలికరుఁడై, యబ్బలి కెదు రరిగి యెఱఁగి • యాస్ఫురణకు లో
నబ్బుర మంది తదర్చల, నబ్బు రమందిరమునం దఁ • హర్నిశము నిరుల్. ౨౭.

గీ. అనుచుభావించియమ్మహా • త్ముఁనివసించు, దేశనామంబుఁబిత్రునామ • ధేయములును
నతనినామంబుఁ దెలియంగ • మతిఁదలంచి, వినయమెనయంగ నిట్లని • విన్నవించె.

కం. ఎవ్వసుధ నుండువా ర్కీ, రెవ్వరు మీతల్లిదండ్రు • లెయ్యదినామం
బవ్వామదేవుఁడవొ గా, కవ్వారిజభవుఁడవో మ • హాత్మ! తెలుపవే. ౨౯.

కం. అన విని యెలన వ్వొలయఁగ, నను నను నీవడిగినట్టి • యర్థమునకు నే
మని చెప్పుదు నుత్తర మ్మై, నను వినుకలయర్థము న్వి • న న్వలతేనిన్. ౩౦.

గీ. ఇన్నివసుధలుగలవెయి • యున్నవసుధ, యెల్లనాయదిగాదె నా • తల్లిదండ్రు
లెవ్వరంటివి వినుము దే • వేంద్రముఖుల, కెల్లరకునెవ్వరో నాకు • నెన్నవారె. ౩౧.

గీ. ఆత్మదేహాదులసమష్టి • యాకృతియగు, నామమనఁగల్పితమగుసం • జ్ఞకదదాని
కెవ్వరేకతమునవెట్టు • లేర్పరించు, కొనిన నారీతివిఖ్యాతిఁ • దనరుఁజేరు. ౩౨.

చం. అనవుడుఁ దొంటికంటె విన • యం బెనయంగఁ దనంతఁ దానె యి
ట్లనియె మదీయయజ్ఞఫల • మంతయు నెంతయు నీవ యాదు వ
చ్చినపని యాన తిమ్ము కృప • చే సుపచేళిమ మూను దాన నా
ఘనతరభాగధేయము జ • గద్వినుతప్రతిభాతిభాసురా. ౩౩.

ఉ. నావిని నావినిశ్చయము • నమ్ము నిజమ్ముగ నీదువట్ల లో
కావళి కావళిం గెడపు • నట్టిఁడ వంచు నిజేష్టదేవతా
భావన భావనప్రమత సం • పర్యల నార్యుల కెల్ల నెల్లెడ
న్నీవిల నీవి లక్ష్యము గ • ణింప కొనర్చెద వంచునుం జుమీ. ౩౪.

కం. నావచ్చినపనిఁ దెలియఁగ, భావించితి దాత కడకుఁ బ్రత్యర్థులు తృ
ష్ణావశులై భువి నెందుల, కై వత్తురొ యెఱుఁగవే యుదారవిచారా. 3౫.

కం. నీవృత్తి యప్రతిగ్రహ, భావము సూచించుఁ బలుకు వాక్కులను వినం
గా వాంఛఁ దెలుపు ననెదే, మో విను వివరింతుఁ గర్జ మును దెల్లముగాన్.

కం. ఎన్నేనిదానములు కల, వన్నిట దాతకు ఫలంబు లబ్బును గొనునా
రన్నిఁట మేలు వడయరు, కొన్నియ గల వందుభయులకును శుభదంబుల్. 3౭.

కం. బహువిధదానములు ప్రతిగ్రహమున కర్హములు గదవె కన్యావిద్యా
మహిదానము లనువివియుఁ, డిహపరసాధనములుం ద్రయీసమ్మతముల్. 3౮.

కం. అమ్మూఁటిలోనఁ దొలుతటి, దిమ్మేనికి నొదవ దెప్పుడు రెండవదా
నమ్ముఁ గృప నొసఁగి రొజ్జలు, నెమ్మి న్మూఁడవది యొదవు నీవలన నిఁకన్. 3౯.

గీ. ఉన్నచోటనె కదలక యున్న నొప్పుఁ, గాని విశ్రాంతికిటు నటుఁ గదలుటకును
బుద్ధిఁ బొడమిన నెక్కెంత భూమియాత్మవశమునం దుండవలదె యొవ్వానికైన.

చం. మది నటు లూహ చేసి తగుమాత్రము ధాత్రిని నిన్ను వేఁడ ని
చ్చెద వనునిచ్చ నిచ్చటికిఁ జెచ్చెర వచ్చితి దానశూర! నా
కదియును జాలు మూఁడడుగు లంతియె హెచ్చుకొలంది కోర్కెలే
దొదవిన సంతసం బొదవఁ కున్న నొకింతయుఁ జింతిలం జుమీ. ౪౧.

కం. ఉన్నయది చెడిన వగ లే, కున్నది రా మదము రాక యున్నను వగ పే
మున్నది వితరణగుణసం, పన్నా! యెన్నఁగ నయక్రమం బిది కదవే. ౪౨.

చం. అన బలి యోసుయోగ్యమహిమా! మహి మానుషవేషధారివై
కన నగు నెద్దియో యొక జగద్వినుతంబగు దివ్యతేజమా
దని తలఁతు న్నినున్ సఫలమయ్యెఁ గదయ్య మదీయజన్మ మె
వ్వనికిలభించు నీచరణవారి శిరంబునఁ దాల్చు భాగ్యముల్. ౪3.

గీ. అనినవినయోపచారవాక్యములఁ దెలిపి, యేను నొసఁగువాఁడఁ గొనువాఁడ వీవు యజ్ఞ
వాటమిది తటియవభృథావసరముర్వి, దేయమిటుగూడుకొనవలె దేయటంచు.

కం. శృంగారపు మణిపీఠియు, రంగారు మెఱుంగుపళ్లెరము సుదకముతో
బంగారపు భృంగారువు, నుం గొనిరా వఁగనం గనుంగొని పనుపన్. ౪౫.

## బలి శుక్రసంవాదము.

ఉ. ఆరసి భార్గవుండు దను•జాధిపుతో నను నోబలీంద్ర యా
రా! రసికుండ వౌదు తగు•నా యిటు చేయఁ బ్రతిశ్రుతంబు నె
వ్వారికి నెద్ది యొట్లడుగఁ • బట్టుఁ డటంచు నిడంగఁ జూతువే
కారణ మేమి యీతఁ డడు•గం గడుకొంచెపు నేల నిన్నిటుల్. ౪౬.

సీ. ఎవ్వసుధ వసింతు• వీవంచు నడిగిన, నదియిదియని తెల్పఁ•డయ్యె నిజము
తలిదండ్రు లెవ్వరో• తెలుపుమం చడిగిన, వీరువారని నిరూ•పింపఁడయ్యె
నెయ్యది నీనామ• మెఱిఁగింపవే యన్న, నాకృతియే తెల్పు•ననుచుఁ బల్కె
నుపచారపద్ధతి•సోముఁడవా బ్రహ్మవా యన్న నిర్వర•నగుదు ననియెఁ

తే.గీ. గపటవేషంబుగాఁదోఁచుఁ • గాని నాకు, నిక్కమునకునితండు వ•నీపకుండు
గాఁడనుచుఁదోఁచెఁ బరికింపఁ•గారణంబు,లిన్ని యే కావుమఱియు నెం•న్నేనిఁగలవు.

కం. దేవతలకుఁ బ్రాపుకదా, గోవిందుం డతఁడు మాయ•కు స్సఖ్యంబో
తావుకదా ముని శాపముఁ, బో వేఁడిన వజ్రికతని•ముని తెలిపెఁ గదా. ౪౮.

కం. ఈ వటునకు దానత్రయ,మే వర మఁట యందు విద్య • నిడి రఁట యొజ్జల్
గావలె నఁట భూదాన మ,హా వల దఁట దారసంగ్ర•హక్రియ తనకున్. ౪౯.

కం. అమ్మహియుఁ బదత్రయమాత్ర మ్మఁట కావలయుఁ దనకు • దానివలనఁ గ
గ్గమ్మేమున్నదొ యామాత్రమ్మునకును స్వత్వ మెల్ల•రకుఁ గలదు కదే. ౫౦.

ఉ. వంచకు లిట్టివారలె ప్రపం•పంచమునం దమ దైనకర్జ మొ
క్కంచుకరైనఁ బైకి వెలి•యింపక నిస్స్పృహ వృత్తిఁ జూపుచుం
బొంచి స్వకార్యసిద్ధి తుద • ముట్టెదు నంతకు నెంతరైన న
మ్మించి భ్రమింపఁ జూతురు నృ•మీ యడియాసపుటాన గొల్పుచున్. ౫౧.

ఉ. ఎమ్మెయి విశ్వసింపఁ దగ• దీతని బ్రాహ్మణు లన్న మాని వ
ర్గమ్మున బ్రహ్మచారులనఁ•గా విను దేవహితార్థు లాట వీ
రిమ్ముగ నిమ్ముఁ జేరి మన• కెగ్గుఁ దలంపక లగ్గుఁ గూర్తురే
నమ్మఁగ రాదుగా రిపుజ•నమ్ములపక్షములో నివారలన్. ౫౨.

గీ. త్రిదివమును బాసినది మొద• ల్దివిజులెల్ల, మందరాద్రిని గొన్నాళ్లు•మసలిజలధి
తీరమందునఁ గొన్నాళ్లు•దిరిగి గారు,డాద్రిఁ గొన్నాళ్లు చరియించి•రనుచువింటి.

గీ. అందదితితోడ నపుడు క,శ్యపుఁడు తపముఁ, జేసెనటయామె దేవతా,శ్రేణికెల్లఁ
దల్లిగదయంతనెక యువ,దంపతులకుఁ,బుట్టెనటయొక్క మగవాఁడు,పొట్టివాఁడు.

కం. అని మనగూఢచరు ల్గ్వా,డి నసుం గని చెప్పినప్పటికి నేఁటికి నీ
తని కింతవయసు రాఁదగుఁ, గనుఁగొన నీతం డతండు,గా నూహింతుక్. ౫౫.

కం. ప్రణిధుల వెస రంధ్రాన్వే,షణమున కనిచితినిగాని శక్యముగాలే
దణుమాత్రమైన నమ్మని, మణిరత్నౌఘాన్నదిమంత్ర,మహిమ ముపలనక్. ౫౬.

గీ. ఆత్మమాతాపితృసమాహ్వా,యముల నడుగ, నెల్లవేల్పుల తలిదండ్రు,లెవరొవారె
తనకుఁదలిదండ్రులనుట,తథ్యముగనీతఁ, డదితికశ్యపులకుసుతుఁ,డనుచుఁదోఁచు.

గీ. ధరణియున్నదియంతయుఁ,దనదెతాను, వామదేవుండవారిజ,భవుఁడనగుదు
నావినంగను వారిజ,నాభుఁడితఁడు, ముప్పురకభేదమనికదా,మునిమతంబు ౫౮.

కం. మందరగిరిబృందారకు, లందఱు మంతన మొనర్చి యంబుధితీరం
బందున గోవిందుని శర,ణొందఁగఁ గ్రందుకొని రంచు,నూహింపఁదగుక్. ౫౯.

కం. అందున గోవిందుఁడు కృప,కందళితముగాఁగ నదితి,కశ్యపులకుఁ దా
నందనుఁడై గరుడాచల,మం దుదయము నొందియుండు,నని తలఁపనగుక్. ౬౦.

కం. యువదంపతులనుటకు హే,తువు వారు పురాణదంప,తులెయైన మనో
భవగురుఁ డుదరగుఁ డగుటకు, నవయౌవనలీలఁ దాల్చి,నందాల్పనగుక్. ౬౧.

మ. అనివక్ దానవచక్రవర్తి నిజవం,శాచార్యు నీక్షించి యి
ట్లను నోదైత్యకులావనప్రవణశీ,లా! మేలు నీప్రజ్ఞ యెం
తని వర్ణింతును నాదు నిశ్చయము సం,శ్లాఘ్యమ్ము నే నిప్పటుం
గనినంత న్హరు నంతవాఁ డనుచు వేం,డ్రం జెంద నాడెందముక్. ౬౨.

కం. హరునంతవాఁడు హరియగు, హరియంతటివాఁడు హరుఁడు హరిహరతుల్యుం
డరవిందభవుం డీము,గ్గు రభిన్నులొ నములొ తెలిసి,కొన నాతరమే. ౬౩.

మం. నరమాత్రుండును నన్ను వేఁడినది యు,న్నం గ్రన్నన న్మన్ననం
బరితోషించుచు లేదునా కిడుటకై,బాల్యంబునందుండి పూ
ర్ణ్కి గహిం దాల్చిన నాకు నియ్యెడను లం,క్ష్మీజానియైనట్టి శ్రీ
హరియాతం డగునేని యాచయినభా,గ్యం బెన్న నింతంతయే. ౬౪.

కం. పరమాద్భుతగరిమ న్మా,న్నరకరుణ న్మతిప్రతాప•హుని బ్రోచినశ్రీ
నరహరియగుహరి నరుఁడై, యరుదెంచుటకంటె భాగ్య•మన్యముకలదే. ౬౫.

మ. వరయోగీంద్రహృదంతపర్యటనల•బ్ధశ్రాంతి శాంతింప శ్రీ
కరసంవాహనసేవఁ గైకొనినలో•కస్వామియాశౌరిశ్రీ
చరణంబు ల్గలశోదకంబులను సం•క్షాళింపఁగాఁ గంటి నె
వ్వరికైనం బరికింప నీదృశమహా•భాగ్యంబు ప్రాపించునే. ౬౬.

కం. జలనిధికిఁ గలిగె మును నేఁ, డలవడియె న్నారు శౌరి•యంఘ్రులఁ గడుగం
గలభాగ్యము సిరి నిడ వది, యిల నిడ నిది హరికిఁ గాంత•లిర్వురునగుటన్. ౬౭.

కం. అన శుక్రుఁడు నివ్వెఱపడి, తనశిష్యునిచేయి పట్టి • తగదు సుమీ యి
ప్పని నీకుం జెప్పిన విన, వనఘా యిది యేమిపుణ్య•మయ్య బలీంద్రా. ౬౮.

కం. కొలమునకు వేరువిత్తని, తెలిసియు హరి కిష్ట మొసఁగఁ• దివిరెద వయ్యో
తెలిసినవాఁడవొ యేమియుఁ, దెలియనివాఁడవొ యెఱుంగ•దితిజ కులేంద్రా.

కం. తనమేలు నొరునిమేలుం, దనకీడుం బరునికీడుఁ•దలఁపనినినుఁ బో
లినవాని సిరులు సౌదా,మిని మిసమిస లగుఁ జుమీ య•మేయచరిత్రా. ౭౦.

కం. డెందమునం దింపొందఁగ,నిందుకిరీటునిఁగఁ దలఁచి•హితకామునకా
నందము ముందుగఁ గూరిచి, యొందటి కేమిడినఁ బిదప•నిడఁదగుఁ బలికిన్. ౭౧.

కం. శ్రితుని విడనాడి యభ్యా,గతునకు ముని కిడిన ఫలము • గలదే వలదే
శ్రితహితభుజిష్యజనతా,మతిమద్భటబంధుతాభి•మానము వలికిన్. ౭౨.

ఉ. వచ్చినవాఁడు పుచ్చికొని • వచ్చినదారిని పోవఁ జూచుఁగా
కిచ్చటి హానివృద్ధులకు• నిచ్చఁ గలంగును లోఁ జెలంగునే
యొచ్చటి ముచ్చట ల్పరుల•కిచ్చిన నేమి ఫలంబు నాదు ప
ల్కచ్చపురీతి దీని విను•మా కనుమా నను మాన్యదృష్టిచేన్. ౭౩.

కం. ఏరూపంబుననైనఁ బు,నా రాజ్యప్రాప్తి కలసు•నాశిరుఁడు దు
ష్ప్రారంభము లొనరించును, మారుతసప్తకజనిక్ర•మం బెఱుఁగ వొకో. ౭౪.

కం. వారిపయిఁ గరుణ గలఁ డసు,రారి యతం డిప్పు డిట్లు•ప్రహస్యాకృతితోఁ
జేరె నినుఁ గపటవృత్తిం, దా రూఢిగ నమ్ము నమ్ము న•మ్ముమదుక్తిన్. ౭౫.

కం. పలికి వెలయింప కుండిన, గులదేశిక యంతకంటెఁ ◆ గొల దేహి కిలం
గలవే మ్రొక్కెద నిఁకమూ,ర్ఖులకంగా వలదు వలదు◆వల దించుకయున్. ౭౬.

కం. అనుటయు శుక్రుఁ డొకించుక,యును దాఁజేయునది లేక◆యుస్సురటంచుం
జనె నచ్చోటు వాసి వసిం,చునె తనయుడి సాగనట్టిం◆చో ఘనుఁడెందున్. ౭౭.

కం. తానెంతటి బలిదైనం, గానీ తన కవిహితోక్తి◆గడువందగునే
మానం డపుఁ డాతఁడు తన,పూనిక భవితవ్యతావి◆మోహితుఁడగుటన్. ౭౮.

మ. చని వింధ్యావళి యంతలోన మణిభా◆స్వత్స్ఫీతిఁ దోయంబు నిం
చిన భృంగారువుఁ బల్లెరంబుఁ గొనిరాఁ ◆ జేఁబూని యాతండు స
య్యనఁ బీఠం బిడి యవ్వటు న్నిలిపి య◆ర్ఘ్యాభ్యర్హణం బాచరిం
చి నిజప్రేయసి ధారవోయుటకు నీ◆క్షింపం దదాచార్యుఁడున్. ౭౯.

కం. ఎంతతడవైన నంతియ,సంతోషం బడియె చాలు ◆ సమకుఱ రాదే
యంత నొకయంతరాయము, వింతగ ననియాతఁ డొదిగె◆భృంగారువునన్. ౮౦.

కం. బంగారపుభృంగారువు, నంగన వంప నొకబిందు◆వైనను బడకు
న్నంగని బలి యిదియేమను,డుం గుశకాండమున నవ్వ◆టువు వొడుచుటయున్.

కం. సుడివడి వడి నిలఁ బడె శు,క్రుఁడు కన్గ్రుడ్డునకుఁ గాఁడ◆గ్రుచ్చికొనఁగ న
వ్వడు కాణుండై కడునె,క్కుడువడిగా లోహనాళ◆గోళము వోలెన్. ౮౨.

కం. స్వామిప్రియకాముఁడు తన,బాములు గణుతింప కధిపు◆పని చెడకుండం
గా మెలఁగుఁ బతినిరంకుశుఁ,డై మాటలు సరకుసేయఁ◆డనుకొనఁడెందున్. ౮౩.

గీ. ఏమి చెప్పవచ్చు ◆నామెయి శుక్రుండు, సామి హితము గోరి◆"చావుఁదప్పి
కన్ను లొట్టయయ్యె"◆నన్నసామెతకుఁదా, మూలమగుచు నొక్క◆మూల నొదిగె.

కం. గురువును మంత్రియు స్వప్రియ,నిరతుఁడు నగువాని నిట్లు◆ నిరసించినచో
నొరుమాట సరకు సేయూనె, నిరంకుశు లధీశ్వరు ల్గ◆ణింతురె హితులన్. ౮౪.

గీ. అప్పు డందఱు నటు లరు◆దందిచూచు,నంతలో నాతఁడిల్లాలి◆నరయ నామె
పాణిభృంగారువు నొకింత◆వంచునంత, జలజలజలంబుధారగా◆జాఱఁగాంచి.

కం. సాక్షితముగ నయ్యుదకము, నక్షయ్యం బగునటంచు◆ నవ్వటుచేతం
బ్రక్షేపించెను రక్షో,ధ్యక్షుఁడు సద్భక్తి నీశ్వ◆రార్పణబుద్ధిన్. ౮౫.

శా. ధారాపూర్వముగా నొసంగినమహీదానంబుఁ బ్రీతి న్సుధా
ధారార్థంబుఁ బ్రతిగ్రహించె వటుమూర్ధన్యుండు ధన్యుండు వాఁ
డేరూపంబుననైన స్వీయుల భయోద్వృత్తి న్నివారింపఁగా
స్వారబ్ధక్రియ నిర్వహింపఁగ సదా యత్నించు నేవాఁ డిలన్. ౮౮.

కం. ధారంగొని దాతను బహుధారంజకఫణితఫణితిఁ దనియించి మహా
దారంబుగ రూపం బరు, దారం బూనఁగఁ గడంగె నతఁ డపుడు వడిన్. ౮౯.

చం. ధర నొగి నుద్గమించి విదితంబుగఁ బైపయి వ్యాప్తిఁ జెంది బం
ధురగతి మిన్ను ముట్టెను గనుంగొనుచుండెడు వంతలోన స
త్పురుషునికీర్తివ్రాలె నలపొట్టివటుండు పటుప్రభావవి
స్ఫురణము తేటతెల్లముగఁ జూపఱు లచ్చెరు వొందునట్లుగన్. ౯౦.

మ. తనసార్వత్రికభావముం దెలుప రోదఃపూర్ణుఁడై మించువా
మనదేవుం గని దేవదేవ "సకలామర్త్యేష్టసంధాయకా
య! నమస్తే ఖలఘస్మరప్రశమితాన్యాయ్యాయ! తుభ్యంనమో"
యని దేవర్షులు మింటఁ బేర్కొనిరి భక్త్యాయత్తులై యత్తఱిన్. ౯౧.

శా. శుక్రాదు ల్భయవిహ్వలాత్ము లగుచుం జూడం దివ్యాదంబరా
వక్రక్రమలీలచేఁ బెరిఁగి విష్ణ్వగ్ర్యావ్యక్తదీప్తాంగుఁడై
శక్రప్రీతిగ విక్రమింపఁ దొడఁగెం జంచద్గతి న్ధారణీ
చక్రం బంబరచక్రముం బదయుగచ్ఛన్నంబుగా నీగతిన్. ౯౨.

కం. మన్నొకపదమాత్రమ్మున, మిన్నొకపదమాత్ర నాక్రమించి వటుండా
యున్నపదమాత్రమునకో, యన్నా! యేమందువన్న నబ్బలి వలికెన్. ౯౩.

శా. దేవా! తావకసేవకావళికి నెంతేఁ జూడఁగా దుర్లభం
బై వేదాంతశిరఃకిరీటతటవిన్యాసక్రియాప్రౌఢిసం
భావింపం దగి తార్క్ష్యమూఁపు పయి మోపన్నిందు నీదౌపదం
బీవేళం గృప నాదుమస్తకమునం దిచ్ఛారతి న్నిల్పవే. ౯౪.

మ. అనఁ దన్మస్తకదేశమందునఁ దృతీయంబౌపదన్యాసముం
బొనరించె న్దివి దేవదుందుభిరవంబు ల్పుష్పవృష్టు ల్మరు

ధ్వనితావర్తనము ల్మునిస్తుతులు గంధర్వాదిగానంబులుం
దనరంగా నతనిన్రసాతలము నొందం జేయుచు న్మెల్లనన్. ౯౫.

కం. ఆహా రవ మెసఁగఁగ మర్త్యాహారవరు లసాతలాంతరమున క
ర్త్యాహితమతిఁ జని గాద్యర్త్యాహితమతి హైన్య మిడుఁ గందా యెవ్వరికిన్. ౯౬.

కం. మూఁడవపద మటు లిడ ముద, మూఁడ వగ ల్మాఁడనడఁగి యొగిబలితో శ్రీ
రాడవమానితగతిఁ గని, రాఁ డవనికి నెక్కుఁడైన రక్కసుఁడు వెలన్. ౯౭.

చం. బలి గుణశాలియే నికటవర్తులు దుర్ణయమూర్తు లౌటచే
నలవడె నిట్లు హస్తగతమైనచొ కాటపుఁగల్మిఁ బాసి య
గ్గలమగుగాసి నొందఁగ జగంబున నెంతటి దొడ్డవానికిం
గలుగక మాను నే యధికకష్టము దుష్టులఁ జేరఁ దీసినన్. ౯౮.

సీ. వడిశపించుటయెదు ర్వాసుండెతేఁ గేఁగాని, కృపఁదానెతఁ గఁదొలఁగింపఁడయ్యె
వజ్రిదుర్జయుఁడంచు బలివర్కెనేకాని, కలుపు లిప్పటిరీతిఁ గనుఁడయ్యె
గురునివంచనగఁ శుక్రుఁడు తలంచెనెకాని, యిదియిట్టులౌనంచు నెంచఁడయ్యె
సురలఁదోలుటయె యాశరులు చూచిరికాని, తత్ప్రపక బలంబుఁ దలఁపరైరి

తే.గీ. భావియీరీతినుండ నెవ్వారు దానిఁ, ద్రిప్పఁగలరవ్వ దేచొప్ప దేవతలకుఁ
జొప్పడియెనిప్పుడా చొప్పు సోఁకులకును, గూడెఁ దోడ్తోనతిట్టిన గ్రుద్దినట్లు.

మ. బలిఁ బాతాళముఁ జేర్చి యాతనిగృహద్వారంబునం దాను గా
వలి యుండ న్వర మిచ్చి యచ్చట సదాభాస్వద్గదాపాణియై
నిలిచె న్దాసులపాలిపాలనవిధి న్నీచోచ్చభావంబులం
దలఁపం డాహరి తత్పరస్పరవిరోధం బెన్నఁ డెన్నం డెదన్. ౧౦౦.

కం. దైవతమునిసేవితత, త్త్రైవిక్రమమూర్తియై యథాస్థితిమరలన్
గోవిందుఁడు వామనుఁడై, కావించె న్మోద మమరగా నమరులకున్. ౧౦౧.

కం. ఇంద్రానుజుండ వగుట న్నుపేంద్రుఁడవై తివుడు మరల నింద్రునిచేతన్
సాంద్రప్రేమంబునని, స్తంద్రత సేవింపు మయ్య స్వారాజ్యంబున్. ౧౦౨.

కం. అని యనిమిషులు మును లేవ్వఁడిన నన్నాహం బొనర్పఁడి స్వారాజ్యం
బున నింద్రుని వెన నభిషిక్తుని జేయుట కనుచునచ్యుతుఁ డుపదియింపన్. ౧౦౩.

సీ. మృదుఫేనవిశదబుద్బుదలసద్బిందుబృం, దస్ఫూర్తి నమృతకుండంబు నిండఁ
దీనతరాపీనపానవర్ధితతర్ణ, కవినోదమతిఁ గామగవి చరింపఁ
బల్లవకోరకప్రసవఫలవ్యాప్తిఁ, గల్పకద్రుమపంచకము దలిర్ప
ననుకూలగతిఖేల దనుకూలజలవీచి, కాసమున్నతి నభ్రగంగవొంగ

తే.గీ. శ్రీహరికృపాకటాక్షవిశేషమహిమ, నహిమరుచిరోచిరనుషక్తినంబుజాక్ష
వనమురీతినిరీతినివాసిఁగాంచెఁ, ద్రిదివమెప్పటిగతిశ్రీసమృద్ధమగుచు. ౧౦౪.

ఉ. అప్పుడు విష్ణుకంటిదొర లందఱునుం దన వెంటరా గురుం
డప్పురుషోత్తముం దరిసి యస్మదభీప్సితసిద్ధి యయ్యె మా
యప్ప! భవత్కటాక్షమహిమాతిశయంబునఁ జేసి యిప్డు మే
మెప్పటిచొప్పు లొప్ప వసియింపఁగఁ జేయవె స్వస్థలంబునన్. ౧౦౫.

కం. పట్టం బింద్రున కిడక వెసఁ, గట్టుము స్వఃపట్టనాధికారంబునకుం
బట్టినపట్టొనరఁగఁ దుద, ముట్టినఁ గద పౌరుషంబు పురుషున కెందున్. ౧౦౬.

సీ. అదితికశ్యపుల కత్యంతంబునియతిరై, నతుఁడౌచు వారియానతిని బడసి
హేరంబునకుమహాదాగంబుగానంత, సకలోపచారపూజలనొనర్చి
భక్తిమైఁ దారకేశ్వరలింగమూర్తికి, నమృతాభిషేకంబు లాచరించి
శాశ్వతస్థైర్యభాస్వద్వృత్తి నివసింప, శ్రీమహాలక్ష్మిఁ బ్రార్థించిపొగడి

తే.గీ. యీవుసన్నాహమొనరింపు మీయటన్న, వెంటనేయింద్రుఁడిన్నిగావించుకొనియె
బ్రహ్మబ్రహ్మర్షియుక్తుఁడై వచ్చుటయ్యె, నఖిలసంభారములుసిద్ధమయ్యెనయ్య.
గీ. అనుడు శ్రీహరి నవ్వుచు నతనిఁ జూచి, యిట్లనియె నేకతంబున నింతపుట్టె
దానినిపుడైనమరలింపఁ గానఁడయ్యె, నయ్యమరభర్తదానికేమందునయ్య ౧౦౭.

మ. అని యాశ్రీహరి వల్కె గీష్పతి మహాత్మా! చాలదే మున్ను చే
సినలోపం బిపు డట్టులేల మరలం జేయుం బిడౌజుండు పే
ర్కొని సద్భక్తిని దారకేశు నభిషిక్తుం జేయ సంప్రీతుఁడై
కనుపట్టెం బరమేశ్వరుం డెదుట శ్రీగౌరీ సమేతుండుగాన్ . ౧౦౮.

గీ. ప్రేమఁ దనప్రోల సాక్షాత్కరించినట్టి, పార్వతీపరమేశుల పాదములకు
భక్తిసాష్టాంగముగ మ్రొక్కి స్వఃప్రభుండు, స్వాపరాధంబు సైరింపుఁ డనుచు వేఁడ.

కం. కరుణామతి నప్పరమే,శ్వరి యప్పరమేశ్వరుండు♦నం,కందనునిం
గరములను బాదివి రెత్తిరి, కరణార్థుల నుత్తము ల్వి♦సర్జింపరుగా. ౧౧౧.

గీ. అనుచు శేవంగ నెత్తి వా♦రస్మదీయ,భక్తనిర్మాల్యములగౌర♦వం బెఱుంగ
కవమతియొనర్చితివిదాన♦ననుభవింపఁ, గలిగె నీకిట్టిఘోరసం♦కటము లింద్ర.

గీ. అయినదేవరయ్యెనోభుక్త♦మయ్యెఁగాని, యిప్పుడైననుదృశ్యమం♦దించుకైన
నీశ్వరునికంటె భేదమం♦చెంచఁబోకు, దానశాశ్వతైశ్వర్యమొం♦దంగఁగలవు.

గీ. వెసనొనర్పించుకొనుము,తీ♦విష్టపాధి,రాజ్యపట్టాభిషేకభ♦ద్రప్రయత్న
మచ్యుతానుజ్ఞమున్నగా♦నంతదనుక, నింద సాక్షాత్కరించిమే♦ముందు మింద్ర.

కం. అని యయ్యాదిమదంపతు, లనుజ్ఞనిడి నిలిచి రయ్యె♦యచటనె నీవుం
జనుదెమ్మనినఁ ద్రివిక్రముఁ, డనుమోదముతోడ వెడలె♦నాకంబునకున్. ౧౧౨.

సీ. ప్రవితతప్రతిచత్వ♦రప్రతోళీనద్ధ,కాదంబినీసాంద్ర♦కాయమాన
మాబద్ధపారిజా♦తాగపల్లవగుచ్ఛ,తోరణాఖిలగృహ♦ద్వారముఖము
ప్రోత్తంభితాష్టాప♦దోరులాంఛనవైజ,యంతీలసద్ద్వజ♦యంతపదము
నిహితాచ్ఛచింతామ♦ణీభద్రపీఠని,ర్మలసుధర్మాస్థాన♦మండపంబు
తే.గీ. భావుకశ్రీప్రసాధనై♦రావతంబు, చారుసమ్యగలంకృతో♦చ్చైశ్రవంబు
నగుచునవుడొప్పె♦నింద్రపట్టాభిషేక,శుభవిభవసూచకస్ఫూర్తి♦సురపురంబు.

కం. శ్రీమించురథము నిల్పె న,చామరమును సధ్వజంబు♦ నచ్ఛత్రమునుం
గా మెఱయంగ నరయగతి, శ్రీమాతలి హరులఁ బూని♦చి బాజారమునన్. ౧౧౩.

సీ. వరమవదోపాత్త♦విరజాపరిష్కరీ,కుంభదంభక్యాత♦కుంభకుంభ
మీళకవర్గగం♦గాశైవలివ్యంత,రర్ణప్రపూర్ణసౌ♦వర్ణఘటము
నలినజకరకమం♦డులుగర్భితలసంధ్య,తావస్సుఖరజ్జాత♦రూపకలశ
త్రిజగన్నదీనద♦తీర్థాంబుపూరిత,స్వచ్ఛజాంబూనద♦స్థాలికయును
తే.గీ. సప్తరత్నాకరాంతర♦సముపనీత, పరమపావనజీవన♦పాత్రికయును
బంచవిధసారతరుపల్ల♦వాంచితముగ, నుంచిరాస్థానిగురునిశ♦ష్యులు గడంగి.
కం. అమరగవిదధిఘృతక్షీ,రములుం గల్పద్రుకుసుమ♦రందము నమృతం
బమరఁగఁ బంచామృతముల, సమకూర్చిరిమునులురత్న♦చషకంబులలోన్.

చం. వరపుగ నేకనాదమయి • పర్వి యఖర్వసుపర్వదుందుభు
ల్మ్రోయఁగ నేకధారమయి • మ్రొగ్గి మరుత్తరుపుష్పవర్షము
ల్గురియఁగ నేకరేఖమయి • కూడి సురీకరవల్లకీశ్రుతు
ల్బెరయఁగ నేకపర్వమయి • పేర్చెఁ ద్రివిష్టప మప్పు డెంతయున్. ౧౨౦.

శా. స్నాతాలంకృతవిగ్రహుండయి శచీ • సంయుక్తుఁడై దిగ్వరా
న్వీతుండై త్రిదివేశ్వరుండు సురహా • నిశ్రేణి దీవింపఁగా
నేతెంచెం బెరిమెన్ జయంతుఁడు కరం • బింపొప్పఁ గైదండ యీ
మాతాపిత్రనువృత్తి నత్తటి సుధ • ర్మామంటపాస్థానికిన్. ౧౨౧.

గీ. అపుడు తమతమవాసగే • హములనుండి, వనజసంభవవామన • వామదేవు
లచటికేతెంచి సమధిష్ఠి • తార్హపీఠు, లగుచు నిఁకనేలతడవు సే • యంగ ననిన. ౧౨౨.

గీ. దేవరలయాజ్ఞయనుచు స • ద్ధిషణుఁడైన, ధిషణుఁడు శచీయుతముగ న • ద్దివిజవరుని
భద్రచింతామణీపీఠి • పై వసింపఁ, జేసి విఘ్నాధిపతిని బూ • జింపఁ జేసి. ౧౨౩.

మ. విధిపూర్వంబుగ నర్హకృత్యములఁ గా • వింపించి నానావిధౌ
షధిసారంబుల సంభృతాఖిలజగ • జ్జాలస్రవంతీపయో
నిధినీరంబుల నించినట్టికలశా • నీకంబు నర్చించి వా
గధిపశ్రీపతిపార్వతీశ్వరులయా • స్యంబు ల్విలోకించినన్. ౧౨౪.

కం. చూపులు కృపారసమునకుఁ, బ్రాపులుగా నరసి లేచి • వాసవుభద్ర •
శ్రీపీఠంబున కెదుట స,మీపంబున నిలిచి వారు • స్మేరాననులై. ౧౨౫.

గీ. ఈవుమున్నగఁ బన్నగా • నిన్నగారి, నెన్నఁగారాని విభవంబు • చెన్ను మీఱ
నాకలోకాధిపత్యాభి • షేకమదితి, కశ్యపులచే నొనర్పింపఁ • గడఁగుమనిన.

మ. గురుఁ డభ్యర్చితశాతకుంభమయస • త్కుంభంబుఁ జేఁ బూని ని
ర్జరలోకేంద్రున కాభిషేచనికమం • త్రగ్రామపూతంబుగా
శిరమం దల్లన పల్లవాగ్రముల ము • న్సించించి తోడ్తోన శ్రీ
కరనీరంబులచే సొనర్చె నభిషే • కం బప్రతీకంబుగాన్. . ౧౨౬.

కం. తరువాత నదితికశ్యప, హరిహరచతురాస్యులతని • కభిషేక మ్మొన
ర్చిరి తిరముగఁ ద్రైలోక్యముఁ, బరిపాలింపుము నిలింప • వల్లభ యనుచున్.

గీ. వరుస నంతట వసుదిగీ•శ్వరసురర్షి, యోధకన్యాపురంధ్రుల•త్యక్తసకల
మునసుగంధిప్రసన్నాంబు•పూరములను, శక్రునభిషిక్తుఁ జేసిరి•స్వర్గమునకు.

సీ. తుంబురునారదా•దులు త్రిమూర్తులసభ, నెఱపుపాటవినంగ•నెగడువారు
గంధర్వులందఱం• గాన్పించుదశవిధ, రూపకంబులకుఁ బ•ర్వులిడువారు
నచ్చరల్ దగువారి•యాస్థానములఁ జేయు, నృత్యంబు వీక్షింప•నేగువారు
విశ్వకర్మబయల్లఁ•బేర్చియేర్చెడువింత, బిరుసులఁదిలకింప•వెడలువారు
తే.గీ. నగుచుఁ దేజోవతీముఖ్య•నగరవాసు, లమరలోకాధినాథుప•ట్టాభిషేక
విభవమీక్షింపనే తెంచి• వింతయెల్ల, నరసిసంతసమంగిర•య్యవసరమున. ౧౩౦.

సీ. తప్తతైలకటాహ•తాపంబువిడనాడి, యసిలోదకములనో•లాడుచుండ
నసిపత్త్రవనహతి•వ్యసనంబులఁదొలంగి, నిబిడద్రుమంబుల•నీడనిలువ
నంధకూపావాస•జాయాసమును బాసి, వెలుఁగొప్పు తెఱపుల•విశ్రమింప
ఘనకాలసూత్రబం•ధనబాధలనువీడి, యిచ్ఛావిహారై•కవృత్తి మెలఁగఁ
తే.గీ. గలిగెన త్తటిఁగలనార•కులకు నెల్ల, నిరయమున నుండి దండిదం•డితనముడిగి
యార్తరక్షకులైన త్రి•మూర్తులెలమి, నిడినయానతి వేవేగ•విడిచిపుచ్చ. ౧౩౧.

ఉ. పట్టి జయంతుఁ డయ్యెడ స్వ•పాణిసుపాణి మెఱుంగుముత్తెపుం
దట్టపుటెల్లిఁ బట్టఁగ సు•దంచితకాంచనరత్నమండలీ
ఘట్టితదండచామరయు•గం బొగి నశ్వను లూని వీవఁ జా
పట్టె మహేంద్రుకొల్వు చెలు•వంబుగ సర్వసుపర్వపర్వమై. ౧౩౨.

ఉ. అంటఁగరాని వేల్పు మొద•లౌ కడ లేలు మనీలు బాసవా
ల్దంటలు మింటిద్రిమ్మరుల•దాఁటులునుం దెఱగంటి పెద్ద ము
క్కంటిని దమ్మికంటిదొరఁ • గన్గొని యొప్పుగ నెప్పుడట్లు మీ
బంటులబంటు బన్నముల • పాల్పడకుండఁగఁ బ్రోవుఁడీ యనన్. ౧౩౩.

కం. కనకోదరకమలోదర, లనలాదిదిగీశముని జ•నామరవరులం
గని యిట్లని దిట్టల మగు, కసికరమున నట్టివెరవుఁ•గఱపుతలఁపునన్. ౧౩౪.

గీ. స్థిరతరైశ్వర్యమెవఁడు వాం•ఛించునతఁడు, పరమమాహేశ్వరాచార•నిరతవృత్తి
నాదవశి నట్టు లాదలె•తున్నవాఁడు, పృథివిలింగప్రతిష్ఠఁ గా•వింపవలయు.

క. కావున నీతఁడు గరుడగ్రావసమీపమున బంధురసరస్తటిని
స్థావాప్తికి మహిని మహాదేవుని లింగాకృతిం బ్రతిష్ఠింపనగున్. ౧౩౬

క. అని యింద్రుని గరుడాచలమునయం దుక్తప్రదేశమున శివలింగం
బు నొగిం బ్రతిష్ఠఁ జేయఁగ, ననిచిరి ననిచినదయు బ్రయత్నంబున నంతన్. ౧౩౭

మ. పురుహూతుం డిల కేగుదెంచి మహిమంబొప్పొందు నక్షేత్రమా
గరుడాహార్యము పొంత బంధురమహాకాసార తీరోర్వి శం
కరలింగంబుఁ బ్రతిష్ఠితంబుగఁ దగం గావించె నిష్టాప్తి కాం
గిరసుం డుక్తవిధిం గ్రియల్నడుప భక్తిశ్రద్ధ లేపారఁగన్. ౧౩౮

గీ. అందు నయ్యిందుమౌళి పెంపొందుచుండెఁ, బ్రమథగణయుక్తుఁడ క్షేత్రపాలకుండు
గాఁగ నుత్తరపూర్వదిక్ఛత్వరమున, సత్వరక్షణదీక్షోల్లసత్వరతిని. ౧౩౯

క. క్రమ్మఱ నమ్మఘవుఁడు స్వర్గమ్మునకు నమ్మదమ్ము గ్రమ్మఁగఁ జని వృ
త్రమ్మథనవిధులకు విశదమ్ముగ నెఱిఁగింప వారు దయ దైవాఱన్. ౧౪౦

క. నీక్రియ నిఁక ముందు త్రిలోకీసామ్రాజ్యమహితలుంటాక జయో
ద్రేకస్థితిపూజ్యము నస్తోకధృతి ప్రాజ్యమగుచు శోభిలు మఱియున్. ౧౪౧

క. శత్రుక్షయ మిత్రోచ్ఛ్రయ, పుత్రోదయ నష్టరాజ్యపునరాశ్రయము
ల్పత్రిప గోత్రక్షేత్రప, విత్రస్థలి నీచరిత్ర వినఁ జదువ నగున్. ౧౪౨

మ. వినయం బొప్ప నెవండు నీదయిన యీపృత్తంబు నెందేనియు
న్వినువిన్పించుఁ బఠించు శ్రీవరకృపావిస్ఫూర్తి దీపింప నె
ట్టన నాతండు జగత్ప్రసిద్ధి గని నష్టద్రవ్యలాభాఢ్యుఁడౌ
నని యమ్మువ్వురు నివ్వరంబు నిడి స్వేచ్ఛాసక్తి విచ్చేసినన్. ౧౪౩

క. పునరధిగతరాజ్యోన్నతి, ననిమిషనాయకుఁడు స్వస్థుఁడై త్రైలోక్యం
బును నిష్కంటకముగఁ బాలన మొనరించెను ద్రిమూర్తులకటాక్షమునన్. ౧౪౪

సీ. తనకార్యసాఫల్యమున కెవ్వ రొల్లిట్లు, శ్రమమోర్చి రటువారి సత్కరించె
నీకల్మి తనశక్తిచే కల్గె మరలనం, చవలేపవడ కడంకువ మెలంగె
గురుమానిముఖపూజ్యు లరుదెంచువార్తలు, దప్పించుకొని వినీతిని భజించె
నేలోక మేవేళ నేలిలఁ బాలింప, నగునట్లు లప్పట్టు లరసి ప్రోచె

తే.గీ. విజితులగువారు తనుసెంత వినయవృత్తిఁ, బ్రేమనమ్మించికొలిచిన విశ్వసింప
కాప్తబంధుగురూక్తుల నాదరించె, నతఁడుక్రమ్మఱఁ దనరాజ్య మధిగమించి ౧౮౫.

కం. శతగుణసంస్థాపితభూ, పతికులజేగీయమాన పరమోదార్యాం
చితవితతయశస్స్తోమా, శ్రితవసననిబద్ధహేమ శ్రీరఘురామా. ౧౮౬.

చం. రవికులదీపకా! భువన రంజక దివ్యకలాకలాపకా!
నవఘనవిగ్రహా! నతజన ప్రతిపాదితభూర్యనుగ్రహా!
పవనజసేవితా! సకల వండితపావనభావభావితా!
ప్రవిమలవర్తనా! మునివర ప్రకరస్తుత పుణ్యకీర్తనా! ౧౮౭.

స్రగ్విణి. భానుమన్నందన ప్రాజ్యరాజ్యప్రదా!
మానిగార్హస్థ్యసం పత్కరశ్రీపదా!
జ్ఞానిచిత్తాబ్జసం చారకృత్షట్పదా!
జానకీమానసో త్సాహలీలాస్పదా! ౧౮౮.

## గద్యము.

ఇది శ్రీమద్రామనామపారాయణపరాయణాతిధన్య కౌండిన్యగోత్రపవిత్ర
దేవులపల్లికులపయఃపయోనిధికళానిధిసీతారామశాస్త్రిపౌత్ర వేంకట
కృష్ణశాస్త్రిపుత్ర తమ్మనాభిధాసాంతర వేంకటకృష్ణశాస్త్రి
నామాగ్రజన్మ త్రిలింగదేశాగ్రజన్మ సుధీవిధేయ సుబ్బ
రాయశాస్త్రి నామధేయ ప్రణీతంబైన
మహేంద్ర విజయంబను ప్రబంధంబునందుఁ
బంచమాశ్వాసము.

శ్రీ సీతారామార్పణమస్తు.

శ్రీ రా మ.

# శ్రీమహేంద్రవిజయము.

## షష్ఠాశ్వాసము.



రమ్యభూరిమహిమో
దార! సదారక్షితాఖిలాంఘ్రిప్రణమ
ద్వారా! సజ్జనచిత్తవి
హార! కృపాధార! దశరథాంగకుమారా! ౧.

గీ. అవధరింపుము శౌనకాద్యఖిలమౌని
బృందమున కల బృందారకేంద్రుచరిత
సాంగముగఁ బల్కి మరల నిట్లనుచుఁ దెలుపఁ
దొడఁగె నవ్వలికథను సూతుఁడు గడంగి. ౨.

ఉ. ఇంద్రుని సుస్థిరంబుగ స్వారింద్రునిఁ జేసి యుపేంద్రుఁ డిట్లు ని
స్తంద్రత నుండు మంచుఁ దలిదండ్రుల సన్నిధి కేగి యోదయా
సాంద్రమనీషులార! సురసత్తముఁ డుత్తమవైభవంబు గాం
చెం ద్రిదశు ల్మహోచ్ఛదశఁ జెందిరి యుష్మదనుగ్రహోన్నతిన్. ౩.

కం. దితిజప్రతతి రసాతల, గత మయ్యె సుతుండ నైతిఁ గద సేమము మీ
కతులతపోన్వితులారా! హిత మింతకు వేఱె కలదె యెయ్యది యైనన్. ౪.

ఉ. నావిని వార లిట్లనిరి నందను నం దనువొందుకూర్మిచే
నీ విటు మామనోరథము లెల్ల ఘటించితి దానఁ జేసి మా
భావము లుల్లసిల్లె నిఁక వాంఛితము ల్మఱి వేఱె యున్నవే
కేవల మిప్పు డేము కృతకృత్యుల మైతిమి ఖ్యాతి మీఱఁగాన్. ౫.

కం. ఐనం గల దొక యాప్సిత, మానందన! నీవు మాకు • నుదయించినయా
స్థానంబున నగ్రాకృతి,నై నిలువంగ వలయు నెపుడు•నది యే మనినన్. ౭.

కం. తనయులు పొడమిన వాసర,మునఁ బందువు సేఁత సుతులు • పొడమినగేహం
బున శుభవిధులం గూర్చుట, జననీజనకులకుఁ జిత్త•సమ్మద మొదవున్. ౮.

కం. తల్లియుఁ దండ్రియునుం దను, యుల్లంబులలోనఁ బిల్ల • లుల్లాసముతోఁ
జల్లగ వర్ధిల్లఁగ భువి, నెల్లప్పుడు దలఁచుచుందు •రిట్టిశుభవిధుల్. ౯.

గీ. కావ నీవు బలిని • గావఁగా నేగిన, నాఁటియాశ్రమంబు•నను సతంబు
నిలిచియుంట మాదు•తలఁ పని తెలుపఁ బుత్రుండు కేలుదోయి • దోయిలించి.

చం. అల బలిఁ గావఁగా నరిగి•నప్పటియాశ్రమ మందు నుండఁగా
వలయు న టన్నమీనుడులు • వ్యర్థము లౌను తదాశ్రమంబునన్
వలనుగ నెల్లకాలమును • వర్తిలువాఁడ మదీయమూజని
స్థలమును వీడ కచ్చటనె • సమ్మతి నుండుఁడు మీర లెప్పుడున్. ౧౦.

గీ. భాద్రపదమందు మజ్జన్మ•వాసరమున
శక్తికొలఁదిగ భక్తి నుం•త్సవము లెవరు
నలుపుదురు వారి కోర్కు లొం•సంగు చుందు
ముఖ్యముగఁ బుత్రవాత్సల్య•పూర్ణులార!

సీ. మీమాట జవదాఁట • మీ రాన తిచ్చిన, యాశ్రమంబును వీడ•నని తలంపుఁ
దగ్గరుడాద్రిపై • నఖిలపూజ్యంబైన, యుగ్రాకృతి వహించి • యధివసింతుఁ
గలికల్మషవినాశ•కంబై మదర్చావ,తారంబు కడుమహా•త్మ్యంబు గాంచు
వేంకటేశాభిఖ్య • వెలయు నాలుగుపుణ్య,దేశంబులందు మ•దీయమూర్తి

తే.గీ. ధరణిఁ గలివేళ శేషాద్రి • ద్వారకయును, నాపురిము నుపమాకయు•నాఁదవర్చు
దివ్యదేశంబు లవి జగ•త్సేవ్యమాన, భవ్యవిభవమహత్త్వసం•భావ్యగరిమ. ౧౨.

గీ. కొంతకాలంబు శేషాద్రిఁ•గొమరసామి, యనుచు భావింపఁగాఁబడి•యంత నంత
శ్రీనివాససమాఖ్యఁ బ్ర•సిద్ధమైన, వేంకటేశాఖ్య వెలయుదు • విశ్రుతముగ. ౧౩.

ఉ. అంతట ద్వాపరాంత మగు•నప్పుడు నారదమౌని మన్నగో
పాంతముఁ జేరు నేఁసుమధు•రాదికదక్షిణదేశయాత్ర ల

త్యంతము దీక్షఁ జేసికొని • యందు మదీయనివాసపుణ్యవృ
త్తాంతము నాన తీవలయు•నంచు ననుం గడువేఁడు వేడుకన్. ౧౪.

మ. అవు డానాలుగుమన్నివాసములమా•హాత్మ్యంబు సాంతంబుగాఁ
గృప నేఁ జెల్పఁగ దేవమాని యురగా•ధీశాద్రిపైనుండి య
య్యుపమాకం గన నేగుచు న్నడుమ నె•న్నో పుణ్యదేశంబు ల
చ్చపుభక్తిం దిలకించు నంచును భవి•ష్యద్వృత్త మేఁ జెల్పఁగన్. ౧౫.

క౦. అక్కడనె యుంట ముని విని, యక్కడ కేతెంచి మిగుల•నానందముతో
నక్కుటిలవడుగుఁ బనివిని, యక్కుటిల న్విడిచి యేగ • నభిమతగతియై. ౧౬.

సీ. ఏగి యన్నారదుం• డెవు డెవు డాద్యావ,రావసానం బని • యాత్మయందుఁ
దలఁచుచునుండంగఁ ద•త్సమయంబురా నంత, దక్షిణదేశయా•త్రల నొనర్చి
కొని శేషగిరినివా•సుని శ్రీనివాసుని, వేంకటేశ్వరుని సే•వించి యుండఁ
గరుణ శ్రీహరియు సా•క్షాత్కరించి మదీయ, నిలయము లాలువఁ•గా•వలెన టన్న

తే.గీ స్వామి ! శ్రీమాధవ ! మహాప్ర•సాద మనుచు
వెడలి ప్రథమావసథముగా • వెలయుదాని
మాని శ్రీకాళహస్తినా•మప్రసిద్ధ
సిద్ధనిలయంబుఁ దొలుత వీ•క్షించె నెదుట. ౧౭

మ. వినువీథిం జనుదెంచుచుం గనియె న•ఖీణాముసీంద్రుండు తి
న్నని భక్త్యున్నతిఁ దన్నుఁ గొల్వ మది నా•నందంబునుం బొంది తి
న్నని లోఁగొన్న సమీరలింగని నిశాం•తంబైన శ్రీకాళహ
స్తినగస్త్యప్రభవాతటి న్నతజన•శ్రీదంబుఁ బ్రాసాదమున్. ౧౮.

చం. ఘనతరభక్తి నమ్మునిశి•ఖామణి దచ్ఛిఖరత్రిశూలమున్
గనుఁగొనినంతనే మహతి•కాజపమాలలఁతోడికేలుడో
యిని నిటలంబు నందు ఘటి•యించి తదంతరమూర్తి నాత్మలోఁ
జొనిపి నమశ్శివాయ యను•చుం దగ మ్రొక్కె నతోత్తమాంగుఁడై. ౧౯.

సీ. అడ్డదిడ్డంబుగా • నొదల నిడుకొన్న, వలిపంపుమడుఁగుదో•వతులవిడవ
లలితప్రదేశాది•కాంగకంబుల లెన్స, ప్రామినదట్టంపు•భస్మరేఖ

లెడమమూఁపులయందు♦దృఢమగాఁ గన్పట్టు, స్వచ్ఛప్రభంబులౌ♦జన్నిదములు
గడుశుభ్రముగఁ దోమి♦తుడిచేలఁ దాల్చిన, యాతామ్రతామ్రమయ♦యాంబుపాత్ర
తే.గీ. లమరఁ గాంచనముఖరీజ♦లావగాహ, నములఁ గావించి వాయులిం♦గము భజించి
పరశివస్తవముఖు లౌచు♦వచ్చుద్విజులఁ, గాంచి దివిజమహర్షి హ♦ర్షించె మిగుల.

శా. ఏవారిం గనుఁగొన్నఁ బాశుపతదీ♦క్షైకస్ఫురల్లాంఛనం
బేవారిం గనుఁగొన్న నిర్ఝరధునీ♦హృద్యాంబుపూరోపమం
బేవారిం గనుఁగొన్న బద్ధమదమ♦త్తేభేంద్రదానోక్షితం
బేవారింపఁగరానిభాగ్యగతిచే♦ నిచ్చోటి కేతెంచితిన్. ౨౧.

శా. పురి పంచాక్షరి విప్రులెల్ల జితకా♦ము ల్భూపతుల్ రాజశే
ఖరు లూరవ్యులు గిన్నరాపతిస♦ఖ్యప్రఖ్యు లంఘ్ర్యుద్భవుల్
పరమాహీనగుణుల్ సమస్తజను లై♦శ్వర్యాఢ్యులుం గావునం
గర మాక్షేత్రముచూడ దక్షిణదిశా♦కైలాసమై భాసిలున్. ౨౨.

సీ. శ్రీకాళహస్తిపు♦రీసాయకుఁడు సర్వ,మంగళాఢ్యుఁడు రాజ♦మకుటమౌళి
జ్ఞానప్రసూనాంబ ♦ సకలభూభృద్రాజ, మూర్ధావతంసంబు ♦ ముద్దుఁబట్టి
సౌవర్ణముఖరి ప్ర♦సన్నపావనమూర్తి, బహుజీవనాధార♦భవ్యకీర్తి
పరివారదేవత ♦ ల్పరశివధర్మప్ర,భూతప్రభూతవి♦భూతికాలు
తే.గీ. లహహా! దక్షిణకైలాస♦మై యెసంగు, నీమహాక్షేత్రవాసుల ♦ కిహపరములు
కరగతఫలంబులై యుండుఁ♦గాన నిందు, నిలువ నలువయు బలువైన♦నిష్ఠఁ గోరు.

గీ. ఇచటఁ గీటపరీసృప♦మృగకిరాటు, లవ్యయానందమును జెంది♦రని యెఱిఁగియు
నేల స్వర్గాదిపదవుల♦ వేలఁదివురు, శతమఖముఖాఖిలామర♦సముదయంబు ౨౪.

చం. ఋషి దనియించె స్వర్ణముఖ♦రీసరిదంబుఝరీపరిస్ఫుర
త్పృషతపరంపరాధరధు♦రీణసమీరణపోతజాతము
న్మిషదరవిందగధభృతి ♦ మెల్లన వచ్చుతదీశలింగరో
హిషతురగాత్మతానుగతి ♦ నిమ్మడియై యపు డల్ల నల్లనన్. ౨౫.

ఉ. మాని తదీశగేహముఖ♦మంటపపీఠను సాఁగిమ్రొక్కి యా
స్థానసభాజిరంబునఁ బ్ర♦దక్షిణకృత్యము దీర్చి నందిరా

జానుమతిం దదంతరగృ•హంబున కల్లన యేగి నమ్రుఁడై
జ్ఞానసుమాంబికాహృదయ•నాథుఁ గనుంగొని భక్తియుక్తుఁడై. ౨౬.

కం. మందాకినితోయంబులు, మందారప్రసవములును • మకుదాకృతి నీ
కుం దానములను బూజలు,నుం దనిపి మునీశ్వరుండు • నుతియించె నిటుల్. ౨౭.

గీ. దేవతాదేవ ! తావక•సేవకత్వ,భావుకులకును భవభవ•ద్భవ్యనామ
సంస్మరణశీలురకుఁ గాక • సంసరణము, దాఁటఁ దరమె గజత్తృణ•దాటదమన.

కం. బహుగతుల నిటుల శ్రీకా,శహస్తినగరీశువినుతు•ల నొనర్చి ముహు
ర్ముహురావర్తితకీర్తన, మహతిసహాయముగ గాన•మాధురిఁ జూపెన్. ౨౯.

ఉ. అచ్చట నుండి వెల్వడి వి•యచ్చరమాని పినాకినీధునీ
ప్రోచ్చలదూర్మిమజ్జనసు•పూతతరాకృతులై భజించినన్
ద్రచ్చర లిచ్చు రంగపతిఁ • గన్గొన విక్రమసింహపట్టనం
బచ్చపుభక్తి మీఱఁగ వి•హాయసపద్ధతిఁ జొచ్చెఁ జెచ్చెరన్. ౩౦.

ఉ. శ్రీరమణీయమై కవివ•రేణ్యనరేంద్రుల కద్ది యాంధ్రభా
షారసికత్వకీర్తి నిడఁ•జాలి బృహస్పతినైనఁ గేరి యె
య్యూర్యరను ముద్దరాలయిన • నుక్తిచమత్కృతిఁ జూపు నట్టిసె
ల్లూరుపురంబుఁ జొచ్చెఁ దన•మోరలఁ జౌరులు వెంటఁ గొల్చి రాన్. ౩౧.

కం. పెన్నఁ గని మౌని నుతి సలి,పె న్నగనిర్ఝరిణి కాదు • పిన్నగఁ దగు రూ
పెన్నఁగ నిర్ఝరనది కిది, పెన్నగ నిక్కముగఁ గాశ్య•పి కిది యటంచున్. ౩౨.

గీ. లోని కరిగి భుజంగశ•యానుఁ డగుచు, యోగనిద్రాభిరాముఁడై•యొప్పువాని
రంగనాయకు మన మలరంగఁ•గాంచి, మౌని పులకాంచితాంగుఁడై•మహితభక్తి

కం. వలఁగొని సాష్టాంగనతుల్, సలిపి రహి న్మహతి గాన•సారామృతమున్
వెలిపి మెల పొలయఁగా మే, ల్కొలిపి ప్రసన్నునిగఁ జేసి•కొని వెడలి వడిన్.

సీ. మంగళాచలసీమ•మంగళామలధామ, మర్తియా నరసింహ•మూర్తి సేవఁ
గావింపఁగా నెంచి • భావింపఁగా నంచి,తంబైనభక్తిచేఁ•తింబు కేవఁ
ననరంగ ఘనలీల • దనరంగదనుకూల, సరణిగా వింతైన•కరణి భావ
భవ్యంబుగా శ్రుతి•శ్రావ్యంబుగా శ్రుతి,స్వరలయగ్రామభా•స్వరతఁ గేవ

తే.గీ. లంబుగను జేతనాచేత • నంబులుగను, వృత్తి వినిమయము బ ముం ద్వృత్తిఁ జేయ
వీణ వాయించెఁ గానప్రవీణతైక, సుందరుం డందు మానిపురందరుండు. ౩౫.

గీ. సామిచేఁ గ్రోలఁగాఁబడి • సామిశేష, మైనయాత్మకమండలు • పానకంబు
నాని యందుండి యమ్మౌని • యరిగి కాంచెఁ, గృష్ణవేణి పయోనిధి • కృష్ణవేణి.

శా. ఆకృష్ణానది దేవమౌని తడవు • ద్యద్భక్తిమై స్నాన ని
ష్ఠాకృష్టాశయవృత్తి మీఱ నియతుం • డై మజ్జనోన్మజ్జన
వ్యాకీర్ణాత్తజటాభరంబుగఁ దదే • కాసక్తి నుండం బ్రజా
నీకం బారయుచుండె నెద్దునఁ ద్రివే • ణీసంగమభ్రాంతిచేన్. ౩౭.

గీ. అతఁడచ్చోఁ దడవు తీర్థ • మాడి విహిత, కృత్యములఁ దీర్చికొని లేచి • గిరితటమున
దిటముగా భక్తులను బ్రోచు • దీక్షనున్న, కనకదుర్గామహాదేవిఁ • గానఁబరిగె. ౩౮.

కం. అంబా త్రితయరూపిణి! యో, యంబా! శ్రితవితతిఁ గడు దయం బాలనఁ జే
యం బాపములం బాప భయం బాఁపఁగ నోపు దీవ • యంబా! జగతిన్. ౩౯.

కం. నీపదములఁ జూడంగా, నీపదశ్రసగ్విభాసి • నీ! పదపడి నే
నీపదములఁ బాడంగా, నీపదవి న్వచ్చినాఁడ • నీపదమునకున్. ౪౦.

వ. అన నద్దేవి ప్రసన్నురాలగుచు నాం • హా! దేవమౌనీంద్ర! నీ
ఘనసంగీతకళాకలాపకలనా • కౌశల్య మెన్నాళ్లకో
వినఁ గల్గెం గద నేఁడు పెండియు మణి • ద్వీపంబున న్నాఁడు విం
టిని శ్రీరామపదాంకగేయమును దా • ని న్వీణియం జొన్పితే. ౪౧.

కం. అన విని యనిమిషముని యను, జననీ! శ్రీరామనామ • సారజ్ఞత్వం
బనఁగా నీవల్లభునిద్రియును నీయదియును గదమ్మ! • యోహారుకొమ్మా! ౪౨.

కం. నీమణివీణాసన్నిధి, నామహతి యనఁగ నెంత • నాగానకళా
సామగ్రి యెంత న న్నీ, వేమేమో పెద్దఁ జేసె • దేటికి దేవీ. ౪౩.

కం. వాయించెద నావీణియ, మ్రోయించెదఁ దంతియులను • గుశులకు రక్తిం
జేయఁగ నీదరిఁ జాలుదు, నా! యమ్మ! తప్పదమటం • యది నాయమ్మా! ౪౪.

కం. నీ వాన టిచ్చినట్టులు, గావించెద ననుచు లెప్పం • గాన మొనర్చెన్
దేవియు బరగాఁ దనవీ, ణావాదన మాచరింప • నారదుఁ డెలమిన్. ౪౫.

గీ. ఇట్టుల ద్దేవి సేవించి ఋషివరుండు, పనివినెడునప్పుడామె యిట్లనుచుఁ బలికె
మెచ్చితిని గోరుకొనుమయ్య యిచ్చెదాన, వరము నెద్దియునైనను వర మునీంద్ర.

గీ. అనిన విని యామె తోడ నిట్లనియె మునియు
నంబ నన్వీతరాగుఁడనని యెఱింగి
యును వరముఁ గోరికొను మటంచును వచించి
తరయ నన్వీతరాగుఁడనని యెఱుఁ చెపుమ. ౪౭

కం. ఐన నొక కోర్కె కలదమ్మా! నామది రామనామ మంత్రమ్మునకున్
ధ్యానాద్యుపాసనలకే, వైన విశేషంబులున్న నవి విన వలఁతున్. ౪౮.

మత్తకోకిలము.— నావుడుం దరహాసముల్ వదనంబునన్ వెలయించి యా
దేవి యమ్మునిఁ గాంచి యిట్లని తెల్పెఁ దారకమంత్రమం
దే విశేషము లున్నవో పరమేశ్వరుండు మహేశ్వరుం
డే వచింప నలంతి గాక రెవ్వరైన సమర్థులే! ౪౯.

గీ. వరము వేఁడుమనుచు బలవంత మొనరించి, యడుగ నిడఁగఁ జాలకుడుగ వలసె
నైన నాదునుడువు వ్యర్థం బొనర్తునే, తగిన వెరవుఁ దెల్పెదానఁ గాక. ౫౦.

గీ. మునిజనవరేణ్య కాశికాపురమునందు, విశ్వనాథుండు మన్నాథుఁ డీశ్వరుండు
రామనామప్రబంధకీర్తనము వినినఁ, దన్మహామంత్రరాజతత్త్వంబుఁ దెలుపు.

తరలము. అనవుడు న్ముని దేవి కిట్లను నమ్మరో! విను మమ్మ! నా
మనవి నే నిపు డిట్టు లయ్యుపమా కవేంకటనాథు సే
వన మొనర్చు కడంక మైఁ జనువాఁడనై నడుద్రోవ నిన్
గని కృతార్థుఁడనైతి మోదము గంటి ఖేదము గంటి తిన్. ౫౨.

ఉ. ఇమ్మహి వేంకటేశ్వరుని యిమ్ములు నాల్గు చెలంగు దివ్యదే
శమ్ములు సేవలమ్ముఁ గలుషమ్ములఁ బాపఁగ నోపు నర్థవా
దమ్మిది గాదు శేషగిరి ద్వారక నాపురి గారుడాద్రి స
త్యమ్ము ప్రసిద్ధసిద్ధనిలయమ్ము లభీష్టఫలప్రదమ్ములున్. ౫౩.

కం. ఆనాల్గు దివ్యపదముల, లో నెవ్వఁడు తప మొనర్చు లోకజనిత్రీ!
వానిది యగుఁ దప మలరే, వానదితటిఁ జేయుతపము వలె నిధు ఫలమున్. ౫౪.

కం. ఆ వేంకటవిభు సెలవుల, కేవారలు నైన యాత్ర కేగుదురో కా
రా వెనుక నితరయాత్రలు, గావింపఁగ రాదటంచుఁ గల విలఁ బలుకుల్. ౫౫.

సీ. కావున నిచ్చోటుఁ•గడచి యొవ్వలనికిఁ, జనఁజన గని కొంత•సందియంబు
నచట నమ్మంత్ర మ•త్యల్పమైన జపింప, నగు సిద్ధి యనుచుఁ గొం•డంతయాస
కోరికొమ్మని యాన•గొల్పి లేదన నెప్పు, నే యని యడుగ నీ•యెడ భయంబు
నీమొకే తెలుపఁ డా•యీశుండు నా కట్టు, లెఱిఁగించు ననుచు ని•స్పృహత గొంత

తే.గీ. “పెట్టఁజాలక యుండినఁ•బెట్టునిల్లు, నైనఁ జూపింప వలయు” నం•న్నట్టు చూపి
తీవటంచు సమాధాన•వృత్తి కొంత, కలిగి నాడెంద మిర్వేళఁ•గలఁత నొందె. ౫౬.

మ. అన మందస్మిత మొప్ప దేవి కరుణా•స్వాంతంబుతో మాని కి
ట్లనియె న్గమ్యము దక్క నిన్నడుమఁ బు•ణ్యక్షేత్రముల్ రెం డొగిం
గనుపట్టుం గద ద్వారకాపురియు నా•కాపల్లియు న్వేంకటే
శనివాసంబులు సిద్ధసేవ్యములు శ•శ్వద్విశ్వసంభావ్యముల్. ౫౭.

కం. రేవాతీరతపంబును, శ్రీ వేంకటనాథుఁ డుండు•క్షేత్రంబులలోఁ
గావించుతపంబును సరి, యై వెలయు న టన్ననుడి య•థార్థము గాఁగన్. ౫౮.

ఉ. గౌతమియొద్దునం దప మ•ఖండఫలప్రద మంచుఁ గోవిద
వ్రాతము పల్కుచుంట విన•వా మన వామనవామదేవుల
ప్పూతమహాస్రవంతి కిరు•పొంతల నాజలరాశి గాఁగ నా
త్మేతరదేవత ల్గొలువ•నిచ్చ వసించిరి పెక్కురూపులన్. ౫౯.

కం. నారద భద్రాద్రిస్థిత, తారకమంత్రాధిదైవ•త శ్రీరామో
దారపదోదకపావన, యై రాజిలు గౌతమీమ•హానది యెల్లన్. ౬౦.

గీ. దేవతను బట్టి క్షేత్రంబు•దివ్యమగును, దీర్థమును క్షేత్రమును బట్టి•దివ్యమగును
త్రితయ మొక్కెడఁ గూడిన•దివ్యదేశ, మిద్ధరిత్రి నిదే కద•సిద్ధపఏము. ౬౧.

కం. ఆకరణి దివ్యపదమగు, నా కాపలి యందు రాము•నామజపం బీ
వేకాగ్రవృత్తిఁ జేసినఁ, జేకుఱుఁ ద న్మంత్రవిధ మ•శేషముగ వెసన్. ౬౨.

సుగంధివృత్తము. ఓ తపస్విలోకనాథ • యుగ్రమాతపంబు నీ
గౌతమీస్రవంతిఁ జేయఁ•గా దయార్ద్రచిత్తుఁడై
శ్రీతి వేంకటేశ్వరుండు • పెంపుమైఁ బ్రసన్నతన్
నీతలంపుఁ దెల్పు నా ధు•నీతటంబ మిట్లమన్. ౬౩.

శా. నాతీరంబున సంవసించి కరుణ ♦ న్నాకావిహారంబుల
న్నాతోయంబుల సంచరించుచు ననుం ♦ న్మన్నింపవే యంచు నా
స్రోతస్విన్యవతంస మీప్సితపుఁదీ ♦ రుం దెల్పనల్పేతర
ప్రీతిం దా నివసించెఁ దత్తటమునన్ ♦ శ్రీవేంకటేశాకృతిన్. ౭౪.

గీ. అట్టు లాతఁడు వసియించి ♦ నట్టిదేశ, మోడపల్లె యనంగఁ బేరొంది వెలసె
నందుఁ దపమాచరించిన ♦ యట్టివారి, వాంఛ లీడేర నాహరి ♦ వర మొసంగె.

గీ. అందుఁ గొన్నాళ్లు నియతి నీ ♦ వధివసించి
యరుగు మవ్వలి దరికిఁ గాం ♦ ర్యార్థ వగుచు
నచటి కెదుటను దోఁచుఁ బుం ♦ ష్పాద్రిపద్మ
శైలధవళాచలములు నిం ♦ ర్జరమునీంద్ర ! ౭౬.

సీ. గోదావరీవారిఁ ♦ గోటిలింగేశ్వరు, భక్తియుక్తిగ నభిం ♦ షిక్తుఁ జేసి
తత్పూర్వవర్తిసీం ♦ తారామమూర్తిఁదా, రకనామదివ్యమం ♦ త్రమునఁ దనిపి
తద్యామ్యభాగసం ♦ స్థాయిమార్కండేయ, శంభులింగము సమం ♦ రచన మొనర్చి
తద్దక్షిణమ్మున ♦ ధవళాద్రిశ్రీజనా, ర్దనుఁ గొల్చి రామపాం ♦ దముల కెఱఁగి
తే.గీ. యవలఁ దూర్పుదెసకు ♦ నై యోజనత్రయ, దూర మరిగి యచటఁ ♦ దుల్యదరిని
జెలఁగుచున్నయట్టి ♦ శ్రీకుమారారామ, సీమ భీమనాథు ♦ సేవఁజేసి. ౭౮.

కం. అందుండి పీఠపురమున, కుం దరలుము కుక్కు టేశుం ♦ కో వెలనదుదా
రిం దోఁచు గవని మోలఁగ, నం దగు నందీశకేతం ♦ న స్తంభముతోన్. ౭౯.

కం. ఆదివ్యక్షేత్రంబున, నీదగుకోరిక లభించు ♦ నిక్కంబుగ నీ
కేఁ దెల్పనుపాయం బదె, యోదైవతమునివ రేణ్య! ♦ యురుతరపుణ్యా! ౮౦.

చం. అది యెటు లన్నచో నొకయుం ♦ పాయముఁ దెల్పెద నంటి మున్నె యా
పదయునివిశ్వనాయకుఁ బ్రం ♦ సన్నుని జేసికొనంగఁ గాశికై
యది పని గాఁగ నేగవల ♦ దంతట నాతఁడు నిండియుండు నా
రద! జగదంతరాత్మయని ♦ ప్రాజ్ఞులు వల్కఁగ నాలకింపవే. ౮౦.

శా. కైలాసంబునుఁ గాశికానగరియుం ♦ గాణాచిగా నాతఁ డే
లీలం దా వసియించియుండు భువి నాం ♦ లీల న్వసించెం గదా

యేలాతీరమునందుఁ బీఠపురి దేవేంద్రార్థసిద్ధ్యర్థమై
వాలాయంబుగఁ గుక్కుటాకృతి స్వయంవ్యక్తాచ్ఛలింగంబునన్. ౭౧.

శా. ఆకాశీపురి యాదిమం బిది ద్వితీయం బంచు విశ్వేశ్వరుం
డో కంజాతభవాత్మజాత! సతతం బుల్లాస మేపారఁగా
శ్రీకైలాసమునందుఁ బోలె నివసించెం గుక్కుటాకారుఁడై
లోకానుగ్రహకాంక్షఁ బారిషదపాళుల్ శ్వేతు ల్గొల్వఁగాన్. ౭౨.

సీ. భాగీరథి యటంచు వచియింతు రచ్చోట, నేలానది యటంచు నిచటఁ జేరు
బిందుమాధవుఁ డంచుఁ బేర్కొందు రచ్చోటఁ, గుంతిమాధవుఁ డంచు నెంతు రిచట
మణికర్ణిక యటంచు గణుతింతు రచ్చోట, ఖ్యాతి యిచ్చటఁ బాదగయ యటంచు
నన్నపూర్ణ యటంచు నెన్నుదు రం దిందు, శ్రీరాజరాజేశ్వరి యని కీర్తి
తే.గీ. యందు విశ్వేశ్వరుం డందు రిందుఁ గుక్కు,టేశ్వరుం డందు రింతె కా కింతరమైన
భేదమున్నది కాశికిఁ బీఠపురికి, సంజ్ఞలే భేదములు గాని సన్మునీంద్ర. ౭౩.

కం. అది యైదుక్రోశముల నిడు, పిది యామడవర్తుల మగు నెటుఁ జూచిన న
య్యది యిది పరమేశ్వరునకు, సదనంబులు భుక్తిముక్తిసంస్థానంబుల్. ౭౪.

శా. మున్నూటర్వది దేవతాయతనము ల్పొల్పొందు నవ్వీటిలోఁ
గన్నారు న్నలుతట్ల యూపముల హాసించెంది యేలాతటిం
గన్నారం గన సౌధయూథము లసంఖ్యాతంబు లవ్వీథులం
దన్నం దన్నగరీప్రభావము దరంబే యేరికి న్నారదా! ౭౫.

ఉ. తారకమంత్రముం గురుఁడు దా నయి మానుగ నిచ్చుటన్ జనుల్
దారకలంకులై మనఁగఁ దప్పక యొప్పుగ నిప్పురంబునం
దారకవిద్విషద్గురుఁడు దా నుపదేశ మొనర్చు సత్కృపా
దారకటాక్షుఁడై శిశుతయాదిగ నైహికసౌఖ్యము ల్గనన్. ౭౬.

ఉ. ఓదివిజర్షివర్య! పురుహూతిక పేరిటిశక్తిపీఠ మ
ష్టాదశపీఠులం దిది విశంబుగ నెన్నఁ బిత్ర్యాణముక్తికిం
బాదగయాఖ్యతీర్థము విభాసిలు నిందు గయాత్రయి న్నతి
శ్రీదునిఁ గుంతిమాధవు భజింపఁగ నా నిటఁ బంచమాధవిన్. ౭౭.

క౦. గంగానది గోదావరి, యుం గావేరియును గృష్ణ • యును బోలికఁ జే
యంగాఁ దగ వేలేటికి, బంగారమె వందు దాని • నాఃపూరములన్. ౭౮.

చం. జనములు గుంతిమాధవని • శాంతసుదర్శనదర్శనంబు చే
సిన మును చేసినట్టివి య • శేషముగా నఘము ల్నశించు న
వ్వనజదళాయతేక్షణుని • పాదసరోరుహదర్శనంబుఁ జే
సినఫల మిట్టిదింత యని • చెప్పఁగ శక్యమె నీవెఱుంగవే. ౭౯.

చం. పొరిఁబొరి లేచి ప్రత్యహముఁ • బ్రొద్దునఁ బుష్కరిణీజలంబులం
బరువడిఁ దీర్థమాడి జిగి • పట్టుమడుంగులు గట్టి యొప్పఁగాఁ
దిరుమణికాపు దీర్చికొని • దివ్యతరద్రవిడప్రబంధభా
స్వరనినదాస్యులై తగఁ బ్రపన్నులు గోవెలఁ జొత్తు రెద్దెలన్. ౮౦

శా. సేవాకాలమునందు నందు వలల • క్ష్మీజానికైంకర్యముం
గావింపం బఱతెంచి యొక్కమొగి భ • క్తశ్రేణి నిత్యంబు న
య్యావాసంబున భక్తిచే నుభయవే • దాంతజ్ఞు లధ్యాపకు
ల్గావం జేయు ప్రబంధఘోషముల నా • లించుం బ్రమోదంబునన్. ౮౧.

సీ. సిరి యురంబున వసుం • ధరయు నీలయు నెమ్మి, నిరుప్రక్కలవసించి • మురువుఁజూప
శంఖచక్రగదాసి • శార్ఙ్గాయుధంబులు, మూర్తిమంతంబులై • ప్రోలఁ దోఁప
వైనతేయుండువి • ష్వక్సేనుఁడునుభక్తిఁ, గేలోయి వెంగిచిము • గిటనుగొలువ
వివిధోపచారముల్ • సవరించుచును శేషుఁ, డన్నివంకలఁ దాన • యై భజింప

తే.గీ. సురలు బ్రహ్మేంద్రసహితులై • చుట్టునిలువఁ బ్రత్యహముఁ గుంతిమాధవ • స్వామికెలమిఁ
బార్వతీపరమేశ్వరు • లవచ్చి నెఱవు, రాజభోగంబుఁ గనుట దు • ర్లభము సుమ్ము.

సీ. మును మున్ను మాధవ • పుష్కరిణీవారిఁ, దీరంబు లాడి య • ద్దేవుఁ గొలిచి
యావెన్కఁ బాదగ • యాస్నాతుఁడై హస్తి, ముఖుఁ గాంచి దక్షిణా • మూర్తి నరసి
షణ్ముఖు సేవించి • చండీశు భావించి, భైరవు భజియించి • ధ్వజవిత ర్ది
కెలన నాత్మప్రద • క్షిణముల నొనరించి, నందీశు నానతి • నొంది లోని

తే.గీ. కేగి యచ్చట శ్రీకుక్కు • టేశుఁ బరమ, భక్తి నభిషిక్తుసిగఁ జేసి • ప్రస్తుతించి
రాజరాజేశ్వరీదేవిఁ • బూజనముల, సలిపి నాఁ డందు నివసింప • వలె జనుండు

శా. సాయంకాలమునందు నందుఁ బురవాస్తవ్యుల్ సురస్తవ్యుఁడౌ
నాయీశానుని సేవనార్థమయి భక్త్యావేశ మేపార యా
తాయాతస్థితిఁ గూర్చి సందడి సమర్త్యశ్రేణి దౌదవ్వులం
దే యుండుం దమవ్యోమయానములతోఁ గాంగి న్నిరీక్షించుచున్. ౨౭.

గీ. ఇతరులగు వేలుపులను ప్రత్యేకముగను, దత్తదాలయములఁ జూడఁదగుఁ గడంగి
యుంగనున్న న్నినాళ్ల ప్రత్యహమునందు, నరయవలె రేవుమాపు శ్రీహరినిహరుని.

సీ. వాణి వీణియఁ బూనిరాణతో వాయింప, విబుధేంద్రుఁ డింపుగా వేణు వూదఁ
గమలజుం డనుకూలగతిఁ దాళమును మీట, నాళీకనిలయ గానంబుఁ జేయ
గంభీరముగ మృదంగము శౌరి మ్రోయింప, ననిమిషశ్రేణి చుట్టు నివసింప
నచ్చరల్ క్రమలయన్యాసంబుఁ బరికింప, బ్రహ్మర్షు లానందపరత నుండ

తే.గీ. రాజరాజేశ్వరీదేవి రత్నఖచిత, సింహపీఠికఁ గొలువుండి చిత్తగింప
సాంధ్యవేళలఁ గుక్కుటేశ్వరుఁ డొనర్చు, తాండవముఁ జూడఁ గన్నులపండువగును

ఉ. ఆనటనావసానసమయంబున నల్లన విశ్రమార్థ మీ
శానుఁడు దేవితోడ వలచక్కినిఁ జక్కఁగ నేకపీఠికం
దా నివసించి యుండఁ బ్రమథద్వితయం బిరుగట్లఁ జామరల్
పూని విభూషణంబులకుఁ బొందగువిందుగ వీచుచుండఁగన్. ౨౮.

గీ. పీఠమూలంబున వసించి వినయవృత్తిఁ, దనయులిరువురుఁ బదములొత్తంగ ముదము
గదురఁ గొండొకసేపందుఁ గరుణ నిలచి, కొలువుఁ గావించునందఱుఁ గలయఁగనుచు.

మ. స్మిత మొప్పన్ శశిమౌళి భృంగి దెస వీక్షింపం దదిచ్ఛన్ సభా
గతు లెల్లం గడుఁ బొర్లి నవ్వఁగఁ జమత్కారంబుగా నాతఁ డం
చితమౌ హాస్యకళావినోదముఁ బ్రపంచింపంగఁ గొండొక్కసే
పు తగన్ లీలఁగఁ జిత్తగించి విలసన్మోదాత్ముఁడై పిమ్మటన్. ౨౯.

శా. దేవి న్నవ్వుచుఁ గాంచి యంతట నెనందిం జూడ నాతండునుం
బ్రావీణ్యంబును జూపు వేడుక నుమామాణిక్యవీణాగుణా
రావశ్రీ దన కంఠరాగమునకుం బ్రాపై విజృంభింప భా
షావామాక్షియు మెచ్చఁ బాడి విభునాక్షం జెంది చాలించుచోన్. ౩౦.

చం. అమరమునీంద్ర! మంచిసమ♦యంబది నీ కపు డీవుఁ జక్కఁగా
నమరిచికొన్నవీణియ న♦మంచితరీతి గ్రహించి రామనా
మము స్మరియించుకొంచు సుర♦మస్కరిమండలినుండి మ్రోల నిన్
గ్రమముగఁ గానిపించుకొనఁ♦గా దరహాసముఁ జేయు నీశుఁడున్.

గీ. అదియయనుమతిగా నెంచి ♦ యంచితముగ, రామనామప్రబంధకీ♦ర్తనముఁ జేయు
మతఁడు నావలె సంతుష్టి ♦ నానతిచ్చు, వరముఁ గోరు మటంచు నో♦వరమునీంద్ర.

ఉ. అందుల కీవు డెందమున♦యందలివాంఛ నివేదితంబుఁ జే
యందగు నందుపై ముదము ♦ నందుచు నందిహయంబు డమరుం డమా
నందము నీవు చెంద నిధి♦నందన! తారకమంత్రతత్త్వరూపం
జందము నెల్లఁ దెల్పు నిటు♦సల్పు మటంచును దద్విశేషముల్. ౧౩.

ఉ. ఇంతియ కాదు తన్నగరి ♦ కే వరుదెంచితి వన్నగార్థ వి
న్నంతనె నిన్నుఁ గాంచు తెపు ♦ డంచుఁ దలంచుచు దేవసేవలం
దెంతయు భక్తిప్రముఖ్య లదు ♦ నెప్పుడు నప్పగ మేలు ధారణీ
కాంతుఁడు వానిదుర్గమున♦కై చని యాతనిఁ బ్రీతుఁ జేయుమా. ౧౪

ఉ. ఆతఁడు నిన్నుఁ దారక♦మహత్త్వముఁ దెల్పు మటంచు వేఁడినం
జేతము ప్రీతి నొంద శశి♦శేఖరుఁ డేగతి నీకుఁ దెల్పె నా
రీతి సమస్తముం దెలిపి ♦ తృప్తిని జేయఁ దగుం గులక్రమా
యాతముగాఁగఁ దన్నిరతి ♦ నాతనిసంతతి వృద్ధిచెందఁగన్. ౧౫.

ఉ. ఆవిధి లబ్ధవాంఛితుఁడ♦వై యుపమాకరు నేగు మంచు న
ద్దేవి యనుగ్రహించినని♦దేశము చొప్పున నప్పు డొప్పుగా
దైవతమౌని వెల్వడి య♦థాక్రమరీతి సమస్తతీర్థసం
సేవల నాచరించుకొని ♦ చెచ్చెర నగ్గిరుడాద్రి కేగుచోన్. ౧౬.

క. వడి నడవిదారిఁ గొని కాల్నడఁ దా జడదారి యొకఁడు ♦ నడవడు నెడ నొ
క్కెడఁ బ్రొద్దు గ్రుంకఁగా నక్కడ నారే యుండఁ గడఁగి ♦ యొకడ లీక్షింపన్.

సీ. కహకహార్భటిఁ గాక♦కంకగృధ్రోలూక,ములు గుండ్లదరిఁ జేయు♦కలకలంబు
వలుడు మున్పసిపట్టి ♦ వాసితం బొనరింపఁ, గడువడిఁ జేరు న♦క్కలరుతంబుఁ

బొడసూపఁ దటియంచు ♦ బడిబడి నేతెంచు, నలఁతి భూతములు గొం ♦ డాడు రొదయు
వడిగీటి భువిఁ బాఱ ♦ వైచిన యస్థికై, కలహించి మొఱుగు కు ♦ క్కలరవంబుఁ

తే.గీ. గలసి కర్ణకఠోరంబు ♦ గాఁగఁ దోఁప, బ్రహ్మరాక్షసచిరతరా ♦ వాస మగుచు
ననతిదూరంబునం దొక్క ♦ ఘనవిశాల, మైనయశ్వత్థ వృక్షంబు ♦ గానవయ్యె.

కం. ఆరావిచెట్టువంకకుఁ, జేరక నొకగున్నమావి ♦ చేరువఁ దోఁప
న్నారదమునివరుఁ డాసహ, కారము క్రింద నివసించెఁ ♦ గడు నెమ్మదిగాన్. ౯౯.

ఉ. అంతటఁ దన్నిశం బ్రథమ ♦ యామమునం జలపత్రభూరుహ
ప్రాంతము నుండి, నన్ జెనక ♦ రాకుము రాకు మటంచు బిట్టుగా
నింతియెలుంగు దోఁచె నిది ♦ యేమొకొ యంచు మునీంద్రుఁ డక్కజో
ప్రాంతముఁ జేరనేగి యర ♦ యంగ నొకండును గానరానిచోన్. ౧౦౦.

కం. ఇది యేమని యబ్బురపడి, మొదలిటి సహకారమూల ♦ మునకుం జనఁగాఁ
బదపడి యప్పటిచొప్పన, ముదితయెలుఁగు వినఁబడంగ ♦ ముని సత్వరుఁడై.

కం. అవ్వలనికిఁ జన నచ్చట, నెవ్వండును లేకయున్న ♦ నిది యే మనుచున్
నివ్వెరపడి విడిదికిఁ జనె, నివ్విధమున మూఁడు సారు ♦ లేగుచు రాఁగన్ ౧౦౨.

ఉ. సంధితమైన యంధతమ ♦ సంబున వెండియుఁ గూయి దోఁప ద
గ్బంధ మొనర్ప నన్నెలవుఁ ♦ బాయు నుపాయము లేక మేన నే
సంధియునుం జెలింపమిఁ బి ♦ శాచనిశాచరముఖ్యమైన క్ర
వ్యాంధసు లున్నచో నిలువ ♦ నచ్చటికిన్ ముని యేగి ముంగిటన్. ౧౦౩.

సీ. పవడపుఁగోళ్ల చ ♦ ప్పరపుమంచముమీఁద, హంసతూలికల శ ♦ య్యాతలమునఁ
గుదిటితోఁ దమలించి ♦ కొని తెచ్చి యుంచిన, పూతకుసుమ్ముఖమైన ♦ పూవుఁదీవ
పోలికఁ దమిఁ బాపి ♦ పుడమి కేతెంచిన, మెఱుఁగారుక్రొక్కా ♦ రు మించుఁ గదని
కదలకుండఁగఁ బట్టి ♦ కలిసిన మెయి లన, పెన్నెరుల్ మెయి నిండ ♦ విరిసియుండఁ

తే.గీ. జక్కఁదనమునఁ జొక్కపుఁ ♦ జుక్కవోని, దాని నక్కజమైనచం ♦ దమున నచటి
యునికిఁగలదాని సెలప్రాయ ♦ మునఁ దనర్చి, మించు నొకచిన్నదాని వీ ♦ క్షించి యొదుట.

సీ. కొఱవితో జగడించు ◆ కఱకునల్లనిమేను, మిడిగ్రుడ్లు గడితంపు ◆ మిట్టనుదురు
వెడఁదనోరును దుట్ట ◆ పెదవులు గొగ్గికో,ఱలుఁ బుఱ్ఱముక్కు ◆ నిట్టలవుఁ జెవులు
గుఱువంపుఁ జేతులు ◆ గుంటఱొమ్మునదొట్టె, కడుపు నిడువుఁ గాళ్లుఁ ◆ బొడుపు మెడయుఁ
బల్లవెండ్రుకలుఁ దో ◆ ల్పచ్చడంబును నల్ల, పూఁతగందమ్మును ◆ బుట్టతలయు

తే.గీ. నెమలికోలయుఁ బ్రేపుజం ◆ దెమును బునుక,
చెంబుఁ గలవానిఁ దిండికై ◆ వెంబడించి
యులఁతి బూచులు గొలువంగ ◆ వలఁతి యగుచు,
గండఁడగు నొక్కబ్రహ్మరా ◆ క్షసునిఁ గాంచి. ౧౦౬.

శా. ఓహో! యాతనికృత్యమా యిది నిజం ◆ బూహింపఁగా నేల త
ద్వ్యాహారంబులచే బయల్పడుఁగదా ◆ యంచుం గృపాయత్తుఁడై
యా హంసీగమనావతంసము భయ ◆ వ్యామోహముల్ వాపి నీ
వాహాకార మొనర్ప నేటి కన నం ◆ య్యబ్జాక్షియుం డిగ్గునన్. ౧౦౭.

క. మంచము డిగి పెన్నెఱుల స, మంచితముగఁ గ్రొమ్ముడిగ నం ◆ మర్చికొని సమా
కుంచితవిగ్రహయై ముని, పంచాస్యనిపాదయుగళిఁ ◆ బట్టి వచించెన్. ౧౦౮.

ఉ. ఓమహితానుకంప! సమ ◆ యోచితదివ్యతరప్రభావశా
లీ! మునివర్య! యొక నం ◆ రేశ్వరుపట్టిని నన్నుఁ బట్టి వీం
డ్రీమెయి నీమహాటవిక ◆ నిమ్మణిమంచముతోడఁ దెచ్చి రిం
కేమి భయంబు నీపదము ◆ లేఁ గనుఁగొంటిని గంటి సౌఖ్యముల్. ౧౦౯.

చం. అనవుడు బాల! నీ వెవతె ◆ వమ్మ! వసించెడుదేశ మెద్ది! యె
వ్వనిసుత! విప్వనంబునకు ◆ వంచన నిమ్మణిమంచమధ్యశా
యిని నిను బ్రుచ్చిలించుకొని ◆ యీఖలు లంతిపురంబునుండి యే
యనువునఁ దెచ్చి రమ్మ! వని ◆ తా! వచియింపుము మాకు నంతయున్. ౧౧౦.

చం. అన విని నేను గన్యను మ ◆ హామహుఁ డైనకళింగదేశపుం
జనపతిపుత్రికన్ మదను ◆ జన్ముఁడు బాలుఁడు తండ్రి వైరితోఁ
బెనఁకువఁ బోరుచో నొకని ◆ వ్రేటున వేల్పొకరుండుగా వడం
జనవులు వాసి వీరవిహి ◆ తం బగులోకముఁ జేరి రిర్వురున్. ౧౧౧.

కం. పిమ్మట మాపదవికి మా, యమ్మను రాజ్ఞిగ నమాత్యు ♦ లనుమతిఁ జేయన్
నెమ్మిగ నామెయు రాష్ట్రం, బుమ్మలికముఁ బొరయకుండ ♦ నోముచు నుండెన్.

గీ. పిన్ననాఁడు తండ్రి ♦ నన్నాంధ్రదేశనా, యకున కిచ్చువాఁడ ♦ ననుచు ముద్దు
లాడుచుండు నాతఁ ♦ డట్లైనఁ దల్లియు, నట్టిపూన్కిఁ దానుఁ ♦ బట్టియుండె.

కం. సచివౌఘము సజ్జనుని, వచనంబులు వినుట నంధ్ర♦వసుధాధీశున్
సుచరిత్రునిగా నెఱుఁగుటఁ, బ్రచురంబుగఁ దలఁపు లతని♦పై నిడి యుండన్,

ఉ. నాజనయిత్రి వెంట నర♦ణంబుగ వచ్చినమంత్రియొక్కఁ డ
య్యాజిని గూలినట్టియభి♦యాతికుమారుని వంగదేశపుం
రాజవునంచు వాని కిడ♦రాదొకొ నీదు తనూజ నంచు నే
వ్యాజము చేతనైనఁ గొని♦యాడును వానిని వన్నెసంగఁగాన్. ౧౧౫.

గీ. విని విని యమాత్యులను ♦ బిల్వఁ బనిచి యొక్క
నాఁడు తత్క్రియాలోచ♦నముల నెఱపి
యిష్టగోష్ఠీవశంబున ♦ నిదియుఁ దలఁప
వార లందఱు నొక్కటఁ ♦ బలికి రిట్లు. ౧౧౬.

చం. ఒదవెడు భీతి నీదు తనయుండతి♦బాలకుఁ డౌటవానిమే
మదయుఁ డటంచుఁ బాపభయ♦ మన్న దెఱుంగఁ డటంచు మాపయిన్
వదలనిమత్సరంబు గల♦వాఁ డనుచున్ వినుచుందు మట్టిదు
ర్మదుఁ డగువానిబాంధవము ♦ మానుటయే సుమి మాకు మన్ననల్. ౧౧౭.

కం. మాయేలిక యీబాలిక, యాయాంధ్రనృపాలుదేవి ♦ యౌఁ గద యనుచున్
మాయందఱి ముందట వా, లాయముఁ బలుమాఱుఁ దన త♦లం పెఱిఁగించెన్.

కం. అతఁడు పుణ్యశ్లోకుఁడు, వీతాఘుఁడు రూపబలవి♦వేకాదులవి
ఖ్యాతుఁడుఁ గావున నాతని, కీతరుణి నొసంగ నిశ్చ♦యింపుము మఱియున్.

చం. బవరపుమాట యుమ్మగజ♦పాలునివీనుల సోఁకి నంతనే
జవనహయాధిరూఢుఁ డయి ♦ సైన్యసమేతముగాఁగ వ్రేల్మిడిం
బవనసమానవేగమునఁ ♦ బాపటగా మనపట్టణ మూని వ
చ్చి వినఁగరానిమాట విని ♦ చెచ్చెర నేగ స్వరాజధానికిన్. ౧౨౦.

క౦. కావున నాజనపాలున, కీవనిత నొసంగ నిశ్చ॰యింపుము నీవుం
మా విభుసితలఁపు నట్టిద, నావుడు వారలకు మజ్జ॰నని యిట్లనియెన్. ౧౨౧.

క౦. అనఘాత్ములార మీతె,ల్పినచొప్పనఁగాక యొండు॰విధమునఁ గావిం
తునె యని తద్బాంధవమున,కు నెదం మజ్జనని యియ్య॰కొనియున్న యెడన్.

గీ. నేఁటిమధ్యాహ్నమున వంగ॰నృపునిపట్టి, వంగదేశాధినాథుండు ॰ సంగరమునఁ
జీవసంయుక్తునిగఁ బట్టి॰ చెఱను బెట్టె, ననుచు మంత్రుల శోకవార్త॰ వినఁగ వచ్చె.

ఉ. దాన నొకింత సంతసిలు॰ దానను గావున నిర్మలోదక
స్నాన మొనర్చి సౌధమున ॰ సంజకడ న్నెఱు లార్చుకొంచు మం
దానిలసేవ్యమాన నయి ॰ యల్లన మంచమునన్ వసింపఁగా
నే నిదురించితిం బిదప ॰ నిచ్చట మేల్కని కన్ను విచ్చితిన్. ౧౨౪.

క౦ అలో నీలోహాకృతి, యీలోకభయంకరాత్ముఁ ॰ డెదుటం దోఁపన్
నాలో నే నొందినవెఱ, పాలోకేశ్వరుఁ డెఱుంగు ॰ నంతట వీఁడున్. ౧౨౫.

గీ. నిన్ను మ్రింగువాఁడ ॰ నీమెడయం దున్న, పసిఁడిబిళ్ల ద్రెంచి॰ పాఱవైవ
కున్న ననుచు మిగుల ॰ నుగ్రుఁడై జంకింప, నడలు జెంది బొబ్బ ॰ లిడితి మిగుల.

క౦. అర్చినకొలంది వీఁడును. జేర్చినయాగ్రహముతోడ ॰ వెస మంచముతోఁ
జేర్చి నొకకొండవఱుఁగున, కోర్చితిఁ దత్సంకటముల ॰ కో పుణ్యనిధీ. ౧౨౬.

గీ. చిన్ననాఁడు తండ్రి ॰ శ్రీవేంకటేశ్వర, ప్రతిమ నలుత నంగ ॰ రక్ష గాఁగఁ
గట్టె దానిమహిమ॰ గా నెంచికొండంత, ధృతిని మంచ మేను ॰ దిగక యుంటి.

మ. అనఁ గారుణ్యమునన్ మునీంద్రుఁడును బా॰లా! యింత జంకేల? నీ
జననిం గూర్చెదఁ జేర్చెదన్ వడి మన॰స్సంప్రార్థితుండైననా
థునితోడ న్నినుఁ గూడ నేఁడె యని య॰ద్దుష్టాత్ముపై దోషనా
శనకృత్పాదగయోదకంబు కలశ॰స్థం బల్లనం జల్లినన్. ౧౨౮.

క౦. వీతాఖిలపాతకుఁడై, యాతఁడు బైశాచకృతి॰ యావిముఖుండై
యాతపసిపదములం బడి, యోతండ్రీ! ప్రోవుమనుచు॰ నొగిం బ్రార్థింపన్. ౧౨౯

శా. నీ వెవ్వండవు? నీకు నెప్పగిది నీ॰నిర్భాగ్యరూపప్రచా
రావస్థాదులు గల్గె? నీయబల యె॰ట్లాకృష్టయై చిక్కె నీ

చేరి వీండ్రెల్ల నెవండ్రు దెల్పు మిఁక గణుతింతుఁ జనుద్రానుకం
పావేశంబున వీండ్రతో నిపుడె నిన్నన్నం బిశాచేంద్రుఁ డుడుఁగ. ౧౩౦.

గీ. పాండ్యదేశాధిపుని ప్రాడ్వివాకవంశ, భవుఁడనఁగు నొక్క శ్రోత్రియబ్రాహ్మణుండఁ
బృథివి ధూర్జటిశర్మాఖ్య వెలయువాఁడ, నెల్లరకుఁ దెల్లమగుఁ జాడ నెనఁగువాఁడ.

సీ. బాల్యకాలమునందె స్వాధ్యాయమయ్యెను, జవి చూచినాఁడ శాస్త్రములోకింత
నాభిజాత్యము గలదంచు నిక్కుచునుందు, నృపమాణోక్తి కింతైన వెఱవఁ
గడువికత్థనతచే మిడిసిపడుచునుందు, నొరుల పెంపునకుఁ జూ పోవఁ జాల
బ్రహ్మజ్ఞుఁడ నటంచుఁ బగ్గెలు గొట్టుదు, నెఱుఁగని విద్య నిరృష్టమందు
తే.గీ. నొరుని వలన నాకునుపకృతి యొందాఁక, నొనరుచుండు నంతదనుక మెచ్చి
యేఱుదాటి తెప్ప నేర్చినచందాన, వానిపేరు వినఁగనైన నొల్ల. ౧౩౨.

కం. అనువర్తన గల యఘముని, ఘనుఁడంచును గాక యున్నఘును నధముఁ డటం
చును విభుసభ నభయుఁడనై, విననీ వినకుండనీ చెవింబడ నఱుతుఁగా. ౧౩౩.

గీ. చేసినయఘంబు దాఁపక చెప్పికొనినఁ, బోవునందురు గానఁ దెల్పెదు మునీంద్ర
యెన్నియగుణంబులున్నవో యన్నినాదు, సొమ్ము గాఁ దిమ్మరుదుఁ జుమ్ము రిమ్ముకొనుచు.

గీ. చిత్తమెపుడు ధనార్జనాయత్తమగుట, యాగభిక్షామిషంబున నచటికచటి
కేగఁగఁ దలంచి కొమరుండు నేనుగూడి, యుత్కలంబులఁ గంటి మూరూరు దిరిగి.

గీ. బ్రహ్మబంధునిఁ గేవలబ్రహ్మయనుచు, నుత్కలంబున జనులకు సత్కరించు
ప్రతినయుండుట నను బ్రహ్మమతిఁ దలంప, వలసినంత ధనంబటఁ బడసినాఁడ.

కం. దాని నొకబండి నిడికొని, సూనుండును నేను శకటచోదకుఁడును దే
శానకును మరలి రా నీస్థానమున దినావసాన సమయం బగుడుఁగా. ౧౩౪.

సీ. ఆనాఁడె గౌతమీస్నానయాత్రార్థమై, నడచి యేతెంచుచు నలుగురైదు
గురు మమ్ముఁ గూడి రాఁ గొన్ని ముచ్చటలందుఁ, బరిచయంబయ్యెన ప్పరుసవారు
కర్మఠుండని నన్ను గారవంబునఁ జూడఁ, గోరియద్దరి నొక్క గుంటజలము
లుంటఁ గన్గొని యేగు మందుఁడు మాకుట్టు, వాఁడు మీరును సంధ్య వార్చివత్తు
తే.గీ. రనుచు వెనుక మొగంబైరి యరిగె బండి, కొంచెమైనను దడవు గావించి చనఁగ
వలదె యని డొంకచాటున నిలిచియుండ, వచ్చె నాకస్మికంబుగ వ్యాఘ్రమొకటి.

కం. అటపై నా కొదవిన ము,చ్చటఁ దల్పఁగ నేల నిప్పి•శాచత దానం
ఘుటియిల్లె గావిచె ట్ట,ప్పటినుండియు నిదియె నాకు • వసతిగ నమరెన్. ౧౩౮

కం. ఈయున్న పిశాచంబులు, నాయ ట్లపవాలిమొగంబు•నం బడి యుల్లై
నాయంతటి వవి గామి,న్నాయకునిగఁ దలఁచి యెపుడు•నను సేవించున్. ౧౩౯.

కం. పిమ్మట నుతుఁ డేమయ్యెనొ, యిమ్మెయిఁ గూర్చినధనంబు•లేమయ్యెనొ యం
చుమ్మలిక మందుచుంటిని, జామ్మీ యని బ్రహ్మరాక్ష•సుండన మునియున్. ౧౪౦.

కం. చింతింపకు మొక్కింతయు, నంతయు నేవింటిఁ జూమి త్వం•దాత్మభవుని వృ
త్తాంతముఁ బీతపురి న్ని,నంతతికిం బాంధ్యమధుర • సౌఖ్యము సుమ్మీ. ౧౪౧.

మ. పులివాతం బడి నీవు రాకునికి నీ•పుత్రుండు దత్నార్థముం
బలుచందంబులఁ జింతచేఁ బొగులఁ ద•త్ప్రాంతస్థమౌ పల్లియం
గల గోపాలురు వారి డాపి యొక వ్యా•ఘ్రంబు బిచ్చటం జేరి పాం
థులఁ బెక్కండ్రను బట్టి భ్రమించె ననినం • దోధూయమానాంగులై. ౧౪౨.

కం. గొల్లలు మాపల్లెకు రం,డెల్లి గన వచ్చు మామ•హీపతి యీరే
యెల్ల మృగంబుల వేటం, బల్లార్చివధింప నిచట • వసియించె ననన్. ౧౪౩.

కం. వల్లే యని వారందఱు, నుల్లంబుల నుల్లఁబోయి•యుండఁగ నా రే
యెల్ల మెకంబులఁ బొరిగొని, యల్లన తద్దేశపతి స•మాగతుఁ డయ్యెన్. ౧౪౪.

గీ. వచ్చి యవ్వార్త యచ్చటి•వారు దెలుపఁ, దాను గూర్చినపులిపాదం•దాపునందుఁ
గ్రొత్తనెత్తుటఁ దడిసిన•యుత్తరీయ, మందుఁ గల పేరివర్ణంబు• లరయఁ జేసి.

కం. దైవగతిఁ గలుగు నాపద, లోవిప్రకుమార! చింత•నొందకు మెదలో
నీవిత్తంబును నిను మీ, యావాసపుటూరఁ జేర్తు•నయ్య యటంచున్. ౧౪౫.

గీ. తగిన సాహాయ్యమును గూర్చి • తద్భటాళిఁ
జేర్చి యేఁటేఁటఁ గొంతవా•ర్షిక మొసంగు
చుండునఁట నాఁటి యమ్మహీం•ద్రుండు నేఁటి
కిని దదన్వయయుగ మట్టు • లెనయు మైత్రి. ౧౪౬

కం. అని యచటి పౌరవృద్ధులు, ననుఁ గూర్చి తదీశకుల గు•ణస్తుతి గావిం
చు నెడం దల్పినచరితం,బును నీవల్కినచరిత్ర•మును సరి గూడెన్. ౧౪౭.

గీ. వర్గరోదకబిందుసం•పర్కమునను, దుష్టభావంబు మాత్రంబు • దొలఁగెఁ గాని
విడిచిపోదయ్యెనుబిశాచ•వృత్తి గాన, దాని నెడఁబాయుచందమం•దఱు వినుండు.

సీ. మీపిశాచత్వంబుఁ • బాపుదు గొందఱి, మ్మంచంబుతోడ ని•మ్మించుఁబోఁడి
నీయంధ్రదేశంబు • నేలు శ్రీపీఠికా, పురనాథుసౌధాగ్ర•మునను డించి
యతనిమేల్కొలిపియా•యతివవృత్తాంతంబు, నంతయు నెఱిఁగించి•యరుగుదెంచు
నంతలోఁ గొంద ఱిం•య్యంతి నంతిపురంబు, నందుఁ గానక చింత•నడలుచున్న

తే.గీ. యీమెతల్లికి నివ్వార్త•లెల్లఁ దెలియు, నట్టులాకాశభారతి • యనుకొనంగ
నొరులెవరు మిమ్ముఁ గనకుండ•నుగ్గడించి, రావలయు నంత దనుక నిం•దే వసింతు.

కం. అని ముని చెప్పిన చొప్పునఁ, బనివిని యప్పని యొనర్చి • వడి వెల్వడి వ
చ్చిన నందఱు నుపమాకరుఁ, జనుదెండని వెంటఁగొని వె•సం జని ప్రేమాలన్.

చం. గిరిఁ దిలకించునంతఁ బుల•కించెను వానికి మేను దగ్గఱం
గర మెదలోన సమ్ముదము • గ్రమ్మె గుడిం బొడఁగాంచి నంత నే
పరవశ మయ్యె మానసము • భక్తులు భాగవతైకసేవ చేఁ
బరవశు లౌదు రన్న భగ•వత్పరిచర్యకుఁ జెప్ప నేటికిన్. ౧౫౭.

కం. అటు లగ్గిరితటిడగ్గఱి, జటి యద్దరివాంద్ర నిలిపి • సాఁగి శిరమునన్
ఘటితాంజలిపుటుఁడై యొక్కట నక్కటకమున కేఁగి • కౌతూహలియై.

కం. పురికిన్ వలగొనియాదట, గిరికిఁ బ్రదక్షిణము దిరిగి • కృతబంధురపు
ష్కరిణీమజ్జనుఁడై యం, తరహి నమజ్జనులఁ గ్రందు•నన్ మందగతిన్. ౧౫౮.

కం. చనుచుండు నప్పు డాగుం, పునుండి కనంగ నయ్యె • ముని కనుఁగవకున్
మనసు కరఁగింపఁజాలిన, ఘనమగుజాలి నుదయింపఁ • గల జన మెదుటన్.

సీ. అస్ఫుటస్వరముగా • నటు నిటుఁ గరసంజ్ఞ, గల తలంపేమేమొ • దెలిపికొనుచుఁ
దమ ప్రశ్నములకును•త్తర మొసంగిన వేళె, వాక్కుగా నెద్దియో•పలికికొనుచుఁ
బురి గిరి పిఱిఁది గాఁ•దిరిగి బయల్ గాంచి, ప్రోవ నే హరియంచు•మ్రొక్కికొంచుఁ
గొండదండకు మమ్ముఁ • గొంపోర నడయాడ, నేర మటం చూఁతఁ•గోరికొనుచు

తే.గీ. మూకబధిరాంధపంగుల•మూఁక లెదుట, నున్నఁ గనుఁగొని యీప్రజ•నున్నరుజగఁ
నెన్నఁ డొనరించునో కృప నెన్న వెన్నుఁ, డనుచుఁ దలపోసె నతఁ డప్పు•డనుచు జాలి.

కం. కొండపరి కరిగి వారలఁ, గొండొకతడ వూరడించి • గోవింద హరీ
యండజరాజహరీ యని, మెండుగఁ బేర్కొనుచు మొదటి• మెట్టెక్కె దటన్.

సీ. గొంతెత్తి గోవింద • గోవింద యని నంత, రువ్వుగా బిట్టువా • క్రుచ్చువారు
శ్రుతిమాటె మారుతా•హతి వీణెసారణి, ననువుగా సవరించు • మనెడువారు
ద్వారగోపురదృష•ద్వారశాసనపఙ్క్తి, సమితి విస్ఫుటముగాఁ • జదువువారు
వడివడి ముందుకై•నడచి శ్రమ్మతి తన, యడుగిలఁ బడి మ్రొక్కు•లిడెడువారు
తె.గీ. నైన వారలఁ దన వెంట • నరుగుదెంచు, వారి నలమూకబధిరాంధ•పంగుజనులఁ
జూచుచుఁ గపటనాటక•సూత్రధారు, చిత్రనాటకపటిమ క•చ్చెరువు చెందె.

కం. అక్కరణి నొక్కచో నడు, చక్కం బెంపెక్కు పెక్కు•జక్కరలు దరుల్
జక్కగఁ జూచుచు నక్కడఁ, జుక్కలు చేఁజిక్కునన్న•చో నెక్కెడన్.

కం. సాలగ్రామశిలాఫల, కాలేఖ్యాకారదర్శి•తాత్ముని దులసీ
సాలగ్రామనుపెూన్నత, సాలగ్రామణ్యగార•సంస్థాయిఁ గనెన్. ౧౬౦.

కం. కనుఁగొని సాష్టాంగముగా, వినతులు గావించి లేచి • వినమితతనుఁడై
వినయంబెనయఁగ నమ్ముని, వినతాసుతశైలనిలయు • వినుతించె నిటుల్.

కం. కారుణ్యశరణ్య! నిరా, కారము సాకారముఁ సకలభువనచయా
కారము నగుభవదీయా,కారముఁ ద్రివిధంబుగాఁగ • గణుతించు శ్రుతుల్.

గీ. బ్రహ్మవాగ్గోచరంబందుఁ • బ్రాథమికము, దెలిసికొంగురుబుధులు తా•ర్తీయమూర్తి
భక్తులకు రెండవది దోఁచు • భావనాను, రూప మగురూపముగ ధీని•రూపణీయ.

కం. పంచాయుధీసమంచిత, మంచుఁ జతుఃపంగశాఖ•మంచుక మించుక
మించుజిగినుంచి సాళ్ళల, దంచుక వించుందు నీయొ•యారమును హరీ. ౧౬౪.

కం. భయ మేది నడివెద జగ,త్ప్రియమే దినదిన మొనర్చు • మృదుపదకమల
ద్వయ మేదిని మును సగరా, న్వయ మేదినలోయ మేది • నరహరి చెపుమా.

సీ. పొక్కిటఁ బొండమ్మి•పువుఁ జూప వేమి యు,రంబునఁ గౌస్తుభ•రత్న మేది
వనమాలఁ గంఠంబు•వను జూప వేమి నీ, వక్షంబు కెలన శ్రీ•వత్స మేది
తపనీయమకుట మూ•ర్ధలఁ జూప వేమి క, ర్ణములందు మకరకుం•డలము లేవి
నదములం బైనవా•సముఁ జూపవేమి స, త్కారుణ్యకటాక్షవీ•క్షణము లేవి

తే.గీ. యిరుగెలంకుల వీచోపులిడుచుఁ జెలిమి, దోఁపఁ దీపించు నిల నీలఁ జూపవేమి
యన్నిటికి నేమి సామి శాంతాంతరాళ, దివ్యమందిరయిందిరాదేవి యేది! ౧౬౭.

కం. మృగయాఖేలనలీలన్, మృగయులు ప్రేరేప నడవిఁ ద్రిమ్మరఁ జని యా
మృగములఁ దునుమాడుచు నో, మృగధరభావుక! వసించితే యందుఁ దమిన్.

కం. నీవిందారయఁబడవిది, గోవిందా! కలియడంగఁ గొమ్మనియొవఁడో
నీవిందావలఁ బిలువఁగ, గోవిందా యేగి యచటఁ గూర్చుండితివో ౧౬౮.

మ. అని యేవం విధమైనరీతి మదిలో ధ్యానించి ప్రార్థించుచోఁ
గన నయ్యెన్ మునికిన్ ముకుందుఁ డెదుటం గంజాతముం గౌస్తుభం
బును దోమాలియు లాంఛనంబు మకుటంబుం గుండలంబుల్ స్మితం
బు నపాంగంబులు ధాత్రినీళరమయుం బొల్పొంద బల్పొందుగాన్. ౧౬౯.

కం. హరి యెదుట నిటుల సాక్షా, త్కరించిన విరించనసుతుఁడు గడు వేడుక నీ
చరణములే శరణము లని, పరువడిఁ బరమప్రపత్తిఁ బ్రణతుం డయ్యెన్. ౧౭౦.

కం. మించిన ప్రపత్తి మదిఁ బ్రస, రించిన మస్కరినమస్కరించిన నంకూ
రించినకృప శ్రీహరి పరికించి నతునివినతు లాలకించినవాఁడై. ౧౭౧.

కం. ఆరెండుపనులకై యిరు, సారులు మును విడువవలసె సదనము మాకున్
నారద మూఁడవపరి నీ, కారణమున మరల నేఁడు కదలఁగ వలసెన్. ౧౭౨.

కం. నావుడు మునిపుంగవుఁ డో దేవా! మొదలింటిరెంటి తెఱఁగు లటుండం
గా వినఁగ వలసె వెడలుట, నావలనం గలిగె నేఁడ నంగతము నవన్. ౧౭౩.

కం. మున్నింటిరెంటితెఱఁగులె, మున్నుగ వినవలయు వయసమూఁడవయది నీ
పన్నినసన్నాహమె నీ, కన్నరపతి మీఁద నున్న యసమప్రేమన్. ౧౭౪.

గీ. అనిన ముని నతోత్తమాంగుఁడై యిట్లను, నొక్కదాని కంటె నొకటి వింత
యగుచుఁ దోఁచుచున్న దడిగిన నీకె నేమి, వచ్చునో వచింపుఁ డిచ్చఁ గలదె.

మ. అనినన్ నవ్వుచు నవ్విభుం డను మునీంద్రా! వింత లే వింతయున్
మనసుం దీర్ప నెఱింగినట్టిదియ యైనం జెల్పెదం బొల్పుగా
వినుమీ కేఁట యొనర్పఁగా నతిగియుం బిందన్న విచ్చేసియున్
మును నే నుంటిమి కృష్ణుసాధితము లీపాంతం గరం బొంటిగాన్. ౧౭౫.

సీ. శేషాద్రి మేము వ•సించియుండఁగ మునుల్, కొందఱు మముఁ గూర్చి• ఘోరతపము
సేయఁగాఁ బ్రత్యక్ష•మై యభీష్టం బేమి • యన వారు మోక్షంబు • నభిలషింప
నది తపోధ్వరజప•స్వాధ్యాయముఖసత్క్రి•యాకలాపంబులఁ•బ్రాప్త మగునె
నాచేతహతులకు • జ్ఞానసంగతులకుఁ, గాని కైవల్యంబు • గలుగ దండు
తే గీ. నాగనాగాశనాగవ•నాగమములఁ, గము లమర మన మ్మగ్రమృ•గములమగుచు
సాధులకు బాధఁ గావింప•సాధులగుచు, వారు మెలఁగ లిడఁగ సపరి•వారుఁడగుచు.

చం. గరుడునిమీఁదఁ గూర్చి యధి•కం బగుటం దదహోర్యసీమ మం
దిరముగ నున్న యీహరియె • నిక్కముగా మన వాంఛఁ దీర్చునం
చరిగిరి సాహసైకపరు• లాత్మసముద్యమసిద్ధిమాత్రత
త్పరమతి నుండ్రుగాని యిది •తప్పిది యొప్పని కర్జ మెంతురే. ౧౬౮.

కం. తలఁచుకొనినంత పని వా,రలు సేసిరి దాని కేను•బ్రతివిధిఁ జేయన్
వలసె నవి యెవ్వియైనను, ఫలియింపక యుండునే త•పస్వులవాంఛల్. ౧౬౯.

కం. ఈపని మొదటిది దీనికి, చాపనిషంగాసిముఖ్య•సన్నాహముతో
మాపని రేపని చూడక, యేపని కేగి నటు లొప్ప • నేఁగఁగ వలసెన్. ౧౭౦.

చం. వలలును మాట్లు దీమములుఁ• బాదులు బోనులు వేఁపులున్ మొదల్
గలతగుసాధనంబు లెనఁ•గన్నెఱపోటరివేఁటకాండ్రు రా
వలదని నిల్వఁగా వలసె • వాని కవే యెదు రేగుదెంచి ని
శ్చలముగ లక్ష్యసీమ వరు•సం గుహనామృగము ల్వసించుటన్. ౧౭౧.

గీ. అప్పు డొకపరి నాల్గైద•హర్నిశమ్ము
లుండవలసెను మాయుండు•కొండ విడిచి
మఱియు నొకపరి వెడలుచు • మరలుచుండ
వలసెఁ గొన్నాళ్లు దాని చె•ప్పెదఁగ వినుము. ౧౭౨.

చం. కలఁ డొకగొల్లఁ డిద్దరి నొం•కానొకపల్లియ నందగోపన
త్కులజాఁడు వాఁడు పుట్టినది•గోలె నొకప్పుడు నూరు నిల్లునేం
దెలియనివాఁడునా నదవిఁ•బ్రిద్మరుచుం బని తోడు వాఁడుగా
మెలఁగుచునుండు సప్పనుల•మేపుల మే పులకింప నెప్పుడున్. ౧౭౩.

కం. అటులుండఁగ వానికి గో,ఘటలీసేవైక పుణ్య◆పరిపాకమునన్
ఘుటియిల్లెఁ దెలివి మది వి,స్ఫుటతరముగ నిట్టు లొకటఁ◆ జోద్యముగాఁగన్.

సీ. అడవిమ్రాఁకులఁ గాంచి ◆పుడమి నెవ్వఁడు నాటె, వీని నెల్లనటంచు◆విస్మయపడు
సెలయేళ్లఁ దిలకించి◆యిల వీని నెవ్వండు, ద్రవ్వించె ననుచువిం◆తపహియించు
భూధరంబులఁ జూచి◆ ప్రోవువెట్టె నెవఁ డీ,రాతిగుట్ట లటంచు◆భ్రాంతిఁజెందు
మొకములఁ గని వీని◆మేపు నీర్వట్టు నె,వ్వఁడు గాంచు నంచున◆బ్రమువహించు
తేగీ. గొప్పదొరయొక్కఁడెవ్వఁడో◆తప్పకుండ,నిట్లు గావింపుఁడనియాన◆తిచ్చియుండ
వచ్చు లెంకల కాబంటు◆బలఁగమైనఁ, గానరా దయ్యెఁ జిత్రమి◆కాననలోన.

చం. అని మఱియుం దలంచు నిటు◆లౌర ననుం గనె నాదు తండ్రి యా
తనిఁ గనె వాని తండ్రి యిటు◆ తండ్రుల తండ్రుల నెన్న మున్నుగా
జననము నొంది యుండవలెఁ◆ జక్కఁగ నొక్కఁడు వాఁ డెవండొకో
యని తెలియం దగుం దెలుపు◆ నాతనిఁ దొల్త నెఱుంగఁ గానగున్ ౧౭౬.

కం. అనుకొనుచుఁ గంటె కెయ్యది, గనిపించిన దాని కెల్లఁ◆గారణ మొకఁడుం
డును దానిఁ దెలుపు నెవఁడో, యనుకొనుచుండఁగ నొకయ◆హర్ముఖవేళన్.

కం. వాని కొకవిప్రుఁ డెదుటం, గానంబడె కేయిఁ ద్రోవఁ◆ గానక కానన్
దా నొక్కెడ నిలచి యుష,స్స్నానమునకు జలము లుండు◆చక్కి నెమకుచున్.

శా. ఆవిప్రుంగని డాయఁగా నరిగి య◆య్యా! యియ్యరణ్యంబునం
దీవొక్కండవు సంచరింపఁగఁ గతం◆బే మంచుఁ బల్కంగ నీ
క్రేవన్ గారుడపర్వతంబు గల ద◆గ్గిర్యగ్రభాగంబునం
దేవుండుండుఁ గదా తదంఘ్రియుగ మ◆ర్థిం గొల్వఁగా నేఁచుచున్. ౧౭౯.

ఉ. ఏనొకరుండ నిన్న నట ◆ కేగుచునుండఁగ సంజప్రొద్దునన్
వానమొయిల్ వడిం గవియఁ◆ బై నిరు లేచఁగ దారిదప్పి యి
క్కాననిశన్ వసించితి నొ◆కానొక యీగమునందు వేకువన్
స్నానజలంబులిం దరయ◆నా కగపించితి వీవు నాపుడున్. ౧౮౦.

కం. అయ్యా! నాపున్నియమే, మయ్యా యిదెయ్యెడకు విహార◆ములు దెంచుటచే
నిద్యెడద దొడ్డదిశ యయ్యెఁ గ, దయ్యా యియ్యడవి విహార◆లదుగిడుతతన్.

కం. ఒదవెన్నినఁ గాంచుట నాఁడఁ దలంచినతీర్థము లెదుటను దోఁచినటుల్
వెదుకం బోయినతీవియ, పదముల దవిలి నటు లిపుడు పావనమూర్తీ. ౧౯౨.

కం. పులుఁగులరాయనిఁ గొండం, గలఁ డొకదేవుండు వానిఁ గనఁగాఁ జనఁగా
వలెనంటి వతఁడు బాపఁడొ, పొలుపగు దొరకొడుకొ గొల్ల బోయఁడొ చెపుమా.

మ. అనినన్ మువ్వురు గాఁడు మువ్వురుగ నయ్యావేళలం దోఁచె న
య్యనఘుం డందఱి కంటె నాధ్యుఁడు జగం బాతండె కల్పించె నా
తనికిం జేయఁగరాని యొక్కటియు నీధాత్రిఁ దలంబంద లే
దనినం గ్రక్కున దత్పదంబులకు సాష్టాంగంబుగా మ్రొక్కుచున్. ౧౯౪.

శా. ఎవ్వా రైనను దెల్పఁగాఁ దగినవా రేతెంతురో యంచు నే
నువ్విళ్లూరుచునున్న దెన్న నిదియే యొక్కండె కల్పించినాఁ
డెవ్వాఁడో జగ మెల్ల నంచు మదిలో నే నెంచుకొంచున్న య
ట్టివ్వేళన్ వచియించినాఁడవు గదే యీ వానుడుల్ నిక్కముల్. ౧౯౫.

కం. అందఱికంటె నతండే, ముందు పొడమి యుంటఁ జేసి మొదలిటివాఁ డౌ
చుం డనరు నట్లు నాతల, పుం దోఁచెడి నతని కంటెఁ బూర్వుఁడు లేమిన్.

కం. నీమాటకుఁ దార్కాణగ, నామదిలోఁ దోఁచె నతఁడు నా యడిగినయ
ట్లామువ్వురు గాఁడని మఱి, యామువ్వురు నగుదు రంటి వది యెట్లొక్కొ. ౧౯౭.

చం. అన విని బ్రాహ్మణుం డనియె నాతఁడు బాపఁడు గాఁడు రాజనం
దనుఁ డనరాదు గొల్లఁ డనఁ దప్పగు నాతఁడు మూఁడుజాతులన్
జననము నొంద రాముఁ డను సంజ్ఞల మున్ ప్రజఁ గొన్నివేళలన్
ఘనమతిఁ బ్రోవ నట్లగుటఁ గాఁడని యౌనని తెల్పఁగాఁ దగున్. ౧౯౮.

కవిరాజవిరాజితము.—అనిన ముదంబున నాతఁడు వొంగుచు నయ్య వినందగు నాతని వ
ర్తనములు రాముఁ డరణ్యమునందు వి రాధునిఁ గూల్చి రావణుఁ జం
పిన ఘనుఁడే కద వీనికతల్ మును వీనులవిందుగ వేవురు విం
టిని జుమి యాతఁడు నిక్కము దేవుఁడు నీనుడులట్లనె నిక్కవముల్.

కం. కొయ్యలకును గోఁతికిఁ దొలు, దయ్యమునకు దొరతనంబు దయనొసఁగెఁ గదా
నెయ్యమున నతనిఁ గొలిచిన, నెయ్యది నమకూరకుండు నెవ్వరి కైనన్. ౨౦౦.

కం. అయయ్యొ రాచకొమరుం, డాయన నని గెలువలేక యరిగెను బాపం
డీయిరువురుఁ దగుదురు మఱి, నాయింట నొకండు పాడమిఁ నాఁ దఁట గాదే.

కం. నీవంటి యొజ్జ గలఁడా, లీవిశ్వమునందుఁ గలరె యొచ్చోటైనం
గావున దేవునిఁ దెలియం, గావలె నతని నెటు గానఁగాఁ దగుఁ జెపుమా.

గీ. ఎచట నుండుదేవుఁ డేతీరుగా నుండు, నేమటంచుఁ బిలువ నేగుదెంచు
నేవి యారగించు నెంతద వ్వాతని, యెల్ల యెల్ల నాకుఁ దెలుఁగఁ జెప్పుమ. ౨౦౩.

కం. అని మూఢభక్తి వేఁడిన, విని విప్రుఁడు వానిభక్తివిశ్వాసాదుల్
తనకున్ ముదమిడఁగా నా, తనిదయఁ దరియింపఁ జేయఁ దలఁపునఁ బలికెన్.

చం. పరమపదంబు వానికి నివాసము నల్లని మబ్బుగెబ్బు నం
గరుచిగలాఁడు స్వామి ! మముఁ గావు మనం బఱతెంచు నెద్ది యె
వ్వరికిల నోగిరం బదియె వానికి నింపగు నెంతదవ్వ కు
య్యరయ వినంగ నానొ యతఁ డంతటి దవ్వున నుండు నంతటన్. ౨౦౪.

శా. నీవా దేవునిఁ జూడఁ గోరితివ యేనిం దెల్పెదం సర్వవాం
ఛావాప్తిన్ ఘటియించు దాని నొకదివ్యంబైన మంత్రోత్తమం
బావర్తించుచునుండు మొక్కనెల నిత్యంబుం గడుం బ్రాన్క నెం
పైవర్ధిల్లఁగ వేయిసారు లటపైఁ బ్రార్థింపు మీచొప్పునన్. ౨౦౫

కం. నల్లని మేన్గలసామీ, తెల్లనిమోరగలపక్కి తేజిపయిన్ నీ
వల్లన యరుదెంచి కృపం, జల్లనిపాల్మీఁగడయును చవిఁగొని చనుమీ. ౨౦౬.

కం. అని వేఁడుకొనిన దేవుఁడు, గనికరమున నివసించు కడ కేతెంచున్
దినదిన మిటుచేసిన దర్శన మిచ్చుం జనువు లిచ్చు రమ్మన వచ్చున్. ౨౦౭.

కం. అని తెలిపిన నమ్మంత్రము, ననుగ్రహింపవలెననియు నాపై మతియున్
దనబందుగులకుఁ గూడం, గనుపట్టెడు వెరవుఁ జూపఁగావలె ననియున్. ౨౦౮.

కం. ఒనరఁగ విప్రుని పదయుగ, మున దనమూర్ధంబు సోఁక మ్రొక్కిన నతఁ డా
య్యన లేవనెత్తి యొక ఝరమున స్నాతునిఁ జేసెఁ దానమున్నుగ వానిన్.

కం. పిమ్మటఁ దారక మనుభే, దమ్ముగు చతురక్షరిన్ యథావిధి నువదే
శమ్మొనరఁ జేసి యిమ్మం, త్రమ్మే మఱకుండు మనుచుఁ గ్రమ్మఱఁ బలికెన్. ౨౧౦.

ఉ. అల్లదె నల్లనై పొడవునై మన మిప్పుడు చెప్పుకొన్న శ్రీ
వల్లభుఁ డిల్లు గాఁగ నిలువం జెలువం బుగమించునీద భూ
తల్లజ కొండదాని కొక దండనె సంగు సరోవరంబు సం
ఫుల్లపయోజహల్లకసముల్లసితంబయి బంధురాఖ్యచేన్. ౨౧౧.

కం. నీవారి దాని వారిన్, వేవేగం దానమాడ నియమింపుము నీ
వావేళ నివాసఁగుహా, ద్రావఁగఁ జనుదెంచి మీకు దర్శన మిచ్చున్. ౨౧౨.

కం. అప్పగిదిఁ జెప్పి విప్రుం, డప్పుడె తన దారివట్టెఁ యరిగిన నాతం
డొప్పుగ నుపదేశోక్తుల, చొప్పున మంత్రము జపించి శుద్ధాత్మకుఁడై. ౨౧౩.

గీ. కాఁచిచల్లార్చిపాలుమీఁగడనమర్చి, బిగ్గరగఁజేర్చినసుఁగూర్చిపిలువఁదొడఁగ
నల్లనగుసామిచిట్టిబోనపుహులుమాయి, నెక్కరావయ్యయిపుడునాచక్కకనుచు.

మ. త్వరతో నన్నుఁ బ్రసన్నుఁడై దరికి నాహ్వానంబు గావింప నే
డ్కరహింపం దరియం గృతప్రణుఁడనై తద్ధ్యానపై
ఖరిఁ బక్షీంద్రహయుండనై యచట సాక్షాత్కారముం జేయఁగా
నరుగంగా నల సిం జూమీ యపుడ భక్తాధీనతం దెల్పుచున్. ౨౧౪.

కం. ఆనాఁ డటు నేనరుగఁగ, నానాఁటికి నతఁడు నెమ్మినమ్మికయుఁ దగం
గా నటు పిల్వఁ దొడంగుట, నే నేగుట నాకు నిత్యకృత్యం బయ్యెన్. ౨౧౫.

గీ. అటులఁ గొన్నాళ్లు గడపి యంతట నతండు, బంధుగుల కెల్ల నిప్పనిబయలుపఱప
వార లబ్బురపడి మమ్ముఁ జూడఁ గూడఁ, జూడఁ గోరినఁ గొలనసీగాడఁ జేయ.

ఉ. వారికి నెల్లదర్శన మవారితలీల నొసంగి యాతఁడీ
తీరునఁ జేయుచుండఁ బని తీరదె మాకని వానిఁ బిల్చి యా
భీరహితంబు నేఁడు మన భీరహితాత్మత నన్ను నెప్డు మా
చేరువ నుండఁ గోరఁగ మముం జేసె వరం బిడి నారసమ్మిళన్. ౨౧౭.

గీ. అతఁడు చక్రరక్షరీజపవ్రతనిరూఢ, బుద్ధిఫలసిద్ధిఁ బడసిన యద్దరిత్రిఁ
జెందె నిల సర్వసిద్ధిప్రసిద్ధి బంధు, రంజకసరస్సునకె బంధురం బను పేరు.

కం. తొలుత నొకగొన్నిప్రొద్దుల, కొలఁదిగ నొకకొన్నియేళ్ల కొలఁదిగ నేఁడుం
దలఁగిలి నిటువైఁ దలఁగన్, వలయుం గద నేల కొలఁది వర్షంబులుగాన్. ౨౨౦.

ఉ. నావుడు నన్నుఁ గూర్చి సదనంబును మూఁడవసారి వెల్వడం
గావలె నంటి రీ రిపుడు గాన నదెట్లన నేమి కారణం
బో వినఁగన్న సందియము పోవును నాదు మనంబు లోఁ ద్రుపా
టాపహిలం దలంకెఁ జెపుమా కృప నాయపరాధము న్హరీ. ౨౨౧.

కం. అనవుడు నీ వపరాధం, బనుకొని యొనరింపకున్న నది యపరాధం
బును గాక యున్న యట్లొయక్, మునివర మాచలనమునకు మూల మెటన్నన్.

ఉ. కుక్కుటలింగమూర్తి గడుఁ గూరిమిఁ జెప్పినతారకక్రమం
బక్కడి రాజశేఖరున కంతయుఁ దెల్లముఁ జేసి వచ్చితీ
విక్కడి కాతఁ డంత జపియించెను దన్మహిమంబె యుంగనం
దొక్కవిఘంబుఁ బూని విధియుక్తిగ నిక్కడి నంబె పేర్మితోన్. ౨౨౩.

కం. తాపస్యాత్రజపంబున, సే వానికి వరము లొసఁగ నేగి తదీయం
బౌ వాంఛ యేమి యని సం, భావింపఁగవలసెఁ దత్ప్రభావము వలనన్.

సీ. ఆతఁ డా జపమునకై దీక్షఁ బూని సంకల్పించు నపుడు సాంగపరివార
ముగ మమ్ముఁ బ్రత్యక్ష మగుఁడటంచుఁ దలంప, నచ్చటికప్పుడే యరుగుమంత
నంతఁ బ్రదోషనాట్యావసరంబునఁ, గుక్కుటేశ్వరు గొల్వఁ గోరి దేవ
గుంపులై వచ్చు నిలింపు లంతంతనె, మమ్మంతరిక్షమార్గమ్మునందుఁ

తే.గీ. గాంచియెదురేగుదెంచి సమంచితముగ, నక్కడకు మమ్ముఁ గూడ రమ్మను చు వేఁడ
నింత కన్నను మే లున్నదే యటంచుఁ, జెలఁగి మేమందఱము ప్రవేశించు నపుడు.

ఉ. మాపటివిఘ్నరూపమును మానకొసంగ బవళింపఁ జేయునో
తేపకుఁ దేపకుం బ్రబలు తేజపు వేఁడిమి మగ్నమూర్తియై
పాపికొనంగనో గగనవర్త్మపరిభ్రమణప్రభూతి సం
తాపము దీఱ మజ్జన మొనర్పను భానుఁడు వారివార్ధికై. ౨౨౬.

గీ. కాలసభికాగ్రగణ్యుండు కాలగతుని, నటనపటిమావలోకనానంతరమునఁ
బారితోషిక మిడఁగ నంబరము కొసను, బసుపొసంగించె వనసంజ పసఁబొసంగె

కం. జగమంధకారితను జెం, దెఁ గదా యని తోఁడుతోన దీపకలాపం
బాగిఁ దోఁచెను ఘసితద్యుతి, యుఁ గడుం జొప్పడియె నప్పుడొప్పుగఁ జూడన్.

గీ. అంతట నిశాసుధాకర వ్యతికరమునఁ
గడలుకొను రాగమన సముద్రము రీతిఁ

బొడుపుఁ గెంజాయ రంజిల్ల • బొలుపుఁ గాంచెఁ
బ్రాక్పటంబున కొకవింత • వన్నె యిడుచు. ౨౨౯.

మ. బలభిత్ప్రోన్నతరత్నసౌధవలభీ • వ్యాలంబిరక్తచ్ఛదో
జ్జ్వలశారీకలధౌత పంజరముతో • వం దూరుపుంగొండపైఁ
బొలిచెన్ సోదయరాగలాంఛనపరీ • స్ఫూర్తిం దుషారాంశుమం
డల మూర్ధప్రతిపాదిరశ్మిగణసం • ధానస్ఫురన్మూర్తియై. ౨౩౦.

శా. ఆరేయెల్లను మున్న శంకరుని నా • ట్యం బంత భృంగీశుహా
స్యోద్యత్ప్రౌఢిమ మంత నందికృతమై • యొప్పారు గానక్రియా
పారస్యంబును బిమ్మట న్నప్రతిప • స్పందద్ధకుంభప్రభం
సారూఢోక్తులు గాలయాపనము సే • యన్నెమ్మి మై నుండఁగాన్. ౨౩౧.

సీ. తొలికోడి తానయ్యె • మొలుఁగత్తి యూఁదు భం • గులఁ గుక్కుటేశుండు • కొసరి కూసె
నాలమందల కెల్ల • నధినేత తానయ్యెఁ, బొంకంబుగా నంది • యంకెవైచెఁ
దీర్ఘంబుఁ దెచ్చుహ • స్తికిఁ బెద్ద తానయ్యె, లంబోదరుఁడు బృంహి • తంబు వొనర్చె
విహగంబులకు నెల్లఁ • బెద్ద దానై కుమా, రుని కేకి పెలుచ ని • స్స్వన మొనర్చెఁ

తే.గీ. దానె లింగార్చకులకుఁ బ్రా • థమికుఁ డగుచుఁ, బాతరనిలుండు గేతనా • గ్రమున నున్న
ఘంట మ్రోయించె వందిమా • గధులు తామె, యగుచు భక్తులు పేర్కొని • రపుడు మమ్ము.

ఉ. అంతట భానుమంతుఁ డుద • యాచలశృంగము నందుఁ దోఁచె న
త్యంతము రమ్యమైన యరు • ణాంగమునం జతురాస్యపుత్రభవం
బెంతయు నొప్పఁగా భువన • సృష్టికి నన్నతి మించు భారతీ
కాంతుని శేషముప్పఁగ జ • గజ్జనసేవ్యులు మోల నొప్పగన్. ౨౩౨.

కం. అంతటను గుక్కుటేశుఁడు, సంతసమున సముచితోప • చారమ్ముల మ
మ్మెంతయును గారవించి యొ, కింతయు భేదమ్ము లేని • హితము వలిక్పెన్. ౨౩౩.

గీ. మమ్ములను బంపు నపు డయ్యు • మాధవుండు, కొమరసామిని ధ్యావించి • కొంతె దప్పు
సాగనంపించు మని పంప • నాగుహుండు, దోడరా సేగితిమి రాజ • దుర్గమునకు.

కం. అపుడా నృపుఁ డాయం జని, చెపుమా యుపమాకనుండ • శీఘ్రము గాఁగన్.
అపముం దపముం మనుఁ గూ, ర్చి పరంతప! రాఁదలంచి • చేసితి గాదే. ౨౩౪.

కం. తచ్చితి యదుకుల వరముల, నిచ్చెద నుత్తమ్ముఁ డితఁడు • మిడ తెలిసెఁ గదా

సచ్చరిత యనిన నమ్మహి, భృచ్చంద్రుఁడు మాకు మ్రొక్కి వివరించె నిటుల్.

శా. దేవా! తారకమంత్రతత్త్వము ప్రసాదించెన్ మరుస్వామి నా
కీవే వేలుపువైనఁ గోర్కి లిడ రా వేయంచుఁ బ్రార్థించినన్
వేవేగం జనుదెంచి నీ దగుమనోభీష్టం బమోఘంబుగాఁ
గావించుం జుమి యంచుఁ దెల్పి మఱియుం గారుణ్యచిత్తంబునన్. ౨౩౮.

కం. కలి శ్రీవేంకటరమణుఁడె, తలఁపఁగఁ బ్రత్యక్షదైవతం బటుగానం
దొలుత జప మితనిఁ గూర్చియె, సలుపుము నీవాంఛితము లొసఁగ నేతెంచున్.

కం. కావున వేంకటరమణుఁడె, తావకవంశంబునందుఁ దరతరములుగా
భూవరులఁ బ్రోచుచుండెడి, నావన మొనరింపుమనుచుఁ బ్రార్థింపు మనెన్. ౨౪౦.

గీ. తన్మహామంత్రమున కధిదైవతంబు, రాముఁ డీతండు వేంకటరమణుఁ డనుచు
భేద మెంచకు మాతఁడు విభవమూర్తి, దలఁపఁగా నీతఁ డర్చావతారమూర్తి.

కం. నారదముని చెప్పిన యా, తీరున ధ్యానం బొనర్చితిని నే సాక్షా
త్కారం బొనరించితి వీ, వారీతిన్ భక్తవరద యవితథ్యవరదా. ౨౪౧.

కం. కావున నలమేల్మంగాదేవియు నీ వలమితో మదీయాన్వయముం
బ్రోవఁగ నిందు వసింపుఁడు, దేవా ప్రతినృపతి చెంతఁ దేజ మెలర్పన్. ౨౪౨.

కం. అటు లైదువేలవర్షము, లిటులై నాచంద్రతారకార్కంబులు నొ
ప్పుటబలుఁడు కుమారుఁడె, ప్పటి కప్పుడు నృపులఁ బ్రోవ వర మీవలయున్.

చం. అని యిటు లానృపాలమణి ప్రార్థనఁ జేయఁగ వాని నీవు కో
రినవర మిచ్చినార మని ప్రీతునిఁ జేసి కుమారు నింటికిన్
బనిచి సతీసమేతముగ వచ్చితి మిచ్చటి కేము నీతలం
చినగతి నయ్యెఁ గాద మునిశేఖరయంచు వచించి వెండియున్. ౨౪౪.

శా. నీ వారాజకులావతంసమున కుం డెందంబునం బ్రీతిగా
శ్రీవంశప్రతిభాప్రతాపజయసౌశీల్యాదు లెంతేనిఁ బెం
పై వర్ధిల్లఁగఁ దారకంబు భవఘోరాంభోధినిస్తారకం
బో వాచంయమివర్య తెల్పితిఁ గదే యూహించి యుక్తంబుగాన్. ౨౪౫.

కం. అందుల కేమును మోదముఁ, జెందితి మిఁక నేమి కోర్కె లున్నవొ చెపుమా
డెందమున సందేహముఁ, బొందక యని కౌశిక[illegible]. ౨౪౬.

క. స్వామీ! నిష్కాముఁడనగు, నే మిము నేమనుచుఁ గోర్కె లివి యని యడుగం
గా మదిఁ దలంతు నైనను, మీమాటకు మేరమీఱమియు నుచితమగున్. ౨౮౮.

క. కావున నీయిరుతెఱఁగుల, నీశ సొనర్పఁ దగినదిద్దియు యనుచున్
భావమునందు వితర్కము, గావించుచునుందు భక్తకల్యాణకరా. ౨౮౯.

గీ. అనిన నిష్కాము లగుతపోధనులు మున్ను
గడఁగువనులును లోకోపకారమునకుఁ
గాద యలవడె నీవు నంకర్షణిఁ జేయ
గాద యన నాతఁడు మహాప్రసాద మనుచు. ౨౯౦.

క. జనములకుఁ బ్రీతిఁ జేయుట, జగన్నివాసునకుఁ బ్రీతిఁ గలుపుట యనుచున్
దగ మున్నిటిమునిగణ మ, ప్పగిదిం గావించుచుండ వచ్చు నటంచున్. ౨౯౧.

సీ. దేవసేవనముఁ దైర్థికుఁడు గావింపఁగా, నరుగుచో స్మృతినోకింతైన నడువ
వలెనంచు నెఱిఁగినవాఁడు గావున మాని, తేవన దీక్ష నెంతేవనమునఁ
జనుచుండఁ బ్రొద్దుగ్రుంకిననాఁటిరాతిరి, నడవి దా నివసించుటాదిగాఁగ
స్వామి కంతయును విజ్ఞాపనంబొనరింప, తత్పిశాచత్వంబు తలఁగఁ జేయు
తే.గీ. టొకటియుఁ గలిగ రాజకన్యక ప్రతిలింగ, విభునిపట్టపుదేవిఁ గావించు టొకటి
యును మనంబునఁ గోర్కులై యున్న వెన్న, విన్నవించితి భక్తప్రసన్నహృదయ.

మ. అన శ్రీవేంకటనాయకుండు దరహాసాంకూరరమ్యాస్యుఁడై
యను నప్పండితమాని వ్యాఘ్రహతుఁడై యట్లయ్యె నేనాఁడు యా
చనకై గుచువచ్చునప్పు డొగి మాసంసేవనం బాచరిం
చి నటం చీగుడిఁ గాంచి మ్రొక్కి చని నీత్రోవన్ సుతాన్వితుఁడై. ౨౯౩.

గీ. మరల వచ్చునాఁడు మముఁ గొల్వ లేదు మా, కొండవంకఁ జూడకుండ బండి
మైన డిగ్గఁడయ్యె సూనుండు తెలిపిన, వినియు వినని యట్లు వెడలు మనియె.

మ. వాని తనూజ పౌత్రుఁడు స్వవార్షికలబ్ధికిఁ బీతి కాపురా
స్థానికి వచ్చి నిన్నుఁ దగుసత్కృతులం గని యింటి కేగువాఁ
డై నియమంబునం బదగ యాజలమజ్జన మాచరించి యా
నొప్పనిడెఁ బిండదానము విశుద్ధమతిన్ వ్యపితృప్రియంబుగాన్ ౨౯౪.

శా. దానం జేసియు నీవుఁ జేసిన తదుద్యద్వాఃప్లుతిం జేసియున్
వానిం బాసి తొలంగెఁ గ్రూరత యిఁకన్ బైశాచకవ్యక్తి యు
ద్దానిం బాయు నటన్న బంధురసరోంతర్వారిపూరంబులం
దానం బాడిన వీఁడు వీనిసఖులుం ధన్యాత్ము లౌదు ర్వడిన్. ౨౫౬.

గీ. అనిన నిపుడయే వచ్చెద ననుచు మౌని, వయ్యెడగ్గిరివరబహిర్భాసురైన
వాంద్ర నందుఁ బంధురవారి ముంప, నంద ఱందుండి వెల్వడు నంతలోన,

కం. ఇంగాలము లగ్నిశిఖా, సంగంబున దీప్తి వడసి క్షణమాత్రములో
నంగారములయినట్టుల, పొంగారు మనోజ్ఞరూపములఁ గని వారల్. ౨౫౮.

కం. మునుపటి కొలంది ప్రాయము, మునుపటి కొలఁది యగురూపము మునుగని వారల్
మునుపటిగొన మొక్కటిఁ గన, రనఘుంబగుతత్సరోమహత్త్వంబనదే. ౨౫౯.

కం. నారదుఁ డచట నె యున్నటు, లారక్షకుఁడైనశౌరి నరసి తదాజ్ఞన్
వారికి వందితపుడా, నారాయణుపాదదర్శనంబు ఘటించెన్. ౨౬౦.

గీ. దయనుగతపాపులయినయందఱను గాంచి, శౌరికరుణించి మీకల్మషములువాసెఁ
బావనాకృతులైతిరి భవ్యులార, యనుచుఁ గ్రమ్మఱనమ్మౌని నరసి పలికె.

కం. కరుణం ద్వారకమున ద్వష్ట్రక్షరి నుపదేశింపు మీ ప్రజకు వెస వారుం
దురు సాంతానికలోకము, లిరవులుగా నిర్వికారవృత్తి దలిర్పన్. ౨౬౨.

మ. ఇఁక నక్కన్నె త్రిలింగదేశధరణీభృన్మౌళిదేవేరియై
నాకా కాతుఁడు సుకో యటంచు మదినొక్కింత సందేహ మూ
నకు మా రాజా నిజానురక్తను గుణజ్ఞుం జూటచేఁ బెండ్లి యా
డక వర్జించునె యిట్టిచుట్టముల వీడం జూచునే యెయ్యెడన్. ౨౬౩.

కం. ఎల్లిరొ యయ్యెరువురకును, దెల్లంబుగఁ బెండ్లియగు నందే పయనంబై
తల్లి దనపరిజనముతో. నల్లునిపురిఁ జేర నరుగు నారయు మెదుటన్. ౨౬౪.

సీ. ఈముద్దుఁగొమ్మ మూఁడేండ్లప్రాయఁబున, నుండ నిక్కొండపై నున్నమమ్ముఁ
గొలువంగఁ బరిజనంబులతోడఁ దలిదండ్రు, లేతెంచి మాకు సంప్రీతిఁ జేయ
వంధ్రదేశేంద్రుపురంధ్రియా నిది యంచు, వరము మే మొసఁగంగ బడసి యొసు
నళు దంగరక్షకై యస్మదాకృతితోడి, కనకప్రతిమ దీని కంఠసీమ

తే. హారతరళంబుగాఁ గూర్చి యరుగునంత, వత్సరంబున నగ్గజధ్వజవిభుండు
వినయవతియందుఁగలభాంకుఁడనెడివిభునిఁ, గనియెనీభద్రమతియును కన్య వెనుక

గీ. స్వాప మెప్పుడు నొప్పదు సాంధ్యవేళ, ముక్తమూర్ధజులై నిద్రపోవఁ గూడ
దనుచు నిమ్మద్దియ లెఱుంగ కట్టెనర్చు, నంతనంతర మొదవె భూతాళిగవియ.

చం. అది యటు లుండ నిమ్ము సముదారుఁ డమానుషబాహుశౌర్యుఁ డు
న్మదరిపుహారి శ్రీశపుర నాథుఁడు పుణ్యయశోభిధానుఁ డొ
ప్పిద ముగ నెల్లి భద్రమతిఁ బెండిలి యా నిక వత్సరంబులో
హృదయ మెలర్ప మేము వసియింపఁగ నచ్చటి కేఁగా వలెన్. ౨౮౭.

ఉ. తద్దయు నీవు లోకహితతత్పరతన్ మముఁ గొన్ని కోరి తిం
కెద్దియు నేనిఁ గోర్కె గల దేని ఘటింతుము నేఁడు మంచునా
వద్దివిజేంద్రవందితు దయారసమానసు వేంకటేశ్వరుం
బెద్దయుఁ బ్రొద్దు కోర్కె లిడఁ బేర్కొని యమ్మని పల్కె నిమ్మెయిన్. ౨౮౮.

సీ. సుకవిసారస్వతస్ఫురణంబు రసికాంత,రంగరంజకమై యెసంగవలయు
నృపనయవ్యాపార మేపార దాక్షిణ్య,మున జనావనప్రవృత్తిఁ బూనవలయుఁ
బర్జన్యుఁ డనుకూల వర్షియై కర్షక,హర్షకరోత్కర్ష సలర వలయు
జనపదంబులు సుభిక్షంబులై తృణకాష్ఠ, జలసమృద్ధములుగాఁ జెలఁగ వలయుఁ

తే.గీ. బ్రకృతిజనసంచయంబుఁ బరస్పరంబు, చెలిమి పాటించి పాడిమై నెలమిగాంచి
కలిమిని వహించి పాడిపంటల రహించి, రాజవిశ్వాసపరతఁ జేఁబ్రబల వలయు.

కం. అని ముని యాశాస్యము దెల్పిన విని గరుడాద్రివాసి వేంకటరమణుఁ
డను మోదంబున నిప్పని, కనుమతి గావింతు ననుచు ననియెం గరుణన్.

సీ. బ్రహ్మవిద్యామహా ప్రజ్ఞానిధిత్వంబు, దివిజేంద్రసదృశవైభవసమృద్ధి
యదితికశ్యపసమానాపత్యయోగంబు, నంద్రనాయకకౌతుకానుషక్తిఁ
నారదప్రతిమానతారకజపసిద్ధి, ధూర్జటినిభధూతదోషవృత్తి
హీనభూతాభసాంతానికలోకాప్తి, వల్లవతుల్యకైవల్యపదవి

తే.గీ. యేతదస్మత్ప్రపూతవిఖ్యాతమహిమ, సహితమహితకథావిశ్రవణపఠన
నిరతనిరతుల కొదవు నూనివర! వార,లున్నెడల నీతలంచి నన్నుఁబొందుఁ జుమ్ము.

గీ. అడరు మునివాస మెంటిమామిడి యనంగ, విప్రరాక్షసురాని రావికముపాడు
ద్విజుఁడు వార్చెద ననుగుంటతేటగుంట, వల్లవులపల్లె గోపాలపట్టణంబు.

శా. లోకానుగ్రహకాంక్ష నీగతిఁ గృపాళుండై మరుస్వామికా
శ్రీకాంతుఁడు వరంబు లిచ్చి దని యించెం దార్క్ష్యభూమీధరం
స్తోత్రశ్రీమహిమంబు శౌనకముఖర్షుల్ ప్రీతిఁ బొందంగ వి
ద్యాకల్పుం డగుసూతుఁడుం దెలిపె నిట్లత్యంతమోదంబునన్. ౨౭౩.

మ. శుభసంధాయక శాలివాహశకేషుశ్రోత్రహస్తీందు (౧౮౨౫) ప
చ్ఛుభకృద్వత్సరచైత్రశుద్ధనవమీశుభ్రాంశుజాహంబునం
దు భవద్భావుక పాదమూలమున నెంతో భక్తి నర్పించితిం
బ్రభుతం గైకొని రామ యీకృతిఁ గృపం బ్రఖ్యాతి నొందింపవే. ౨౭౪.

కం. శ్రీరమ్యగుణస్తోమా! శారాజత్కీర్తికామ! రాజలలామా!
గౌరీసన్నుతనామా! తారకమంత్రార్థతత్త్వధామా! రామా. ౨౭౫.

శా. లంకారాజ్యనివేశితారిసహజశ్లాఘార్హభావానిరా
తంకప్రౌఢబలాబలా! హితహితార్థప్రేషితస్వర్ణప
త్పంక్తీసత్సరపారితోషితనితాంతప్రీతరత్నాంగనా
లంకారద్వయదానమోదపరిఖేలద్వాయుజాతాంగదా. ౨౭౬.

మానిని. శ్రీవిభవాస్పదశంఖరథాంగకచిహ్నమనోహరమంజుసదా
భావుకదేవులపల్లికులప్రభవద్విజపూజితభవ్యపదా!
రావుకులోత్తమరాజశిఖామణిరామధరావరనందనస
ద్భావకుమారమహీపతిసూర్యనృపాలముహుఃపరిపాలనధీ. ౨౭౭.

గ ద్య ము.

ఇది శ్రీమద్రామనామపారాయణపరాయణాతిధన్య కౌండిన్యగోత్రపవిత్ర
దేవులపల్లికులపయఃపయోనిధికళానిధిసీతారామశాస్త్రిపౌత్ర వేంకట
కృష్ణశాస్త్రిపుత్ర తమ్మనాభిధానాంతర వేంకటకృష్ణశాస్త్రి
నామాగ్రజన్మ త్రిలింగదేశాగ్రజన్మ సుధీవిధేయ సుబ్బ
రాయ నామధేయ ప్రణీతం బైన మహేంద్ర
విజయం బను ప్రబంధంబు నందు
సర్వంబు
స ప్తా శ్వా స ము.
శ్రీరామార్పణమస్తు.

